॥ శ్రీహరిః ॥

1028

# గీతా మాధుర్యము

गीता माधुर्यमु ( तेलुगु )



गीताप्रेस गोरखपुर
GITA PRESS, GORAKHPUR

వ్యాఖ్యాత - స్వామి రామసుఖదాస్

॥ శ్రీహరిః ॥

1028

# గీతా మాధుర్యము

## गीता माधुर्यमु (तेलुगु)

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ

హిందీమూలము

**స్వామి శ్రీ రామసుఖదాస్**

ఆంధ్రానువాదము

**మదునూరి వెంకటరామశర్మ**

గీతాప్రెస్, గోరఖ్‌పూర్

*Books are also available at—*

1. Gita Press, Gorakhpur Ki Pustak-Dukan,
   Dukan No. 41, 4-4-1, Dilshada Plaza,
   Sultan Bazar, Hyderabad ✆ (040) 24758311, 66758311
2. Secunderabad, Railway Station, Platform No. 1
3. Vijayawada, Railway Station, Platform No. 6

Translated by :

**M.Venkata Rama Sharma**

Nineteenth Reprint 2021 4,000

Total 97,500

❖ **Price : ₹ 25**

**( Twenty-five Rupees only )**

कूरियर/डाकसे मँगवानेके लिये
गीताप्रेस, गोरखपुर—273005
**book.gitapress.org**
**gitapressbookshop.in**

Printed & Published by :

**Gita Press, Gorakhpur**
(a unit of Gobind Bhavan-Karyalaya, Kolkata)

Phone : (0551) 2334721, 2331250, 2331251

web:**gitapress.org** e-mail:**booksales@gitapress.org**

॥ శ్రీహరిః ॥

# నమ్ర నివేదన

మానవకోటిని సన్మార్గము నందు నడిపించుటకు సహాయపడు మహాగ్రంథములలో 'శ్రీమద్భగవద్గీత' సర్వోత్కృష్టమైనది. అధిక సంఖ్యాకులు పఠించుటకు అనువుగా పూజ్యులైన స్వామీ శ్రీరామసుఖదాస్‌గారు ఈ గ్రంథమును ప్రశ్నోత్తరరీతిలో మధురమైన భాషలో రచించిరి. భాష సరళముగా ఉండుటవలన సామాన్య పాఠకులకు సులభముగా అర్థమగుటయేగాక వారికి దీనియందు అభిరుచియు పెఱుగును. మూలశ్లోకములు చేర్చబడినందున నిత్య పారాయణమునకును ఈ గ్రంథము మిక్కిలి ఉపయోగకరము. దీనికి సరళమైన తెలుగు అనువాదమును అందించిన శ్రీమదునూరి వెంకటరామశర్మగారికి మా ధన్యవాదములు.

సహృదయులగు తెలుగు పాఠకులు ఈ పుస్తకమును తాము స్వయముగా పఠించుటయేగాక తమ బంధుమిత్రుల చేతను పఠింప జేయుదురని మా ఆకాంక్ష.

తరించుట మీ వంతు - సంతసించుట మా వంతు

- ప్రకాశకులు

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# శ్రీమద్భగవద్గీత

## అథ కరన్యాసధ్యానాదయః

ఓం అస్య శ్రీమద్భగవద్గీతామాలామన్త్రస్య భగవాన్ వేదవ్యాస ఋషిః ॥ అనుష్టుప్ ఛన్దః ॥ శ్రీకృష్ణః పరమాత్మా దేవతా ॥ అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ఇతి బీజమ్ ॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ఇతి శక్తిః ॥ అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ఇతి కీలకమ్ ॥

### ॥ అథ కరన్యాసః ॥

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావక ఇత్యంగుష్ఠాభ్యాం నమః ॥ న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుత ఇతి తర్జనీభ్యాం నమః ॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ఇతి మధ్యమాభ్యాం నమః ॥ నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతన ఇత్యనామికాభ్యాం నమః ॥ పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశ ఇతి కనిష్ఠికాభ్యాం నమః ॥ నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ఇతి కరతలకరపృష్ఠాభ్యాం నమః ॥

*॥ ఇతి కరన్యాసః ॥*

## ॥ అథ హృదయాదిన్యాసః ॥

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావక ఇతి హృదయాయ నమః ॥ న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుత ఇతి శిరసే స్వాహా ॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ఇతి శిఖాయై వషట్ ॥ నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతన ఇతి కవచాయ హుమ్ ॥ పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశ ఇతి నేత్రత్రయాయ వౌషట్ ॥ నానావిధాని దివ్యాని నానా వర్ణాకృతీని చ ఇతి అస్త్రాయ ఫట్ ॥ ఇతి హృదయాదిన్యాసః ॥

॥ శ్రీకృష్ణ ప్రీత్యర్థే పాఠే వినియోగః ॥

# అథ ధ్యానమ్

ఓం పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యేమహాభారతమ్ ।
అద్వైతామృతవర్షిణీం భగవతీమ్ అష్టాదశాధ్యాయినీమ్
అంబ త్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్ ॥ 1 ॥

నమోఽస్తు తే వ్యాస విశాలబుద్ధే ఫుల్లారవిందాయతపత్రనేత్ర ।
యేన త్వయా భారతతైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః ॥ 2 ॥

ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే ।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః ॥ 3 ॥

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 4 ॥

భీష్మద్రోణతటా జయద్రథజలా గాంధారనీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా! ।
అశ్వత్థామవికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకః కేశవః ॥ 5 ॥

పారాశర్యవచః సరోజమమలం గీతార్థగంధోత్కటం
నానాఖ్యానకకేసరం హరికథా సంబోధనాబోధితమ్ ।
లోకే సజ్జనషట్పదైః అహరహః పేపీయమానం ముదా
భూయాద్భారతపంకజం కలిమల ప్రధ్వంసి నః శ్రేయసే ॥ 6 ॥

మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్ ।
యత్కృపా తమహం వందే పరమానందమాధవమ్ ॥ 7 ॥

శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాధారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్ ।
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥ 8 ॥

యం బ్రహ్మా వరుణేంద్రరుద్రమరుతః స్తున్వంతి దివ్యైః స్తవైః
వేదైః సాంగపదక్రమోపనిషదైః గాయంతి యం సామగాః ।
ధ్యానావస్థితతద్గతేన మనసా పశ్యంతి యం యోగినో
యస్యాంతం న విదుః సురాసురగణా దేవాయ తస్మై నమః ॥ 9 ॥



# శ్రీమద్భగవద్గీతా మాహాత్మ్యమ్

గీతాశాస్త్రమిదం పుణ్యం యః పఠేత్ ప్రయతః పుమాన్ ।
విష్ణోః పదమవాప్నోతి భయశోకాదివర్జితః ॥ 1
గీతాధ్యయనశీలస్య ప్రాణాయామ పరస్య చ ।
నైవ సంతి హి పాపాని పూర్వజన్మకృతాని చ ॥ 2
మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే ।
సకృద్గీతాంభసి స్నానం సంసారమలనాశనమ్ ॥ 3
గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః ।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిఃసృతా ॥ 4
భారతామృతసర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిఃసృతమ్ ।
గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే ॥ 5
సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః ।
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥ 6
ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతమ్
ఏకోదేవో దేవకీపుత్ర ఏవ ।
ఏకో మంత్రస్తస్య నామాని యాని
కర్మాప్యేకం తస్య దేవస్య సేవా ॥ 7



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# శ్రీ గీతామాహాత్మ్యమ్

ధరోవాచ

భగవన్! పరమేశాన! భక్తిరవ్యభిచారిణీ! ।
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో ॥ 1 ॥

శ్రీవిష్ణురువాచ

ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా ।
స ముక్తః స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ॥ 2 ॥

మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।
క్వచిత్ స్పర్శం న కుర్వన్తి నలినీదళమంభసా ॥ 3 ॥

గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే ।
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై ॥ 4 ॥

సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చ యే ।
గోపాలా గోపికా వాఽపి నారదోద్ధవ పార్షదైః ।
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే ॥ 5 ॥

యత్ర గీతా విచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్ ।
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి ॥ 6 ॥

గీతాశ్రయేఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్ ।
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్ లోకాన్ పాలయామ్యహమ్ ॥ 7 ॥

గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః ।
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్యపదాత్మికా ॥ 8 ॥

చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్ ।
వేదత్రయీ పరానందతత్త్వార్థజ్ఞానమంజసా ॥ 9 ॥

యోఽష్టాదశ జపేన్నిత్యం నరో నిశ్చలమానసః ।
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్ ॥ 10 ॥

పాఠేఽసమర్థస్సంపూర్ణే తదర్ధం పాఠమాచరేత్ ।
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః ॥ 11 ॥

త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్ ।
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్ । 12 ।

ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తిసంయుతః ।
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసేచ్చిరమ్ । 13 ।

అధ్యాయశ్లోకపాదం వా నిత్యం యః పఠతే వరః ।
స యాతి నరతాం యావన్మనుకాలం వసుంధరే! । 14 ।

గీతాయాః శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్ ।
ద్వౌత్రీనేకం తదర్థం వా శ్లోకానాం యః పఠేన్నరః । 15 ।

చంద్రలోక మవాప్నోతి వర్షాణామయుతం ధ్రువమ్ ।
గీతాపాఠ సమాయుక్తో మృతో మానుషతాం వ్రజేత్ । 16 ।

గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తిముత్తమాం ।
గీతేత్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్ । 17 ।

గీతార్థ శ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా ।
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే । 18 ।

గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః ।
జీవన్ముక్తః స విజ్ఞేయో దేహాంతే పరమం పదమ్ । 19 ।

గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః ।
నిర్ధూతకల్మషా లోకే గీతా యాతాః పరం పదమ్ । 20 ।

గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్ ।
వృథాపాఠో భవేత్ తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః । 21 ।

ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః ।
స తత్ఫలమవాప్నోతి దుర్లభాం గతిమాప్నుయాత్ । 22 ।

సూత ఉవాచ

మహాత్మ్యమేతద్గీతాయా మయా ప్రోక్తం సనాతనమ్ ।
గీతాంతే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్ । 14 ।

ఇతి శ్రీవరాహపురాణే గీతామాహాత్మ్యం సంపూర్ణమ్

(గీతా పారాయణమైన పిదప గీతా మాహాత్మ్యమును పఠింపవలెను.)

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# శ్రీమద్భగవద్గీత

## మొదటి అధ్యాయము - అర్జున విషాదయోగము

ధృతరాష్ట్ర ఉవాచ

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ ।1।

సంజయ ఉవాచ

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా ।
ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్ ।2।

పశ్యైతాం పాండుపుత్రాణామ్ ఆచార్య మహతీం చమూమ్ ।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ।3।

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి ।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ।4।

ధృష్టకేతుశ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్ ।
పురుజిత్ కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః ।5।

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ।6।

అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే ।7।

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిస్తథైవ చ ।8।

అన్యే చ బహవః శూరా మదర్థే త్యక్తజీవితాః ।
నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః । 9 ।

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్ ।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్ । 10 ।

అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః ।
భీష్మమేవాభిరక్షంతు భవంతః సర్వ ఏవ హి । 11 ।

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః ।
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్ । 12 ।

తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః ।
సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్ । 13 ।

తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ ।
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః । 14 ।

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః । 15 ।

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః ।
నకులః సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ । 16 ।

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః ।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః । 17 ।

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే ।
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్ । 18 ।

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్ । 19 ।

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః ।20।

హృషీకేశం తదా వాక్యమ్ ఇదమాహ మహీపతే ।

అర్జున ఉవాచ

సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ।21।

యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్ ।
కైర్మయా సహ యోద్ధవ్యమ్ అస్మిన్ రణసముద్యమే ।22।

యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధే ప్రియచికీర్షవః ।23।

సంజయ ఉవాచ

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ।24।

భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి ।25।

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా। 26।

శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ।
తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూనవస్థితాన్ ।27।

కృపయా పరయావిష్టో విషీదన్నిదమబ్రవీత్ ।

అర్జున ఉవాచ

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్ ।28।

సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ।29।

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః । 30 ।

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే । 31 ।

న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా । 32 ।

యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ । 33 ।

ఆచార్యాః పితరః పుత్రాః తథైవ చ పితామహాః ।
మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబంధినస్తథా । 34 ।

ఏతాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే । 35 ।

నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిః స్యాజ్జనార్దన ।
పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః । 36 ।

తస్మాన్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్ ।
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ । 37 ।

యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః ।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ । 38 ।

కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్ ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన । 39 ।

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్నమ్ అధర్మోఽభిభవత్యుత । 40 ।

అధర్మాభిభవాత్ కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః । 41 ।

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః । 42 ।

దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః ।
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః । 43 ।

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।
నరకేఽనియతం వాసో భవతీత్యనుశుశ్రుమ । 44 ।

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః । 45 ।

యది మామప్రతీకారమ్ అశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్ । 46 ।

సంజయ ఉవాచ

ఏవముక్త్వార్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః । 47 ।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే "అర్జున విషాదయోగో" నామ ప్రథమోఽధ్యాయః ॥ 1 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# గీతా మాధుర్యము

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥
ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే ।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః ॥

## మొదటి అధ్యాయము- అర్జున విషాదయోగము

**పాం**డవులు పన్నెండు సంవత్సరముల అరణ్యావాసము, ఒక సంవత్సరము అజ్ఞాతవాసమును పూర్తిచేసిన పిమ్మట ఒప్పందము ప్రకారంగా తమకు రావలసిన అర్ధరాజ్యము నిమ్మని కోరినప్పుడు, అందుకు సమాధానంగా దుర్యోధనుడు యుద్ధం చేయకుండా సూదిమొనమోపినంత భూమిని కూడా పాండవులకిచ్చుటకు సమ్మతింపలేదు. కావున పాండవులు తమ తల్లి కుంతీదేవి ఆజ్ఞానుసారముగా యుద్ధము చేయుటకై అంగీకరించినారు. ఈ విధంగా కౌరవ పాండవుల మధ్య యుద్ధం నిశ్చయమైనది. తదనుగుణ్యాముగా ఇరువైపుల నుండి యుద్ధసన్నాహములు జరుగుచుండెను.

శ్రీ వేదవ్యాస మునీంద్రులకు ధృతరాష్ట్రుని యెడల మిక్కిలి ప్రేమ యుండెను. ఇట్టి ప్రేమ కారణంగా ఆయన ధృతరాష్ట్రుని వద్దకు వచ్చి ఇట్లనెను- "యుద్ధము జరుగుట, అందులో క్షత్రియులు సంహరింపబడుట తప్పనిసరిగా జరుగనున్నది. దీనినెవ్వరూ తప్పింపలేరు. ఒకవేళ నీవు జరుగబోవు యుద్ధమును చూడగోరెదవేని, నీకు నేను దివ్యదృష్టి నొసగెదను. తద్వారా నీవు ఉన్నచోటనే ఉండి జరుగుచున్న యుద్ధాన్ని ఉన్నదున్నట్లుగా చూడగలిగెదవు."

ఇందుకు జవాబుగా ధృతరాష్ట్రుడిట్లనెను - "నేను జన్మాంధుడను. ఇప్పుడు నా వంశనాశనమును నేను చూడకోరడము లేదు. కాని యుద్ధము జరిగే తీరును గురించిన సమాచారమును తప్పక వినగోరుచున్నాడను."

అప్పుడు వ్యాసుడు - "నేను సంజయునకు దివ్యదృష్టి నొసగెదను. దానివలన అతడు సంపూర్ణ యుద్ధమును, అన్ని సంఘటనలను, సైనికుల మనస్సులో కలిగెడు భావాలను సైతము తెలిసికొనగలడు, వినగలడు, చూడగలడు, ఇట్టి సకల విషయములను నీకు వినిపించగలడు కూడా" అని చెప్పి వ్యాసుడు సంజయునకు దివ్యదృష్టిని ప్రసాదించెను.

నిర్ణయింపబడిన సమయమునకు కురుక్షేత్రములో యుద్ధమారంభ మయ్యెను. పదిదినముల వరకు సంజయుడు యుద్ధభూమి నందే యుండెను. భీష్మపితామహుడు బాణములచేత రథమునుండి పడద్రోయబడిన సమాచారమును సంజయుడు ధృతరాష్ట్రునకు వినిపించెను. ఇట్టి వార్త వినిన ధృతరాష్ట్రునకు మిక్కిలి దుఃఖము కలుగగా అతడు విలపింపసాగెను. అనంతరమాయన పూర్తి యుద్ధ వృత్తాంతమును వినిపింపుమని సంజయుని కోరెను. శ్రీమహాభారతములోని భీష్మపర్వమునందలి ఇరువది నాలుగవ అధ్యాయము వరకు సంజయుడు యుద్ధసంబంధమగు సంగతులను ధృతరాష్ట్రునకు వినిపించెను. ఇరువది ఐదవ అధ్యాయారంభమున ధృతరాష్ట్రుడు సంజయుని ఇట్లు అడుగుచున్నాడు --

**ఓ సంజయా! ధర్మభూమియగు కురుక్షేత్రమునందు యుద్ధము జేయుటకై సన్నద్ధులైన నా వారు, పాండుపుత్రులును ఏమిజేసిరి? (1)**

అందుకు సంజయుడిట్లనెను- వ్యూహరచన నిర్మాణంతో నిలిచిన పాండవ సైన్యమును చూచిన దుర్యోధనుడు ద్రోణాచార్యుల చెంత కేగెను.(2)

**ద్రోణాచార్యుని వద్దకు వెళ్ళి అతడు ఏమి చేసెను సంజయా?**

ద్రోణాచార్యుల వద్దకు వెళ్ళి అతడిట్లనెను - ఓ ఆచార్యా! మీరు మీ శిష్యుడగు ద్రుపద పుత్రునిద్వారా వ్యూహాత్మకంగా నిలుపబడిన ఈ గొప్పదైన పాండవసైన్యమును తిలకించండి. (3)

**దుర్యోధనా! పాండవ సైన్యంలో నేను ఎవరెవరిని చూడాలి?**

ఈ సైన్యంలో బలంలో భీమునివంటివారు, యుద్ధనైపుణ్యంలో అర్జునుని వంటివారగు గొప్ప ధనుర్ధారులగు శూరులు, వీరులున్నారు. సాత్యకి, విరాటుడు, మహారథి ద్రుపదుడు, ధృష్టకేతు, చేకితానుడు, పరాక్రమశాలి కాశిరాజు, పురుజిత్తుడు, కుంతిభోజుడు, శైబ్యుడు, యుధామన్యుడు, పరాక్రమవంతుడగు

ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ద్రౌపదీదేవి యొక్క ఐదుగురు కుమారులు (ఉపపాండవులు) కూడా ఉన్నారు. వీరందరునూ మహారథులే సుమా!

**పాండవ సేనలోని వీరుల పేర్లను నీవు తెల్పినావు అయితే మరి మన సైన్యంలోగల శూరుల పేర్లను తెలుపలేవా దుర్యోధనా?**

ఓ బ్రాహ్మణోత్తమా! మన సైన్యంలోని గొప్ప పురుషుల పేర్లను కూడా తాము ఆలకించండి. తమరు (ద్రోణాచార్యులు) భీష్మ పితామహుడు, కర్ణుడు, సంగ్రామవిజయుడగు కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, భూరిశ్రవుడు, వీరేగాక ఇంకనూ అనేక విధములైన శస్త్రాస్త్రములను ధరించినట్టి, యుద్ధకళలో ఆరితేరినటువంటి, నా కొరకై తమ ప్రాణములను త్యజించునట్టి అనేక శూరులు, వీరులు ఎందరెందరోనున్నారు. (7-9)

**సంజయా! ఇరుపక్షాలకు చెందిన గొప్ప యోధులను చూపించిన పిదప దుర్యోధనుని మనసునకేమి తోచెను?**

ఉభయ పక్షపాతియగు భీష్ముని ద్వారా రక్షింపబడుచున్న మా సైన్యము పాండవసేనను జయించుటకు అపర్యాప్తమై - అసమర్థమై యున్నది. స్వపక్షపాతి యగు భీమునిద్వారా రక్షింపబడుచున్న ఆ సైన్యము, మన సైన్యము మీద విజయం సాధించుటకు పర్యాప్తమై - సమర్థమై యున్నదని అతని మనస్సునకు తోచెను. (10)

**ఇలాంటి భావం అతని మనసులో కలిగిన మీదట అతడేమి చేసెను సంజయా?**

దుర్యోధనుడు తన శూరవీరులందరినుద్దేశించి - మీరందరునూ తమ తమ స్థానములయందు నిలిచియుంటూ నలువైపులనుండి భీష్ముని రక్షింపుడని చెప్పెను.❖ (11)

**తన రక్షణ గురించిన సంగతిని విని భీష్ముడు ఏమి చేసెను సంజయా?**

---

❖ ద్రోణుడు, భీష్ముడు ఉభయ పక్షపాతులని దుర్యోధనునకు బాగుగా తెలియును. కావున వారిని ఒప్పించి తనవైపు తెచ్చుకోవడానికై దుర్యోధనుడు ముందుగా ద్రోణాచార్యుల వద్దకు వెళ్ళెను. అటులే భీష్ముని ఒప్పించుటకై అతని రక్షించుమని వీరులందరితో చెప్పుచున్నాడు.

దుర్యోధనుని సంతసింపజేయుటకై భీష్ముడు శంఖము నూదెను. కాని దీనిని కౌరవ సైన్యము యుద్ధారంభమునకు సూచనగా భావించెను. కనుక భీష్ముడు శంఖమును మ్రోగించిన వెంటనే కౌరవసైన్యము తమ తమ శంఖములు, భేరులు, మృదంగములు, తప్పెటలు, కొమ్ములు ఒక్కుమ్మడిగా మ్రోగించెను. ఆ ధ్వనులతో దిక్కులన్నియు పిక్కటిల్లినవి. (13)

**సంజయా! కౌరవసేన యుద్ధ వాద్యములు మ్రోగిన పిమ్మట ఏమి జరిగినది?**

కౌరవసేన వాద్యములు మ్రోగిన వెంటనే పాండవసేన వాద్యములు మ్రోగవలసియుండెను. కాని ఆ సైన్యమున కెలాంటి ఆజ్ఞలందలేదు. అప్పుడు తెల్లని గుఱ్ఱములను కలిగిన గొప్ప రథమునందు కూర్చొనిన శ్రీకృష్ణభగవానుడు పాంచజన్యము అను పేరుగల, అర్జునుడు దేవదత్తమను పేరుగల దివ్యశంఖములను పూరించిరి. అటుపిమ్మట భీమసేనుడు పౌండ్రకమను, యుధిష్ఠిరుడు అనంతవిజయమను, నకులుడు సుఘోషమను, సహదేవుడు మణిపుష్పకమను పేరుగల శంఖములను పూరించిరి. (14-16)

**ఇంకనూ ఎవరెవరు శంఖములను పూరించిరి సంజయా?**

రాజా! పాండవ సైన్యంలోని ధనుర్ధారియగు కాశిరాజు, మహారథి శిఖండి, ధృష్టద్యుమ్నుడు, విరాటరాజు, అజేయుడగు సాత్యకి, ద్రుపదరాజు, ద్రౌపది పుత్రులైదుగురు, సుభద్రాదేవి పుత్రుడగు మహాబాహువు (అభిమన్యుడు) - లాంటి మహారథులందరును తమ తమ శంఖములను పూరించిరి. (17-18)

**పాండవ సేనల శంఖధ్వనుల పరిణామమెట్లున్నది సంజయా?**

ఆ భయంకర ధ్వనులు అటు ఆకాశమును, ఇటు భూమిని దద్దరిల్ల జేయుచూ, అన్యాయంగా రాజ్యభోగమును హరించుచున్న మీ వైపునగల సైనికుల గుండెలను బ్రద్దలొనర్చినవి. (19)

**ఇరువైపుల నుండి శంఖములు పూరింపబడిన పిమ్మట పాండవులేమి జేసిరి?**

శంఖములు ఊదిన పిమ్మట యుద్ధమారంభమగు తరి (సమయమున) మీ వార (కౌరవు)లను గాంచిన కపిధ్వజుడగు అర్జునుడు తన ధనుస్సు నెక్కు పెట్టి హృషీకేశునితో ఇట్లనెను - 'ఓ అచ్యుతా! నా రథమును ఇరుసేనల నడుమ నిలుపుము.' (20-21)

**అర్జునా! మధ్యలో రథమును నిలుపుటెందులకు?**

యుద్ధము చేయు కోరికతో ఈ రణభూమియందు నిలిచిన వీరులలో ఎవరెవరితో పోరు సల్పవలెనో, వారందరిని నేను చూడాలి. ఇంకనూ దుర్యోధనునకు ప్రీతిని గూర్చు ఉబలాటముతో యుద్ధమునకు విచ్చేసిన వారిని కూడా నేను చూడాలికదా! (22-23)

**అర్జునుడిట్లు నుడివిన పిమ్మట భగవానుడేమి చేసెను?**

సంజయుడిట్లు చెప్పెను - ఓ రాజా! అర్జునుడు ఇట్లు చెప్పిన మీదట, భీష్మద్రోణులు మరియు ఇతర ముఖ్యమైన రాజులందరి ముందు, ఉభయ సైన్యముల మధ్యభాగంలో శ్రీకృష్ణుడు రథమును నిలిపి, 'పార్థా! అదుగో! ఒకచోట చేరిన కురువంశీయుల నందరిని వీక్షింపుము'ని చెప్పెను. (24-25)

**భగవానుడిట్లు చెప్పిన పిదప ఏమి జరిగెను?**

అప్పుడచటి ఉభయ సైన్యాలలోని తండ్రులను, తాతలను, గురువులను, మామలను, సోదరులను, పుత్రులను, పౌత్రులను, మిత్రులను, ప్రియమైన వారిని, బంధువర్గమును జూచిన పృథానందనుడగు అర్జునుడు మిక్కిలి వ్యామోహముతో విలపింపసాగెను.

**సంజయా విలపించుచున్న అర్జునుడు ఏమి చెప్పెను?**

అర్జును డిట్లనెను - "ఓ కృష్ణా! యుద్ధమునకై ఎదురుగా నిలిచిన మా స్వంత కుటుంబీకులందరిని గాంచి నా యంగములన్నియు శిథిలము లగుచున్నవి, నోరు ఎండిపోవుచున్నది. ఒడలంతయు వణుకుచున్నది, గగుర్పాటు కలుగుచున్నది. గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. చర్మము కాలిపోవుచున్నది. ఈ స్థితిలో నేను వారిముందు నిలువలేక పోవుచున్నాను. నా మనస్సు భ్రమించుచున్నది." (26-30)

**ఇంతేగాక ఇంకేమి గాంచుచుంటివి అర్జునా?**

కేశవా! అపశకునములను కూడా గాంచుచుంటిని. ఈ యుద్ధమునందు స్వజనులను హతమార్చుట శ్రేయస్కరముగా కన్పించుటలేదు. (31)

**యుద్ధము చేయకుండా రాజ్యము లభించుటెట్లు?**

కృష్ణా! నేను విజయం కోరడంలేదు. రాజ్యం కోరడంలేదు. సుఖమునూ

కోరడంలేదు. గోవిందా! మాకు విజయంతోగాని, రాజ్యంతోగాని, సుఖంతోగాని, చివరకు జీవించికూడా లాభమేమి?

**అయితే నీకు రాజ్యమూ, విజయమూ పట్టనిచో యుద్ధము చేయవలెనను తలంపు నీకేల కలిగెను?**

మేము ఎవరికొరకై రాజ్యము, సుఖము, భోగములను అపేక్షించు చున్నామో, వారందరు ధనప్రాణాదులపై ఆశవదిలి, మరణించుటకై ఇచట నిలిచి యున్నారు కదా! (33)

**వారు ఎవరయ్యా?**

గురువులు, తండ్రులు, కుమారులు, తాతలు, మేనమామలు, మామలు, బావలు ఇంకనూ అనేక బంధువులు గలరు. (34)

**ఒకవేళ వీరంతా కలిసి నిన్నే చంపదలచి ముందుకు వచ్చినచో?**

అయ్యా! వారు నన్ను చంపినాసరే, నాకు త్రిలోకాధిపత్యము లభించినాసరే, నేను మాత్రము వారిని వధింపను. అట్టి తరి భూలోక రాజ్యమును గూర్చి చెప్పనేల. (35)

**ఓయీ! మిత్రమా! రాజ్యం లభించిన పిదప మహదానందం కలుగుతుంది కదా! నీవు దానిని కూడా కోరకుందువా?**

ఓ జనార్దనా! ఈ ధార్తరాష్ట్రులను (వీరు మాకు కూడా కావలసిన వారే) వధించుట వలన మాకేమి సంతోషము? ఈ ఆతతాయులను చంపుట వలన మరింత పాపమే కలుగుతుంది కదా! (36)

**అయినచో నీవేమి చేయుదువు?**

ఓ మాధవా! మేము ఇంకేదైనా చేయగలము. అయితే మేము మా స్వజనులను చంపగోరడము లేదు. మా వారిని వధించి మేము ఎట్లు సుఖింపగలము? (37)

**వారు నిన్ను వధించుటకు సిద్ధంగా ఉన్నారు కదా! ఇక నీవేల వెనుకాడుచుంటివి?**

మహాప్రభో! వారిలో లోభత్వం (రాజ్యకాంక్ష) వచ్చి చేరింది. అందుచేత వారు వంశనాశనం వలన కలిగే పాపాన్ని, మిత్రద్రోహం వల్ల సంభవించెడు పాతకాన్ని గ్రహించలేకపోతున్నారు. (38)

**వారు గ్రహించరు, మరి నీవేల గ్రహించుచుంటివి?**

ఓ జనార్దనా! వంశనాశము వల్ల వచ్చే దోషాన్ని బాగా తెలిసిన మనమైనా కనీసము ఆ పాపమునుండి విముఖులము కావలెను. ఎందుకంటే ఆ దురాశ మనలను ఏమి చేయలేకున్నది కదా! (39)

**కులనాశనం వలన ఎటువంటి దోషం కలుగుతుంది?**

కులనాశనంతో అనాదిసిద్ధంగా వస్తున్న కులధర్మాలు (వంశపరంపర) అన్నియు నశించిపోవును. (40)

**కులధర్మం నశించిన మీదట ఏమి జరుగును?**

కులధర్మము నశించిపోగా వంశమంతటా అధర్మం అలుముకుంటుంది. (40)

**అధర్మం అలుముకున్నచో ఏమగును?**

అధర్మం ప్రబలినప్పుడు కులస్త్రీలు చెడిపోయెదరు. (41)

**కుల స్త్రీలు చెడిపోయినచో ఏమగును?**

కుల స్త్రీలు చెడిపోయినచో వర్ణ సంకర మేర్పడును. (41)

**వర్ణ సంకరంవల్ల ఏమగును?**

వర్ణ సంకరం వలన కుల ఘాతకులకూ, కులమువారందరికి కలిగేది నరకమే. పిండోదక కార్యాలు లేక వారి పితృదేవతలు అధోగతి పాలగుదురు. ఇట్టి వర్ణ సాంకర్యం కలిగించెడు దోషం వలన కులనాశనం చేసేవారియొక్క కులధర్మాలు, జాతిధర్మాలు రెండునూ అడుగంటి పోవును. (42-43)

**కులధర్మాలు, జాతిధర్మాలు అడుగంటినచో ఏమగును?**

ఓ జనార్దనా! కులధర్మాలు, జాతిధర్మాలు నశించిపోయిన వారు శాశ్వత నరకవాసులయ్యెదరని మేము వింటున్నాము. (44)

**యుద్ధ పరిణామము లిట్లుండునని బాగుగా ముందే తెలిసిన నీవు యుద్ధమునకై ఏల సిద్ధపడితివి?**

అయ్యో! అదే మిక్కిలి ఆశ్చర్యంగా, బాధగా వుంది. రాజ్య సుఖము లందలి కాంక్షకు లోనైన మేము, బంధువులను జంపుటకుద్యుక్తులమైతిమి గదా! (45)

**ఇక నీ తుది నిర్ణయ మేమిటి?**

నేను అస్త్ర శస్త్రాలను పారవైచి యుద్ధరంగము నుండి నిష్క్రమించెదను. నిరాయుధుడనైన నన్ను దుర్యోధనాదులు చంపిననూ సరే, అదే నాకు మేలగును.

**సంజయా! ఇట్టి నిర్ణయమునకు వచ్చిన అర్జునుడు ఆ తర్వాత ఏమి చేసెను?**

విల్లమ్ములను విడిచి పెట్టిన అర్జునుడు దుఃఖంతో చెదిరిన మదికలవాడై రణరంగంలో రథము వెనుక భాగమున చతికిలబడెను అని సంజయుడు చెప్పెను. **(47)**

'అర్జున విషాదయోగము' అనెడు
మొదటి అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# రెండవ అధ్యాయము - సాంఖ్య యోగము

సంజయ ఉవాచ

తం తథా కృపయావిష్టమ్ అశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీదంతమిదం వాక్యమ్ ఉవాచ మధుసూదనః ।1।

శ్రీభగవాన్ ఉవాచ

కుతస్త్వాకశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్టమస్వర్గ్యమ్ అకీర్తికరమర్జున ।2।

క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ।3।

అర్జున ఉవాచ

కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన ।4।

గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే ।
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ।5।

న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః ।
యానేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ।6।

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ।
యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ।7।

న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణామ్ ।
అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ।8।

సంజయ ఉవాచ

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతప ।
న యోత్స్య ఇతి గోవిందమ్ ఉక్త్వా తూష్ణీం బభూవ హ ।9।
తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత ।
సేనయోరుభయోర్మధ్యే విషీదంతమిదం వచః ।10।

శ్రీభగవాన్ ఉవాచ

అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః ।11।
న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామః సర్వే వయమతః పరమ్ ।12।
దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాంతరప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి ।13।
మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యాః తాంస్తితిక్షస్వ భారత ।14।
యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ।15।
నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోఽంతః త్వనయోస్తత్త్వదర్శిభిః ।16।
అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్ కర్తుమర్హతి ।17।

అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః ।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత । 18 ।

య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే । 19 ।

న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే । 20 ।

వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్ ।
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్ । 21 ।

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా-
న్యన్యాని సంయాతి నవాని దేహీ । 22 ।

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః । 23 ।

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమ్ అక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్యః సర్వగతః స్థాణుః అచలోఽయం సనాతనః । 24 ।

అవ్యక్తోఽయమచింత్యోఽయమ్ అవికార్యోఽయముచ్యతే ।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి । 25 ।

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।
తథాపి త్వం మహాబాహో నైవం శోచితుమర్హసి । 26 ।

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి । 27 ।

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥ 28 ॥

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమ్
ఆశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।
ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ 29 ॥

దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।
తస్మాత్ సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి ॥ 30 ॥

స్వధర్మమపి చావేక్ష్య న వికంపితుమర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే ॥ 31 ॥

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశమ్ ॥ 32 ॥

అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।
తతస్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి ॥ 33 ॥

అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్ ।
సంభావితస్య చాకీర్తిః మరణాదతిరిచ్యతే ॥ 34 ॥

భయాద్రణాదుపరతం మంస్యంతే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥ 35 ॥

అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః ।
నిందంతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥ 36 ॥

హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ 37 ॥

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి ॥ 38 ॥

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు ।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి । 39 ।

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ । 40 ।

వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన ।
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ । 41 ।

యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః । 42 ।

కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి । 43 ।

భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే । 44 ।

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ । 45 ।

యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః । 46 ।

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతుర్భూః మా తే సంగోఽస్త్వకర్మణి । 47 ।

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే । 48 ।

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ ।
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః । 49 ।

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ । 50 ।

కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్ । 51 ।

యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥ 52 ॥
శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధావచలా బుద్ధిః తదా యోగమవాప్స్యసి ॥ 53 ॥

అర్జున ఉవాచ

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ॥ 54 ॥

శ్రీభగవాన్ ఉవాచ

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥ 55 ॥
దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ 56 ॥
యః సర్వత్రానభిస్నేహః తత్తత్ ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 57 ॥
యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 58 ॥
విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ 59 ॥
యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥ 60 ॥
తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 61 ॥
ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే ।
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥ 62 ॥

క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి । 63 ।

రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి । 64 ।

ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే । 65 ।

నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।
న చాభావయతః శాంతిః అశాంతస్య కుతః సుఖమ్ । 66 ।

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి । 67 ।

తస్మాద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా । 68 ।

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః । 69 ।

ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశంతి యద్వత్ ।
తద్వత్ కామా యం ప్రవిశంతి సర్వే
స శాంతిమాప్నోతి న కామకామీ । 70 ।

విహాయ కామాన్ యః సర్వాన్ పుమాంశ్చరతి నిఃస్పృహః ।
నిర్మమో నిరహంకారః స శాంతిమధిగచ్ఛతి । 71 ।

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి । 72 ।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సాంఖ్యయోగోనామ ద్వితీయోఽధ్యాయః ॥ 2 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# రెండవ అధ్యాయము - సాంఖ్యయోగము

**సంజయా! రథములో కూర్చొనిన అర్జునుని పరిస్థితి ఎలావుంది?**

సంజయుడిట్లు పలికెను - ఓ మహారాజా! మిక్కిలి ఉత్సాహంతో కదనమున కేతెంచిన అర్జునునిలో పిరికితనం ప్రవేశించుటవలన కారుణ్యంతో కూడుకొని కన్నీరు కార్చుచు మిగుల వ్యాకులమైన దృష్టిని కలిగియున్న అర్జునుడు అసమర్థుడుగా కన్పట్టుచుండెను. ఇట్టి అర్జునునితో మధుసూదనుడు ఇట్లు పలికెను. - ఓ అర్జునా! ఇట్టి రణరంగమునందు నీవంటి వీర పురుషునకు పిరికితనము ఎక్కడనుండి దాపురించినది. ఈ పిరికితనము శ్రేష్టులగువారికి తగినది కాదు. ఇది స్వర్గమునకు చేర్చునదికాదు. కీర్తిని పెంచునదికాదు. కావున నీవు నపుంసకత్వమును పొందకుము. ఇది నీ వంటివానికి తగినది కాదు. అందుచే తుచ్ఛమైన హృదయ దౌర్బల్యమును విడిచిపెట్టి యుద్ధము చేయుటకు లెమ్ము.

అందుకు అర్జునుడిట్లు పలికెను - ఓ మధుసూదనా! నేను చావడానికి భయపడటంలేదు కాని, చంపడానికి మాత్రమే జంకుతున్నాను. యుద్ధరంగము నందు పూజ్యులైన భీష్మద్రోణులను ఎదిరించి బాణములను సంధించి నేనెట్లు పోరాడగలను? (2/1-4)

**ఓహో! బావా! అర్జునా! కర్తవ్యము నాచరించుటయందు వెనకముందులాడుట యెందులకు?**

ఓ ప్రభూ! గురుజనులను చంపుటకంటె, ఈ మర్త్యలోకమునందు భిక్షమెత్తుకొని జీవించుట మేలని నేను తలంచెదను. ఒకవేళ తాము చెప్పినట్లుగా నేను యుద్ధమొనర్చినా కూడా గురుజనులందరిని చంపి, మిక్కిలి ధనాశ గలిగినవారి రక్తము చేత తడిసిన భోగములనే అనుభవింపవలసి వచ్చును. దానితో నాకు మోక్షము బొత్తిగా లభింపదు కదా!

**అయినచో నీవు ఏది మేలని తలంచెదవు?**

ఓ కృష్ణా! యుద్ధము చేయుట మంచిదా లేక చేయకుండుట మంచిదా! అంతేగాదు యుద్ధంలో మేము జయించెదమా! లేక వారు జయించెదరా? అని మేము ఏదీ తెలియలేకున్నాము. ఓ ప్రభూ! అన్నింటికంటే ఒక గొప్ప సంగతి ఏమన, మేము వారిని చంపి బ్రతుకవలెనని కూడా తలంచుట లేదు. మరి వారిని చంపుట ఎట్లు? (2/6)

**నీవు ఇట్టి నిర్ణయమునే ఎరుగనపుడు, దానిని నీపైన ఎందుకు రుద్దుకొనుచున్నావు?**

ఓ ప్రభూ! పిరికితనమనెడు దోషంవలన నా క్షాత్రస్వభావము మరుగున పడిపోయినది. ధర్మమును నిర్ణయించుటలో నా బుద్ధి కుంఠితమైనది. కావున నాకు ఏది మేలైనదో, నీవే నా కొరకు తెలియజెప్పుము. నేను నీ శిష్యుడను, నీ శరణు జొచ్చితిని. నాకుపదేశింపుము.

కాని ఓ కృష్ణా! తాము ముందుగా చెప్పినట్లు యుద్ధం చేయుమని మాత్రం చెప్పవద్దు. ఏలయన, ధన, ధాన్యరాసులతో నిండియున్న నిష్కంటకమగు రాజ్యమును పొందుటచేతనేగాని, అథవా దేవతలపై ఆధిపత్యము గల ఇంద్రపదవిని పొందుటచేగాని, నా ఇంద్రియములను శుష్కింపజేయుచున్న ఈ దుఃఖము తొలగిపోతుందని నేను భావించడంలేదు. (7-8)

**తర్వాత ఇంకేమి జరిగినది సంజయా?**

సంజయుడు ధృతరాష్ట్రునితో చెబుతున్నాడు - ఓ రాజా! నిద్రను జయించిన అర్జునుడు అంతర్యామి యగు శ్రీకృష్ణభగవానునితో - "నేను యుద్ధము చేయను" అని స్పష్టంగా తెలిపి మౌనము వహించెను. (2/9)

**అర్జునుడు మౌనం వహించిన మీదట ఏమి జరిగెను?**

అంతర్యామి యగు శ్రీకృష్ణభగవానుడు రెండు సేనల మధ్య భాగంలో విషణ్ణ హృదయుడై కలత చెందివున్న అర్జునునితో చిరునవ్వు నవ్వుతూ ఇట్లు చెబుతున్నాడు - అర్జునా! నీవు దుఃఖింపకూడని వారి గురించి

దుఃఖించుచున్నావు. పండితునివలె గొప్పగొప్ప మాటలను వల్లిస్తున్నావు. కాని పండితులైన వారు మరణించిన వారి గురించిగాని, మరణింపనివారి గురించి గాని దుఃఖింపరు. (2/10,11)

**వారు ఎందులకు దుఃఖింపరు?**

నేను, నీవు, ఈ రాజులందరూ ఇంతకుముందు లేరనుమాట లేదు. ఇకముందు భవిష్యత్తులో మనమంతా ఉండబోము అనుమాట కూడా లేదు అనగా - మనమందరము ఇంతకు పూర్వము కూడా ఉంటిమి, ఇక ముందుకూడా ఉండగలము. (2/12)

**ప్రభూ! ఈ సంగతిని నేనెట్లు ఎరుగుదును?**

నాయనా! జీవాత్మ ధరించిన ఈ శరీరమునకు కౌమార, యౌవన, వృద్ధాప్య దశలు కలిగినట్లు జీవాత్మకు ఇతర శరీరములు ప్రాప్తించును. అయితే ఈ విషయంలో పండితులైనవారు (జ్ఞానులు) మోహితులు కారు.

**ఓ కృష్ణా! కౌమారాది యవస్థలు (దశలు) శరీరమునకు కలుగుచున్న వనుట బాగానే వుంది. అయితే అనుకూల ప్రతికూలములు, సుఖ, దుఃఖ దాయకములగు పదార్థములు ముందుకు వచ్చినపుడు, ఏమి చేయవలెను?**

ఓ కుంతీపుత్రా! ఇంద్రియ విషయములు (జడ పదార్థములు), అన్నియునూ అనుకూల ప్రతికూలముల ద్వారా సుఖదుఃఖములను కల్పించు నవేగాక అవి అనిత్యములు, వచ్చి - పోవునవే. అందువలన నీవు వాటిని సహింపుము అనగా వానియందు నిర్వికారుడవై ఉండుము. (2/14)

**వాటిని సహించుటవలన, వాని ఎడల నిర్వికారముగా నుండుటచే ఏమి కలుగును?**

సుఖ - దుఃఖములందు సమము (నిర్వికారము)గా నుండునట్టి ధీర పురుషుని ఇంద్రియ విషయములు (జడపదార్థములు) బాధింపజాలవు. అప్పుడు అతడు అమరత్వమునకు (పరమాత్మ ప్రాప్తికి) అర్హుడు అగును. (2/15)

**అతడు అమరత్వమున కర్హుడుగా నెందుకగును?**

అసత్తున (జడ పదార్థముల)కు సత్తా లేనేలేదు. సత్ (చేతన తత్త్వము) యొక్క సత్తాకు ఎప్పుడైనను ఎట్టి కొరత ఏర్పడబోదు. రెండింటి తత్త్వమును, తత్త్వదర్శనులైన వారలే తెలియుదురు. అందువలన, వారు అమరులయ్యెదరు. (2/16)

**సత్ - (అవినాశి) అనగా నేమిటి?**

దేనిచేత ఈ ప్రపంచమంతా వ్యాపించియున్నదో, దానిని నీవు అవినాశిగా తెలియుము. ఇట్టి అవినాశి, అప్రమేయమగు తత్త్వమును నాశనమొనర్చుటలో ఎవరుకూడా సమర్థులు కాజాలరు. (2/17)

**అసత్తు - (వినాశి) యనగా నేమిటి ప్రభూ?**

అర్జునా! నిత్యమైనట్టి, అప్రమేయమగు అవినాశి (జీవాత్మ) యొక్క యీ దేహములన్నియూ అంతమును గలిగినవి. అవి నశ్వరములు. అందుచేత నీవు యుద్ధరూపమగు కర్తవ్య కర్మను ఆచరించుము. (2/18)

**యుద్ధంలో మాత్రం చావడం, చంపడమే వుంటుంది కదా?**

ఎవరు ఈ దేహిని చంపేవాడిగా తెలియుదురో, ఎవరు ఈ దేహిని శరీరములవలె మరణించునదిగా భావించెదరో, వారు ఈ రెండింటిని సరిగా గుర్తించిన వారు కాదు. ఎందుకనగా - ఇది అనగా దేహి (జీవాత్మ) ఎవరినీ చంపేదికాదు, స్వయంగా చచ్చేదికాదు.

**ప్రభూ! అది ఎందుకు మరణించదు?**

అది ఎప్పుడూ పుట్టేది కాదు. గిట్టేది కాదు. ఇది జన్మించి ఉండేదికాదు. నిత్యము, నిరంతరము ఉండేది. శాశ్వతము, పురాతనము అనాదియైనది. శరీరము నశించిన మీదట కూడా ఇది నశించునది కాదు. (2/20)

**ఇట్లు తెలియుటచే ఏమగును?**

పార్థా! ఈ శరీరములను ధరించిన జీవాత్మ అజమని (పుట్టుకలేనిది), అవినాశి యని తెలిసినవాడు, ఎవరిని ఎట్లు చంపించగలడు? ఎట్లు చంపగలడు? (2/21)

**అయినచో మనుజుడు జన్మించినట్లుగా, మరణించినట్లుగా గోచరించును గదా?**

మనుష్యుడు పురాతనమైన వస్త్రములను విడిచి నూతన వస్త్రములను ధరించినట్లుగా, జీవాత్మ, పురాతన జీర్ణమైన శరీరములను విడిచి, నూతన శరీరములను పొందును.

**క్రొత్త - క్రొత్త శరీరములు ధరించినప్పుడు, అతనిలో ఏదో ఒక మార్పు రావచ్చును గదా?**

లేదు! ఇందులో ఎలాంటి వ్యత్యాసము రానే రాదు, ఎందుకనగా ఆత్మను ఆయుధము కోయజాలదు. అగ్ని కాల్చలేదు. నీరు తడుపలేదు. వాయువు ఎండింపజాలదు.

**ఇది శస్త్రాదులచేత కోయుట, మండుట, ఎండుట, తడుపుట ఎందుకు చేయబడదు?**

ఈ జీవాత్మ ఛేదింపబడదు, కాల్చబడదు, తడుపబడదు. ఎండింప బడదు ఏలయన - ఇది నిత్యమైనది. ఎల్లప్పుడు ఉండునది, సర్వత్రా పరిపూర్ణమైన, స్థిర స్వభావము గలిగి, అచలమై, అనాదియై యున్నది. ఇది (ఆత్మ) ఇంద్రియాదుల యొక్క విషయము కానిది. అంతఃకరణ విషయముకూడా కానిది. ఇందులో ఎలాంటి వికారము సంభవింపదు. అందుచేత ఈ ఆత్మను గురించి ఇట్లు తెలుసుకొని, నీవు శోకింపవలదు.

(2/24-25)

**ఈ జీవాత్మను నిర్వికారమని అంగీకరించిన మీదట దుఃఖము కలుగకుండును, కాని వికారియని విశ్వసించినపుడు శోకము కలుగగలదు కదా?**

ఓ అర్జునా! ఒకవేళ నీవు ఈ శరీరిని (జీవాత్మను) నిత్యము పుట్టుచుం డెడిది, నిత్యము గిట్టు చుండెడిదని భావించినప్పటికి కూడా నీకు శోకము కలుగనేరదు. ఎందుకనగా - నియమానుసారంగా జన్మించిన ప్రతిదానికి, తప్పక మృత్యువు కలుగును. అటులే మరణించిన వానికి జన్మ కలుగుట నిశ్చయము. కనుక ఈ శరీరములను గూర్చి శోకము ఎట్లు కలుగును?

(2/26-27)

**శరీరములను గురించి దుఃఖమెందుకు కలుగదు ప్రభూ?**

ప్రాణులు పుట్టుటకు ముందుగా అప్రత్యక్షమై - అగోచరమై యుండెను. మధ్యలో ప్రకటితమై గోచరించును. తిరిగి మరల చివరకు అగోచరమైపోవును. కావున ఇందులో శోకించదగిన మాటేమున్నది? (2/28)

**అయినచో శోకమేల కలుగును?**

తెలియక పోవుటచేత (అజ్ఞానం వలన)

**తెలియుటెట్లు?**

తెలియుట అనగా అనుభవించుట. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి దానిని ఎప్పుడూ చూడలేవు. అందువలన దానిని చూచుట, చెప్పుట, వినుటను గూర్చి అన్నీ ఆశ్చర్యంవలె నుండును. అందుచేత దానిని వినుట ద్వారా ఎవరూ తెలుసుకొనలేరు అనగా దాని అనుభవము స్వయంగానే కలుగును. (2/29)

**అయితే అది ఎట్లున్నది?**

అందరి దేహములో నుండునట్టి దేహి (ఆత్మ) నిత్యము అవధ్యమైనది. అనగా అది ఎల్లప్పుడు చంపబడదు. అవినాశియైనది. ఇట్లు తెలిసిన మీదట ఎవరికి కూడా ఎప్పుడూ శోకము కలుగనేరదు. (2/30)

**శోకమును దూరమొనర్చుటకై తమరు అనేక మాటలు తెలిపినారు. అయితే నాకు ఏ పాపమును గూర్చి భయము కలుగుచున్నదో, అది దూరమగుటెట్లు?**

స్వధర్మ రూపమగు కర్తవ్యమును గాంచి నీవు భయభీతుడవు కావలదు. ఎందుకనగా, క్షత్రియునకు క్షాత్ర ధర్మముకంటే మించిన శ్రేయోదాయకమైన ఇతర సాధనములు వేరేలేవు. (2/31)

**అయితే ఏమి క్షత్రియుడు యుద్ధమే చేయుచుండవలెనా?**

లేదు కుంతీపుత్రా! తనకు తానుగా లభించిన యుద్ధము, యాదృచ్ఛికంగా ముందుకు వచ్చిన యుద్ధము క్షత్రియునకు స్వర్గము చేరుటకై

తెరువబడిన ద్వారము వంటిది. ఇలాంటి యుద్ధము లభించిన క్షత్రియులే నిజమైన అదృష్టవంతులు.❖ (2/32)

**ఇట్లు సహజంగా లభించిన యుద్ధమును నేను చేయకున్నచో?**

ఒకవేళ నీవు ఈ ధర్మమయమగు యుద్ధమును చేయకుండినచో, నీ క్షాత్రధర్మము, కీర్తి నశించిపోవును. అంతేగాక నీకు కర్తవ్య నిర్వహణ చేయలేని పాపము అంటును. (2/33)

**అపకీర్తి వలన ఏమగును?**

బావా! నీవు యుద్ధమును చేయకుండినచో, లోకులందరూ చాలా రోజులవరకు నీ అపకీర్తిని గురించి చెప్పుకొందురు. అంతేగాక గౌరవనీయుడు, పూజనీయుడునగు పురుషునకు అపకీర్తి, మరణముకంటె❖❖ మిగుల దుఃఖదాయకమగును. ఇంకనూ చూడుము! ఏ మహారథుల దృష్టిలో నీవు గొప్పవాడిగా భావింపబడితివో, వారి దృష్టిలో చులకన యగుదువు. మృత్యువునకు వెరచి యుద్ధమునుండి పలాయనము చిత్తగించినాడని ఆ మహారథులెల్లరు నిన్ను గురించి భావించెదరు. (2/34,35)

**అయితే ఏమగును ప్రభూ?**

ఏమగునా! అంతా భయంకరమే అగును. నీ శత్రువులకు వైరభావమును వెలిబుచ్చే అవకాశమేర్పడును. వారలు నీ సామర్థ్యాన్ని, నీ పౌరుషాన్ని గూర్చి

---

❖ భోగములు లభించడం సుఖముకాదు. పైగా అది గొప్ప దుఃఖానికి మూలకారణము. (5/22) దుఃఖరహితమైనదే అచ్చమైన సుఖము. స్వధర్మ రూపమగు కర్తవ్యకర్మ నాచరించగలిగే అవకాశము లభించడమే దుఃఖరహితమగు సుఖము. కర్తవ్యమును ఆచరించగలుగు అవకాశము లభించుటయే అదృష్టము.

❖❖ మరణించినంత మాత్రమున అపకీర్తి కలుగదు. ఎందుకంటే మరణించడం ప్రతివానికి సహజం. అపకీర్తి మాత్రం కర్తవ్య చ్యుతి కలిగినపుడే కలుగును.

నిందిస్తూ నిన్ను అనరాని (తిరస్కారమైన) మాటలు అనెదరు. ఇంతకంటే గొప్పదైన దుఃఖమేముండును? (2/36)

**ఒకవేళ నేను యుద్ధము చేసినచో?**

యుద్ధం చేస్తూ ఒకవేళ నీవు మరణించినచో, నీకు స్వర్గం లభించును. లేదా యుద్ధంలో విజయం సాధించినచో నీకు రాజ్యమే లభించును. కావున నీవు యుద్ధమునకై నిశ్చయముగ సంసిద్ధుడవు గమ్ము. (2/37)

**కాని ఓ ప్రభూ! నే నొకవేళ వీరిని చంపుటకై సిద్ధపడినచో నాకు పాపమైతే కలుగును కదా?**

లేదు! నీవు జయాపజయములందు, లాభనష్టములందు, సుఖ-దుఃఖము లందు సమంగా వుంటూ యుద్ధము చేయుము. అప్పుడు నీకెలాంటి పాపము కలుగదు. (2/38)

**ప్రభూ! అయితే యుద్ధమునెట్లు చేయవలెను?**

సమత్వబుద్ధిని కలిగి యుద్ధము చేయవలెను.

**భగవాన్! ఆ సమబుద్ధిని కలిగియుండుట ఎట్లు?**

అర్జునా! సమబుద్ధిని గూర్చిన సంగతి నేను ముందే సాంఖ్య సిద్ధాంతంలో చెప్పియున్నాను. దానిని గూర్చి యోగవిషయము ద్వారా ఇప్పుడు వినుము. అట్టి సమబుద్ధిని కలిగియున్నచో, నీవు కర్మ బంధనములనుండి విముక్తుడవై పోయెదవు. (2/39)

**ఈ సమబుద్ధి యొక్క మహిమ ఇంకా ఏమైన యున్నదా?**

ఇట్టి సమబుద్ధి ద్వారా చేసిన కర్మ యొక్క ప్రారంభ క్రమము నశింపదు. అనగా ప్రారంభించినది నిష్ఫలమగుటయనునది లేదు. దీనికి బీజనాశ ముండదు. దీని ఆచరణ ద్వారా వ్యతిరేక ఫలము కలుగదు. ఏ కొద్దిమాత్రము ఆచరించగలిగినా సరే! అది గొప్ప భయము నుండి రక్షించి తీరును.(2/40)

**నీవు ఇంత గొప్ప మహిమను తెలిపిన ఆ సమబుద్ధిని పొందగలిగే ఉపాయమేమిటి కృష్ణా?**

అర్జునా! సమబుద్ధిని పొందగలిగే విషయంలో వ్యవసాయాత్మికమైన (నిశ్చయాత్మికమైన) బుద్ధి ఒకటే వుంటుంది. అవ్యవసాయములగు అనగా పరమాత్మ ప్రాప్తిని గూర్చిన నిశ్చయములేని, స్థిరబుద్ధిలేని, సకామములగు పురుషుల బుద్ధులు అనంతములేగాక బహుశాఖలను కలిగియుండును. **(2/41)**

**అవ్యవసాయులగు పురుషుల బుద్ధులు అనంతములుగా ఎందు కుండును?**

కోర్కెలతో తన్మయులైనవారు, స్వర్గమునే శ్రేష్ఠమని భావించెడివారు, వేదములలో చెప్పబడిన సకామకర్మలయందే ప్రీతి కలిగినవారు, ఇలాంటి అవగాహన కొరవడిన పురుషులు ఇటువంటి వాక్కులను చెప్పుచుండెదరు. ఇవన్నియునూ జన్మరూప కర్మఫలములను ప్రసాదించునవిగా మరియు భోగములను, ఐశ్వర్యములను పొందుటకొరకై అనేక క్రియా కలాపములను వర్ణించునవిగా నుండును. **(2/42,43)**

**పరమాత్మను పొందుటలో గల ముఖ్యమైన ఇబ్బంది ఏమిటి?**

భోగముల, ఐశ్వర్యముల సంగ్రహములో ఆసక్తి యుండుటచేతనే వారికి పరమాత్మయందు ఒకే ఒక నిశ్చయాత్మకమైన బుద్ధి ఉండదు. **(2/44)**

**నేనేమి చేయవలెను?**

మూడు గుణముల కార్యము (ప్రపంచము)ను వర్ణించు వేదములను అనగా - వేదములలో చెప్పబడిన సకామ కర్మలనుండి నీవు వైదొలగాలి. నీవు ద్వంద్వరహితుడవు కమ్ము. శాశ్వత తత్త్వంలో స్థితుడవుగమ్ము. అప్రాప్తము యొక్క ప్రాప్తికి, ప్రాప్తించినదాని రక్షణకై నీవు చింతించవద్దు అనగా - యోగక్షేమములను గూర్చి నీవు చింతించవలదు. కేవలము పరమాత్మ పరాయణుడవు కమ్ము. అనగా పరమాత్మ ప్రాప్తినే లక్ష్యమునందు నిలుపుము. **(2/45)**

**ఎవరైనా పరమాత్మ పరాయణులగుచో ఏమగును?**

చాలా గొప్ప జలాశయము లభించిన మీదట చిన్న నీటిగుంట యొక్క గొప్పతనము తగ్గినట్లుగా, దాని అవసరమే ఉండనట్లుగా, వేదముల, శాస్త్రముల తాత్పర్యము తెలిసిన తత్త్వజ్ఞుడగు జీవన్ముక్తుడగు మహాపురుషుని దృష్టిలో, ఎలాంటి భోగైశ్వర్యముల మహత్త్వము ఉండనే ఉండదు. (2/46)

**ఇటువంటి స్థితిని పొందుటకు మరింకేదైనా విధానము కలదా?**

ఔను, ఉన్నది. అదే కర్మయోగము. స్వకర్తవ్యమునాచరించుచు ఫలమును కోరకుండవలెను. మరియు కర్మనాచరించు సాధనములయందు గూడా ఆసక్తి నుంచకుండుటయే దాని ముఖ్య విధానము.

**అట్లయిన నేను కర్మ చేయుటెందుకు?**

కర్మ నాచరించకుండుటను గూర్చి ఎప్పుడూ ఆలోచించకూడదు. కర్మను చేసియేతీరవలెను. కాని దానిఫలములపై ఆసక్తి, అధికారము చూపకూడదు. అట్లు చేయుటవలన ఆకర్మల ఫలితములకు నీవు కారణభూతుడవు కావు.

(2/47)

**అయితే కర్మనాచరించుటెట్లు?**

సిద్ధి-అసిద్ధి యందు సమముగ నుండుటయే యోగమనబడును. కావున నీవు ఫలమును, ఆసక్తిని త్యజించి యోగము (సమభావము) నందు స్థితుడవై కర్మనాచరించుము. (2/48)

**ఒకవేళ యోగము (సమత్వము) నందు నిలచి కర్మ నాచరించనిచో?**

సమత్వములేని సకామ కర్మ మిక్కిలి నికృష్టమైనది. కావున సమబుద్ధిని ఆశ్రయించుము. ఎందుకనగా - ఫలమును కోరువాడు కృపణుడు అనగా ఫలమునకు బానిస యగును. (2/49)

**ఫలమును కోరువాడు కృపణుడైనచో శ్రేష్ఠుడెవరు?**

సమబుద్ధి గలిగిన వ్యక్తి ఈ జీవిత కాలంలోనే పాప - పుణ్య రహితుడైపోవును. కర్మలలో గల సమత్వమే కౌశలమనబడును. కావున నీవు సమత్వమునందే నిలచి యుండుము. (2/50)

**సమబుద్ధి పరిణామమేమి?**

సమబుద్ధి యుక్తుడైన బుద్ధిమంతుడగు వ్యక్తి కర్మజన్యఫలమును త్యజించి, జన్మరూపబంధనరహితుడై అనామయ (నిర్వికార) పదమును పొందుచున్నాడు. (2/51)

**కర్మజన్య ఫలమును త్యజించునట్లుగా నేను ఎప్పుడెరుగుదును?**

నీ బుద్ధి మోహమనెడు ఊబినుండి బయట పడినప్పుడు నీవు వినినట్టి, వినబోవునట్టి భోగముల యెడల వైరాగ్యమేర్పడును. (2/52)

**వైరాగ్యము కలిగిన పిమ్మట సమత్వము ఎప్పుడు లభించును?**

శాస్త్ర ప్రతిపాదితమైన వివిధ సిద్ధాంతములతో నీ బుద్ధి చంచలమైనది. అట్టి బుద్ధి సంసారము నుండి సంపూర్తిగా విముఖమై పరమాత్మయందు స్థిరమగు నప్పుడు నీకు సాధ్యరూప సమతాయోగము లభింపగలదు.

(2/53)

**కృష్ణా! స్థితప్రజ్ఞుని లక్షణములేవి? అతడు ఎట్లు మాట్లాడును? అతడెట్లు కూర్చొనును? అతడెట్లు నడచును? అని అర్జునుడు అడిగెను.** (2/54)

భగవానుడిట్లు చెప్పెను - అర్జునా! తన మనస్సులో నుండెడు కోరికలనన్నింటిని ఎప్పుడు త్యాగము జేయునో, తనకు తానే, తనలో తానే సంతుష్టాంతరంగుడై ఎప్పుడుండునో, అప్పుడాతడు స్థితప్రజ్ఞుడని (స్థిరబుద్ధి గలవాడని) పిలువబడును. (2/55)

**అతడెట్లు మాటలాడును?**

అతడు మనమునందు ప్రతికూల పరిస్థితి కలిగినపుడు ఉద్వేగము నొందడు. అనుకూల పరిస్థితి యొక్క స్పృహ ఉండనే వుండదు - ఇట్లు రాగము, భయము, క్రోధములచే రహితుడైన ముని స్థితప్రజ్ఞుడని పిలువబడును. అన్ని ప్రదేశములందు ఆసక్తిరహితుడగు ఆ పురుషుడు శుభాశుభములు కలిగినపుడు ఆనందించకుండా మరియు ద్వేషించకుండా నుండును. కావున అతని బుద్ధి స్థిరమైపోవును. అనగా 'నేను పరమాత్మను

పొందవలసి యున్నది' - అని తాను ముందుగా నిశ్చయించుకొనిన ప్రకారంగా అతడు దాని సిద్ధిని (పరమాత్మను) బడయగలడు. (2/56-57)

**ప్రభూ! అతడెట్లు కూర్చొనును?**

తాబేలు తన అంగములను కుంచించుకొని ఎట్లు కూర్చొనగలదో, అటులే ఆ పురుషుడు సకల ఇంద్రియములను, మనస్సును విషయముల నుండి ఎప్పుడు మరలించుకొనునో, తొలగజేసుకొనునో, అట్టి తరి అతని బుద్ధి స్థిరమైపోవును. (2/58)

**ఇంద్రియములను మరలించుకొనుటకు నిజమైన గుర్తింపు ఏమిటి?**

ఆహారము తీసికొనని వానికి విషయ నివృత్తి కలుగుతుందేమోకాని, రసబుద్ధి (రుచి, ఆస్వాదనము) నివృత్తి కానేరదు, కాని పరమాత్మ యొక్క ప్రాప్తివలన స్థితప్రజ్ఞుని రసబుద్ధి కూడా నివృత్తమై (తొలగి)పోవును. (2/59)

**రసబుద్ధి ఉండుటవలన గలుగు హాని ఏమి?**

ఓ కుంతీ నందనా! రసబుద్ధి యుండుటవలన సాధన పరాయణుడు, వివేకవంతుడునగు పురుషుని ఇంద్రియములు ఆతని మనస్సును బలవంతంగా హరించి వేయును. (2/60)

**రసబుద్ధిని దూరమొనర్చుటకై ఏమి చేయాలి ప్రభూ!**

సకలేంద్రియములను సంయమన మొనర్చి, నా పరాయణుడవై కూర్చొనుము. అనగా - నా నమ్మకంతో నిశ్చింతగా నుండుము. ఈ విధంగా ఎవని ఇంద్రియములు వశమగునో, వాని బుద్ధి ప్రతిష్ఠితమగును. (2/61)

**నీ పరాయణుడు కానిచో ఏమగును?**

నా పరాయణత లేనిచో, విషయ చింతనమే కలుగును.

**విషయ చింతన వలన ఏమగును?**

మానవుడు ఏ విషయములను చింతించునో, అతనికి అట్టి విషయము లందే ఆసక్తి ఏర్పడును.

**ఆసక్తి కలుగుటవలన ఏమగును?**

ఆసక్తి వలన విషయములను పొందుటకై కోరిక జనించును.

**కోరిక వలన ఏమగును?**

పదార్థములను పొందు కోరిక పూర్తిగావడంలో ఆటంకమేర్పడినచో క్రోధము కలుగును. (2/62)

**క్రోధము వలన ఏమగును?**

క్రోధము వలన సమ్మోహ (అవివేక) మేర్పడును. మూఢత్వము వ్యాపించును.

**మూఢత్వము వ్యాపించుటచే ఏమగును?**

ముందుగా చింతించిన స్మృతి నష్టమైపోవును. అనగా ముందుగా జేసిన విచారము (ఆలోచన) మరుపునకు వచ్చును.

**స్మృతి నష్టమైన పిమ్మట ఏమగును?**

బుద్ధి (క్రొత్తగా ఆలోచించు శక్తి) నశించును. అనగా ఇప్పుడు నేను ఏమి చేయవలెను. ఏమి చేయకూడదు - అను వివేకము అంతరించును.

**బుద్ధి నశించిన మీదట ఏమగును?**

వానికి పతనము కలుగును. అతడు పతనమైపోవును. (2/63)

వశీభూతమైన అంతఃకరణముగల పురుషుడు రాగద్వేషరహితుడై, తన వశీభూతమగు ఇంద్రియములద్వారా విషయ సేవనము జేస్తూ కూడా ఆధ్యాత్మిక ప్రసన్నతను పొందును. ఈ విధంగా ప్రసన్నచిత్తుడైన పురుషుని సంపూర్ణ దుఃఖములు సమసిపోవును. అప్పుడాతని బుద్ధి అతి త్వరగా పరమాత్మయందు నిలచిపోవును. (2/64-65)

**ఎవని బుద్ధి స్థిరంగా నుండదు?**

సంయమనము లేని వానికి వ్యవసాయాత్మకమగు లేదా నిశ్చయాత్మక మైన బుద్ధి యుండదు. వ్యవసాయాత్మకమగు బుద్ధి లేనందున - నేను నా కర్తవ్యమును నిర్వహించవలసి యున్నదను విచారముగాని, భావముగాని

వుండదు. కర్తవ్యనిర్వహణ కొరవడినందున అతనికి ప్రశాంతత లభింపదు. ప్రశాంతత లేని పురుషునకు సుఖము ఎట్లు లభింపగలదు. (2/66)

**సంసారి లేక భోగియైన వానికి బుద్ధి స్థిరంగా వుండే అవకాశమే లేదు. కాని, సాధకుడైన వాని బుద్ధి స్థిరంగా నుండక పోవుటలో గల కారణమేమిటి?**

నీటిపైన నడచునట్టి నావను వాయువు ముంచి వేసినట్లుగా విషయాలతో రమించెడు ఇంద్రియములలో ఏదో ఒక ఇంద్రియముతో మనస్సు చెదరిపోవును. ఆ ఒక్క ఇంద్రియముతో కూడిన మనస్సు సాధకుని బుద్ధిని హరించుకొని పోవును. (2/67)

**ఎవని బుద్ధి స్థిరంగా వుండును?**

ఎవని యింద్రియములు అన్నివిధాలుగా వశమై యుండునో, ఎవని మనసు విషయ చింతన చేయకుండునో, అతని బుద్ధి స్థిరంగా నుండును. (2/68)

**ఇంద్రియములు వశమునందు లేని ఒక సామాన్య మానవునకు, ఇంద్రియములను వశపరచుకొనినట్టి సంయమియగు మానవునకు మధ్యగల భేదమేమి?**

పరమాత్మప్రాప్తిని గూర్చి ఏమాత్రము పట్టించుకొనక సాధారణ మానవుడు నిదురించే రాత్రి కాలంలో సంయమియగు పురుషుడు మేల్కొనియుండును. అనగా అతడు పరమాత్మ తత్త్వమును అనుభవించు చుండును. అట్లే మామూలు మనిషి మేల్కొనినపుడు అనగా భోగములను అనుభవించుటలో, ఐశ్వర్యాదులను సంగ్రహించుటలో అతడు అత్యంత జాగ్రత్తను కలిగియుండు కాలము, పరమాత్మ తత్త్వమును తెలిసిన మననశీలియగు పురుషుని దృష్టిలో రాత్రిగా, ఉంటుంది. (2/69)

**అయితే సంయమియగు పురుషుని ముందుకు భోగపదార్థములు రానేరావా?**

వచ్చును. తన మర్యాదలో స్థిరంగా నుండునట్టి, నాలుగు వైపుల నుండి పూర్తిగా నిండియున్న జలరాశిలో నదులన్నింటి జలము వచ్చి కలిసిపోవును.

కాని అది సముద్రంలో ఎలాంటి వికారమును సృజించలేదు. అట్లే, ఒక సంయమియగు పురుషుని ముందు సాంసారిక సకల భోగములు వచ్చి చేరినా కూడా అతనిలో ఎటువంటి వికారమును సృజించలేవు. ఇట్టి పురుషుడు శాంతిని, పరమాత్మ తత్త్వమును పొందును. (2/70)

**భోగాసక్తులకు శాంతి ఎట్లు లభించును?**

కోరికలను త్యజించుటయే దానికి ఉపాయము. వాటిపైగల ఆసక్తిని త్యజించుటచే శాంతి లభించును. అహంకార - మమకార రహితుడైన వానికి శాంతి లభింపగలదు. (2/71)

**అహంకార - మమకార రహితుడైన పిమ్మట అతని స్థితి ఎట్లుండును?**

అతని స్థితి పరమాత్మయందే యుండును, అదియే బ్రాహ్మీస్థితి. దీనిని పొందిన మానవుడు మోహితుడు కాడు. ఇట్టి బ్రాహ్మీస్థితియందు అంత్యకాలమున కూడా నిలిచి యుండినచో అనగా అంతిమకాలమున గూడా అహంకార - మమకార రహితుడై యున్న యెడల, అతడు నిర్వాణ బ్రహ్మమును పొందగలడు. (2/72)

'సాంఖ్యయోగము' అనెడు
రెండవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# మూడవ అధ్యాయము - కర్మయోగము

అర్జున ఉవాచ

జ్యాయసీ చేత్ కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన ।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ।1।

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్ ।2।

శ్రీభగవాన్ ఉవాచ

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ।3।

న కర్మణామనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ।4।

న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ।5।

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే ।6।

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।
కర్మేంద్రియైః కర్మయోగమ్ అసక్తః స విశిష్యతే ।7।

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ।8।

యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర ।9।

సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వమ్ ఏష వోఽస్త్విష్టకామధుక్ ।10।

దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః ।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ । 11 ।
ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః ।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః । 12 ।
యజ్ఞశిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।
భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ । 13 ।
అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః । 14 ।
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।
తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ । 15 ।
ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి । 16 ।
యస్త్వాత్మరతిరేవ స్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే । 17 ।
నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః । 18 ।
తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః । 19 ।
కర్మణైవ హి సంసిద్ధిమ్ ఆస్థితా జనకాదయః ।
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి । 20 ।
యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే । 21 ।
న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి । 22 ।

యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః ।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః । 23 ।

ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।
సంకరస్య చ కర్తా స్యామ్ ఉపహన్యామిమాః ప్రజాః । 24 ।

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత ।
కుర్యాద్విద్వాంస్తథాసక్తః చికీర్షుర్లోకసంగ్రహమ్ । 25 ।

న బుద్ధిభేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినామ్ ।
జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్ । 26 ।

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకారవిమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే । 27 ।

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః ।
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే । 28 ।

ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు ।
తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్ । 29 ।

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః । 30 ।

యే మే మతమిదం నిత్యమ్ అనుతిష్ఠంతి మానవాః ।
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః । 31 ।

యే త్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః । 32 ।

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి ।
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి । 33 ।

ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపన్థినౌ । 34 ।

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః । 35 ।

అర్జున ఉవాచ

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః । 36 ।

శ్రీభగవాన్ ఉవాచ

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ । 37 ।

ధూమేనావ్రియతే వహ్నిః యథాదర్శో మలేన చ ।
యథోల్బేనావృతో గర్భః తథా తేనేదమావృతమ్ । 38 ।

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ । 39 ।

ఇంద్రియాణి మనో బుద్ధిః అస్యాధిష్ఠానముచ్యతే ।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ । 40 ।

తస్మాత్ త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ । 41 ।

ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః । 42 ।

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ । 43 ।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః ॥ 3 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# మూడవ అధ్యాయము - కర్మయోగము

ఓ జనార్దనా! నీ అభిప్రాయంలో బుద్ధి (జ్ఞానము) యే శ్రేష్ఠమైన యెడల, ఓ కృష్ణా! నీవు నన్ను ఈ ఘోర కర్మలో ఎందుకు నియోగించుచున్నావు? కర్మను చేయుమని ఒకసారి, బుద్ధినాశ్రయించుమని మరియొకసారి నీవే చెబుతున్నావు. నీవు చెప్పే ఈ మిశ్రమ వాక్యములతో నా బుద్ధి భ్రమించుచున్నది. కావున నాకు శ్రేయస్కరమగు ఒకే ఒక నిశ్చయమైన మాటను చెప్పుము అని అర్జునుడు అడిగెను. (3/11-2)

భగవానుడు చెప్పుచున్నాడు- అర్జునా! సాంఖ్యయోగుల కొరకు జ్ఞానయోగము మరియు యోగుల కొరకు కర్మయోగము తగినదని ఒకే సమత్వ బుద్ధిని రెండు రకములుగా నేను వచించితిని. అనగా - జ్ఞానయోగముతోను, కర్మయోగముతోను ఒకే బుద్ధి (సమత్వము) లభించును. (3/3)

**దానిని పొందుటకై ఎలాంటి కర్మ చేయుట అవసరము?**

అర్జునా! కర్మలను చేయకుండా సమత్వము ప్రాప్తించదు. అట్లని కర్మలను వదలి పెట్టడంవలన కూడా సమత్వము లభింపజాలదు. అనగా సమత్వ ప్రాప్తికై కర్మాచరణము అవసరము. (3/4)

**కర్మల త్యాగం వలన సమత్వము ఎందుకు లభింపదు?**

ప్రకృతి నిరంతరం క్రియాశీలమైనందున, కర్మలను పూర్తిగా ఎవరునూ చేయకుండ ఉండలేరు. క్రియాశీలమైన ప్రకృతి గుణములకు లోబడిన ప్రాణి కర్మలను త్యజింపజాలదు! (3/5)

**ఏల త్యజింపజాలదు! చడిచప్పుడు లేకుండా కూర్చోవడం, ఏమీ చేయకుండా వుండడంవలన కర్మలను త్యజించినట్లే గదా!**

నిశ్శబ్దముగా కూర్చొని ఇంద్రియములను బయట నుండి మాత్రమే నిరోధించి మనసులో మాత్రం విషయచింతన చేయుచుండినచో, అది కర్మ చేయకుండినట్లుగా కాదు. పైగా అతడు ఊరికే కూర్చోవటమనేది మిథ్యాచారమే అవుతుంది. (3/6)

**కేశవా! ఏ సమత్వబుద్ధిని గూర్చి నీవు తెలిపితివో, అట్టి దానిని పొందడం కర్మలు చేయకుండా లభింపదు, కర్మలను వదిలిపెట్టడంవలన లభింపదు,**

నిశ్శబ్దముగా కూర్చొని మనసులో విషయ చింతన చేసినా లభింపదు. ఇక దాని ప్రాప్తి కలుగుటెట్లు?

అర్జునా! మనస్సుతో ఇంద్రియములను నియంత్రించి కర్మయోగమును (నిష్కామ భావంతో తమ కర్తవ్య కర్మలను) అనుష్ఠించెడు వారు శ్రేష్ఠులు. వారికి (సమత్వ) బుద్ధి లభింపగలదు. అందువలన నీవు నియతకర్మ నాచరించుము. కర్మచేయక పోవుట కంటే పైవిధంగా కర్తవ్య కర్మనాచరించుట శ్రేష్ఠము. కర్తవ్య కర్మను చేయకుండా శరీర నిర్వహణ కూడా జరుగదు కావున, నీవు కర్తవ్య కర్మలనాచరింపవలసినదే. (3/7-8)

**ప్రభూ! కర్మల నాచరించుట వలన బంధన మేర్పడదు గదా?**

లేదు! కర్తవ్య కర్మను కేవలము తనకొరకై ఆచరించుటవలన బంధనమగును. కనుక నీవు ఆసక్తిరహితుడవై, కర్తవ్య పరంపరను పదిలపరచుటకు మాత్రమే కర్తవ్యకర్మను (యజ్ఞము కొరకు) చేయుము. (3/9)

**నేను కర్మ చేయుట యెందుకు?**

ఓ అర్జునా! సృష్టికి ఆరంభమున బ్రహ్మదేవుడు యజ్ఞ (కర్తవ్య కర్మ) సహితంగా ప్రజలను సృజించి వారితో మీరందరు ఈ కర్తవ్యకర్మ రూపమగు యజ్ఞము ద్వారా వృద్ధిని పొందుడు. ఇట్టి యజ్ఞము మీకు కర్తవ్య నిర్వహణకు తగిన సామగ్రిని ప్రసాదించును అని చెప్పెను. (3/10)

**పితామహా! మేము ఈ యజ్ఞమును ఏ భావంతో చేయాలి?**

దీనిద్వారా మీరు దేవతలను వృద్ధి చేయండి. దేవతలు మీకు వృద్ధి కలిగించెదరు. ఈ విధంగా ఒకరికొకరు పరస్పరం సహకరించుకొనుటతో - తమకొరకై కర్మ చేయకుండా కేవలం ఇతరుల కొరకు మాత్రమే కర్మ చేయుటతో, మీరందరునూ మిక్కిలి శ్రేయస్సును - పరమాత్మను పొందెదరు. (3/11)

**పితామహా! ఒకవేళ మేము యజ్ఞమే చేయకున్నచో?**

మీ యొక్క కర్తవ్య - కర్మ రూపమగు యజ్ఞము వలన వృద్ధిని పొందిన దేవతలు మీకు కర్తవ్య నిర్వహణకు తగిన సామగ్రిని ప్రసాదించెదరు. కాని, మీరు ఒకవేళ కర్తవ్య నిర్వహణకు తగిన సామాగ్రితో దేవతలను తృప్తి

చేయకుండా మీ సుఖ సౌఖ్యములనే అనుభవించిన యెడల మీరు 'దొంగల'య్యెదరు. (3/12)

**ఇట్టి దోషముతో ఎట్లు కాపాడబడెదము ప్రభూ?**

ఇందువల్లనే అర్జునా! కర్తవ్య పరంపరను పదిల పరచుటకొరకే అనగా ఇతరులకొరకై - పరోపకారార్థమై కర్తవ్య కర్మను చేయు వారలు సర్వపాపముల నుండి విముక్తులయ్యెదరు. తమ స్వంత సుఖోపభోగమునకై కర్మనాచరించెడి పాపులు పాపమును మాత్రమే సంపాదించెదరు. (3/18)

**ప్రభూ! ఇప్పుడే తమరు కర్తవ్య కర్మను గురించిన బ్రహ్మదేవుడి ఆజ్ఞను వినిపించారు. సృష్టిచక్రము ననుసరించి మనిషికి కర్తవ్య కర్మాచరణము తప్పదా? అని నేను తెలియగోరుచున్నాను?**

ఔను, చాలా తప్పనిసరి. ఎందుకంటె ప్రాణులన్నియు అన్నమునుండి ఉత్పన్నమగుచున్నవి. అన్నము వర్షము నుండి ఉత్పత్తి యగును. వర్షము యజ్ఞము (కర్తవ్యకర్మ) వలన కలుగును. కర్తవ్యకర్మ నాచరించెడు మనుజుల వలన యజ్ఞము జరుగును. యజ్ఞ విధిని వివరించునవి వేదములు. ఆ వేదములు పరమాత్మనుండి వెలువడినవి. కావున సర్వవ్యాపకుడైన ఆ పరమాత్ముని ప్రాప్తి స్వకర్తవ్యాచరణము వలన మాత్రమే సంభవము. కనుక సృష్టి చక్రమునను సరించి మానవులెల్లరు తమ తమ కర్తవ్యముల నాచరించుట తప్పనిసరి. (3/14-15)

**ఒకవేళ ఎవరేని ఈ సృష్టి చక్రము ననుసరించి తమ కర్తవ్యము నాచరించనిచో?**

పరంపరాగతమైన ఈ సృష్టి చక్రమును సురక్షితముగా నుంచుటకై కర్తవ్యకర్మ నాచరించనివారు, ఈ లోకంలో జీవించడము వ్యర్థము. అట్టివారలు జీవించుట కంటే మరణించడమే మేలు. (3/16)

**ఎవరైనా ఆసక్తిరహితంగా తమ ఆజ్ఞానుసారముగ కేవలము సృష్టిచక్రపు పరంపరను పదిలపరచుట కొరకే కర్తవ్యకర్మను అనుష్టించినచో?**

అతడు తనలో తానుగా ప్రీతిగలవాడై, తనలో తానే తృప్తి నొందినవాడై సంతుష్టుడై యుండును. ఇక అతనికి చేయుటకేమీ మిగిలి యుండదు. ఎందుకనగా అట్టి మహాత్మునకు కర్మచేయుటవలన ఎట్టి ప్రయోజనము లేదు. అటులే కర్మ చేయకుండుట వలన ఎలాంటి సంబంధము (ప్రయోజనము)

లేదు. అతనికి ఏ ప్రాణితోడను ఎలాంటి స్వార్థపూరితమగు సంబంధమూ ఉండదు. (3/17-18)

**ప్రభూ! నేను కూడా అట్లు కాగలనా?**

ఔను. నీవు ఆసక్తి రహితుడవై కర్తవ్య కర్మ నాచరించుము. ఆసక్తి రహితంగా కర్తవ్య కర్మనాచరించుట వలన పరమాత్ముడు ప్రాప్తించును. (3/19)

**పూర్వము ఎవరేని ఆసక్తి రహితులై కర్మనాచరించినారా? వారికి పరమాత్ముని ప్రాప్తి కూడా లభించినదా?**

అవును. జనకమహారాజువంటి ఎందరో ఆసక్తిరహితులై కర్తవ్య కర్మ నాచరించియే పరమాత్మను పొందినారు. పరమాత్ముని పొందిన మీదట కూడా వారలు లోక సంగ్రహము (లోకమును చెడు మార్గము నుండి రక్షించి సన్మార్గము వైపు తెచ్చుట లోకహితార్థము) కొరకే కర్మ నాచరించిరి. ఇందువలన నీవు కూడా లోక సంగ్రహమును దృష్టి యందుంచుకొని, నీ కర్తవ్య కర్మను ఆచరించుము. (3/20)

**ప్రభూ! అది లోకసంగ్రహము ఎట్లగును?**

రెండువిధాలుగా అగును - స్వయంగా కర్తవ్య పరాయణుడగుటవలన మరియు ఇతరులకు ఉపదేశించుటవలన లోకసంగ్రహము జరుగును. శ్రేష్ఠ పురుషుడు స్వయంగా తత్పరతా పూర్వకంగా కర్తవ్య కర్మనాచరించినచో, అటులనే అతనిని అనుసరించి లోకులు కర్మ నాచరించెదరు. గొప్పవారు తమ వాక్కులచేత ధృవీకరించిన దానినే జనులు అనుసరించెదరు. (3/21)

**పరమాత్మ ప్రాప్తి విషయంలో తాము జనకాదులను ఉదహరించినట్లు, లోకసంగ్రహ విషయంలోకూడా ఏదేని ఉదాహరణ గలదా?**

పార్థా! ఉన్నది. అందుకు ఉదాహరణముగా నన్నే తీసుకొమ్ము. నాకు ఈ మూడు లోకములందును ఎలాంటి కర్తవ్యమును లేదు. అట్లే పొందని వస్తువుగాని, పొందదగిన వస్తువుగాని ఏదీ లేదు. అయినను నేను కర్తవ్య కర్మను ఆచరించుచున్నాను కదా! (3/22)

**ప్రభూ! తమకు కర్తవ్య కర్మనాచరించవలసిన అవసరమేమున్నది?**

అవును, కుంతీపుత్రా! అవసరమున్నది. ఏలయనగా, నేనొకవేళ జాగరూకుడనై కర్తవ్య కర్మను చేయకున్నచో, మనుష్యులు నన్నే అనుసరించి వర్తించెదరు అనగా కర్తవ్య కర్మను చేయుటను వదిలివేయుదురు. (3/23)

**దీనివలన ఏమగును భగవన్?**

ఒకవేళ నేను కర్తవ్య కర్మను చేయకుందునేని ఈ లోకములు నశించిపోవును. నన్ను చూసి ఈ మానవులు తమ తమ కర్తవ్యకర్మలను చేయకుండుటచే లోకములన్నియు నష్ట - భ్రష్టములైపోవును. అంతేగాక అన్నివిధములగు సంకర దోషములకు కర్తను నేనే యగుదును. (3/24)

**ఈ దృష్టితో నీకు లోక సంగ్రహార్థముగా కర్తవ్య కర్మ చేయుట మిక్కిలి తప్పనిసరి యగుచున్నది. కాని తత్త్వజ్ఞులు, జీవన్ముక్తులునగు మహాపురుషులకు కూడా కర్తవ్య కర్మ చేయుట తప్పనిసరియా?**

అవును అర్జునా! అవసరమే కాదు, చాలా అవసరము. అజ్ఞానులగు మనుష్యులు కర్మలయందు ఆసక్తులై, కేవలము ఫలాసక్తితో ఏ ప్రకారముగా కర్మలను శ్రద్ధగా చేయుచున్నారో, అదే ప్రకారము ఆసక్తిరహితులగు జ్ఞానులు కూడా లోక సంగ్రహమునకై కర్మలను చక్కగా ఆచరించవలెను. జ్ఞానియగు పురుషుడు కర్మల యందు ఆసక్తులగు అజ్ఞానుల యొక్క బుద్ధిలో ఏ విధమైన భ్రమను కలిగించకుండా గొప్ప నేర్పుతో తాను స్వయంగా కర్మ చేయుచూ, వారితో కర్మను చేయించవలెను. (3/25-26)

**జ్ఞాని, అజ్ఞాని యొక్క కర్మాచరణలో గల భేదమేమి?**

అర్జునా! అజ్ఞాని ప్రకృతిద్వారా జరుగుచున్న క్రియలను 'నేను చేయుచున్నాడను' అని తలంచి మోహితుడగుచున్నాడు. అనగా వాని యందాసక్తుడగుచున్నాడు. మరియు జ్ఞాని సకల గుణములు, గుణములందే ప్రవర్తించుచున్నవి. అనగా క్రియలన్నియునూ ప్రకృతిలోనే జరుగుచున్నవని తలంచి వాని యందాసక్తుడు గాకుండును. అనగా మోహితుడు గాకుండును. (3/27-28)

**నీపైన ఎంతటి బాధ్యత గలదో, అంతే బాధ్యత జ్ఞానిపైన గూడ గలదా?**

లేదు! జ్ఞాని, అజ్ఞానివలె కర్మచేయకుండిననూ ఫరవాలేదు. అయితే జ్ఞానియగు వాడు, ఏవిధంగానైనా మందమతియగు అజ్ఞానిని చలింపచేయ గూడదు. (3/29)

**కాని నేను మాత్రము చలించి పోవుచున్నాను కృష్ణా! ఏమి చేయుదును?**

అర్జునా! నీవు సమస్త కర్మలను నాకు సమర్పించి, ఆశ, మమతను వీడి నిశ్చింతుడవై యుద్ధము (కర్తవ్య కర్మ)ను జేయుము. (3/30)

**ఇట్లు చేయుటవలన ఏమగును?**

దోషదృష్టి రహితులై శ్రద్ధతో నా ఈ అభిప్రాయములను ఆచరించెడు వారలు ముక్తులయ్యెదరు. (3/31)

**చేయకుండినచో ఏమగును?**

దోషదృష్టిని కలిగి నా అభిప్రాయమును అనుసరించి ఆచరించని వారిని మూర్ఖులని భావించుము. అంతేగాక, వారిని నశించిన వారుగా నెరుగుము. (3/32)

**నీయొక్క అభిప్రాయమును ఆచరించని ఎడల వారు ఏల పతనమొందెదరు?**

జ్ఞాని యగువాడు తన శుద్ధ ప్రకృతి (రాగ, ద్వేష రహిత స్వభావము) ననుసరించి క్రియ నాచరించును. కాని ఈ మనుజులు తమ దూషిత ప్రకృతి (రాగ, ద్వేష యుక్త స్వభావము) ననుసరించియే కర్మ నాచరించెదరు. కావున వారలు పతనమయ్యెదరు. (3/33)

**పతనము గాకుండుటకు గల ఉపాయమేమి?**

మనుష్యుడు రాగ - ద్వేషములకు వశీభూతుడై (లోబడి) కర్మను చేయకూడదు. ఏలయనగా ఈ రెండునూ మనుజునకు శత్రువులు గదా! (3/34)

**అయినచో మనుష్యుడు ఏమి చేయవలెను?**

స్వధర్మమును ఆచరించవలయును. గుణము లేనిదైనను తన స్వధర్మమే (కర్తవ్యమే) శ్రేష్ఠమైనదని ఆచరించుచూ ఒకవేళ మరణించినను అది శ్రేయస్కరమే యగును. కాని ఇతరుల ధర్మము ఎంతటి గుణవంతమైనదైనప్పటికినీ అది భయదాయకమైనది. (3/35)

**అర్జునుడు ఇట్లనెను -**

**కృష్ణా! తన ధర్మము నాచరించుటయే శ్రేష్ఠమైనప్పుడు, మనుజుడు కోరకుండగనే దేనిచేత ప్రేరింపబడి అధర్మము (పాపము) ను ఆచరించుచున్నాడు?** (3/36)

భగవానుడు ఇట్లు చెప్పెను - పార్థా! రజోగుణమువలన పుట్టినది కామము (కోరిక). అది ఎప్పుడు కూడా తృప్తి పొందునది కాదు. మిక్కిలి

దుష్టమైనది. ఈ విషయంలో నీవు దీనినే శత్రువుగా నెరుగుము అనగా పాపము చేయించునదిగా తెలియుము. (3/37)

**మహాపాపియైన కామము ఏమి చేయును?**

పొగ, అగ్నిని; మురికి అద్దమును; మావి గర్భమును కప్పివేయునట్లు ఈ కామము (కోరిక) పాపము చేయకూడదనెడు కోరికను అణచిపెట్టి పాపమునందు నియోగించును. (3/38)

**ఇట్టి కామము ఎచ్చట నుండును?**

కౌంతేయా! ఆ కామము ఇంద్రియములు, మనస్సు, బుద్ధి - అను నీ మూడు స్థానములందుండి జ్ఞానమును కప్పివేసి జీవాత్మను మోహ పెట్టుచున్నది. (3/39-40)

**అట్టి కామమును నశింప జేయుటెట్లు?**

అర్జునా! మున్ముందుగా ఇంద్రియములను వశపరచుకొని, జ్ఞాన - విజ్ఞానమును నశింపజేయునట్టి, మహాపాపియగు కామమును చంపివేయుము. (3/41)

**కాని కృష్ణా! ఇట్టి మహాపాపియగు కామమును చంపివేయగల శక్తి గలుగుటెట్లు?**

ఓ మహాబాహూ! శరీరమున కంటె ఇంద్రియములు గొప్పవి, బలమైనవి, ప్రకాశించునవి, వ్యాపకములైనవి, సూక్ష్మములైనవి. ఇంద్రియములకంటే మనస్సు గొప్పది. మనస్సుకంటే బుద్ధి గొప్పది. బుద్ధికంటే కామము గొప్పది. కామమును ఇట్లు గొప్పదిగా నెరిగి ఆత్మబలముతో తనను తాను వశపరచుకొని కామమును చంపివేయవలెను. [కామము 'అహమ్' (కర్త) యందుండును. కావున కర్త జడవస్తువులచే ఆకర్షితుడగును. 'అహమ్' నందు ఒకటి ప్రకృతి (జడ) అంశము; మరొకటి పరమాత్మ (చేతన) అంశము కలదు. ప్రకృతి అంశము సహజముగా ప్రకృతి వైపునను, పరమాత్మ అంశము పరమాత్మ వైపునను (సజాతీయమగుటవలన) ఆకర్షించును. కావున 'అహమ్' యొక్క జడ - అంశమునందు కామముండును. చేతన అంశమునందు తత్త్వజిజ్ఞాస, ప్రేమ పిపాస మొదలగునవి ఉండును.] (3/42-43)

**'కర్మయోగము' అనెడు మూడవ అధ్యాయము ముగిసెను.**



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# నాల్గవ అధ్యాయము-జ్ఞాన,కర్మ,సన్న్యాస యోగము

శ్రీభగవాన్ ఉవాచ

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ।1।

ఏవం పరంపరాప్రాప్తమ్ ఇమం రాజర్షయో విదుః ।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప ।2।

స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ।3।

అర్జున ఉవాచ

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ।4।

శ్రీభగవాన్ ఉవాచ

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ।5।

అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ।6।

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ।7।

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ।8।

జన్మ కర్మ చ మే దివ్యమ్ ఏవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ।9।

వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః । 10 ।

యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవభజామ్యహమ్ ।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః । 11 ।

కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా । 12 ।

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ । 13 ।

న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే । 14 ।

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్ త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ । 15 ।

కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ । 16 ।

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః । 17 ।

కర్మణ్యకర్మ యః పశ్యేత్ అకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ । 18 ।

యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః । 19 ।

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్ కరోతి సః । 20 ।

నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ।21।

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।
సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ।22।

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ।23।

బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్।
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ।24।

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ।25।

శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీన్ విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి ।26।

సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ।27।

ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాపరే ।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః ।28।

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే ।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః ।29।

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి ।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ।30।

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్ ।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ।31।

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజాన్ విద్ధి తాన్ సర్వాన్ ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే ।32।

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే । 33 ।

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః । 34 ।

యద్ జ్ఞాత్వా న పునర్మోహమ్ ఏవం యాస్యసి పాండవ ।
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి । 35 ।

అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి । 36 ।

యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా । 37 ।

న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి । 38 ।

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరామ్ శాంతిమ్ అచిరేణాధిగచ్ఛతి । 39 ।

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః । 40 ।

యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్ ।
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ । 41 ।

తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగమ్ ఆతిష్ఠోత్తిష్ఠ భారత । 42 ।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానకర్మసన్న్యాసయోగోనామ చతుర్థోఽధ్యాయః ॥ 4 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# నాల్గవ అధ్యాయము - జ్ఞాన,కర్మ,సన్న్యాసయోగము

కృష్ణా! కర్మయోగమునందు కామము (కోరిక)ను నశింపజేయుటకు నీవు తెల్పిన ఆ కర్మయోగమునకు గల పరంపర ఎట్టిది?

శ్రీ భగవానుడు ఇట్లు పలికెను - కుంతీపుత్రా! ఈ నాశరహితమగు యోగమును నేను తొలుదొల్త సూర్యునకు జెప్పితిని. సూర్యుడు తన పుత్రుడగు మనువుతో, మనువు తన పుత్రుడగు ఇక్ష్వాకునకు జెప్పెను. ఇట్టి పరంపరగా వచ్చిన యోగమును తెలిసినవారు లేనందున ఇప్పుడది లుప్త ప్రాయమైనది.

ఓయి అర్జునా! నీవు నా భక్తుడవు, మిత్రుడవు కావున ఈ పురాతనమైన యోగమును నేను నీకు జెప్పితిని. అది మిగుల ఉత్తమమైనది, రహస్యమైనది. (4/1-3)

అర్జునుడు ఇట్లు పలికెను -

కాని ప్రభూ! నీవు ఉపదేశించినట్టి సూర్యుడు చాలా ముందుగా పుట్టియుండెను. మరి నీ జన్మము (అవతారము) ఇటీవలిది గదా! అయినచో పూర్వము (మహాసృష్టి ప్రారంభంలో) నీవే సూర్యునకు ఉపదేశించితివను సంగతిని నేనెట్లు గ్రహించగలను? (4/4)

శ్రీభగవానుడు ఇట్లు చెప్పెను -

అర్జునా! ఇది నా ఈ అవతారమునకు సంబంధించినది కాదు. నాకును, నీకును అనేక జన్మలు గడచినవి. వాని నన్నింటిని నేనెరుగుదును. అనగా ఏ ఏ జన్మము (అవతారము) లందు నేను ఏమేమి చేసితినో, ఆ సంగతులన్నింటిని నేను ఎరుగుదును. కాని నీవు, నీ జన్మలనుగాని, కర్మలను గాని ఎరుగవు. (4/5)

నేను జన్మించినట్లుగా, నీవు జన్మించలేదా ఏమి?

లేదు! నేను పుట్టుకలేని వాడను, అవినాశిని, ప్రాణులకు ఈశ్వరునిగా ఉంటూనే స్వీయ ప్రకృతిని వశపరచుకొని నా యోగమాయ చేత ప్రకట మగుచున్నాను (అవతరించుచున్నాను.) (4/6)

**నీవు అవతరించెడు సమయ మెట్టిది?**

ధర్మమునకు హాని, అధర్మమునకు వృద్ధి కలిగినప్పుడు నేను అవతరించెదను. (4/7)

**నీవు అవతరించుటకుగల ప్రయోజనమేమిటి?**

సాధువు (భక్తు)ల రక్షణ, దుష్టుల శిక్షణ మరియు ధర్మ సంస్థాపన చేయుటకై నేను యుగ - యుగములందు అవతరించుచుందును. (4/8)

**ఈ విధంగా మాటి - మాటికి జన్మించుట (అవతరించుట) వలన తమరు బంధింపబడరా ఏమి?**

లేదు! నా యొక్క జన్మ, కర్మలు దివ్యములైనవి. నాదంటూ ఏలాంటి స్వార్థము, ప్రయోజనము లేకుండగ లోకమునకు మేలు చేకూర్చుట కొరకే నేను ప్రకటమయ్యెదను. దీనినెవరు యథార్థముగా తెలుసుకొనెదరో, వారు నన్ను పొందెదరు. మరల జన్మించరు. (4/9)

**నిన్ను పొందెదరనుటలో ఏదేని ప్రమాణము కూడా గలదా?**

మత్ పరాయణులైన చాలామంది మనుష్యులు నా యొక్క దివ్యమైన జన్మకర్మల, జ్ఞానముతో పవిత్రులై, రాగాదుల చేత రహితులై నన్నే పొందియుండిరి. (4/10)

**వారు ఏ భావముతో నిన్ను శరణు పొందెదరు?**

వారు సంసారమును విడిచిపెట్టి ఏ భావంతో నా శరణు పొందెదరో, నేను కూడా వారి యెడల అదే భావంతో అటులే వ్యవహరించెదను. నా కర్మమును యథార్థముగా తెలిసికొనునట్టి ఈ వ్యవహారపు తీరు సాంసారిక మనుజులపైన గొప్పగా ప్రభావము కల్గించును. తద్వారా వారు కూడా స్వార్థమును, అభిమానమును విడనాడి లోకమునకు మేలు చేయుటకై తత్పరులయ్యెదరు.❖ (4/11)

---

❖ భగవానుడు అవతరించుట, భక్తులను రక్షించుట, దుష్టులను అంతమొందించుట (శిక్షించుట) ధర్మమును సంస్థాపించుట, అతని పరాయణులగు వారికి అన్ని విధములుగా మేలు చేయుట, వారి యెడల ప్రేమాదరముల జూపుట - ఇవన్నియునూ కర్మయోగము యొక్క ఆదర్శములు, వానివలన లోకమునకు మేలు కలుగును.

**నీ శరణుగోరు వారలకు నీవు ఇంతగా అనుకూలమైనప్పటికి కూడా మనుష్యులు నిన్ను విడిచిపెట్టి, ఇతర దేవతలను ఏల ఉపాసించెదరు?**

వారి అంతర్యమున ప్రాపంచిక మహత్త్వముండుట వలన వారలు కర్మజనిత సిద్ధినే కోరెదరు. అందుచేత వారలు నన్ను విడిచిపెట్టి దేవతలను ఉపాసించెదరు. ఏలయనగా వారికి కర్మ జన్య సిద్ధి శీఘ్రముగ గలుగును. (4/12)

**మనుష్యులు కర్మజనిత సిద్ధి నపేక్షించి ఏవిధంగా శుభకర్మను జేసెదరో అనగా దేవతలనుపాసించెదరో, అటులే నీవు కూడా ఏదేని ఫలమునపేక్షించి సృష్టిరచన చేయుచుండవచ్చునుగదా?**

నేను జీవుల గుణ, కర్మల ననుసరించి వారిని నాలుగు వర్ణములుగా సృజించుదును. అయితే కర్తృత్వమును, ఫలాకాంక్షను లేకుండా చేసెదను. అందుచేత ఆ కర్మ నన్ను బంధింపదు. అంతేగాదు, ఇట్టి తత్త్వమును తెలిసికొనినవాడు కూడా కర్మలతో ఎప్పుడూ బంధింపబడడు.❖(4/13-14)

**ఇట్టి తత్త్వమును తెలిసికొని ఇంతకు ముందుకూడా ఎవరేని కర్మ నాచరించియున్నారా?**

అవును. పూర్వము ముముక్షువులు ఇట్టి తత్త్వమును తెలుసుకొని కర్మనాచరించిరి. అందుచేత నీవు కూడా వారి వలెనే కర్మను చేయుము. (4/15)

**ఏ కర్మను ముముక్షువులు ఆచరించినారో, ఏ కర్మను చేయుటకై నీవు ఆజ్ఞాపించుచున్నావో, అట్టి కర్మ ఏమిటి?**

కర్మ అనగా నేమి? అకర్మ అనగానేమి? అను విషయంలో గొప్ప విద్వాంసులు కూడా మోహితులయ్యెదరు. దేనిద్వారా నీకు ముక్తి కలుగునో, అట్టి కర్మ తత్త్వమునే ఇప్పుడు నీకు తెలియజేసెదను. కర్మ, వికర్మ, అకర్మ -

---

❖ భగవంతుడు ఫలేచ్ఛారహితుడై కర్మజేయు నటులే మనము కూడా ఫలము నందాసక్తిని (కోరికను) విడిచిపెట్టి కర్మను చేయాలి - అని ఈ రీతిగా తెలుసుకొని కర్మ జేయువాడు కూడా బంధింపబడడు.

అని కర్మ మూడు విధములు. వాని తత్త్వమును తప్పకుండా తెలుసుకొనవలెను. ఏలయనగా కర్మ తత్త్వము మిక్కిలి నిగూఢమైనది. దానినెరుగుట అవసరము. (4/16-17)

**కర్మ, అకర్మల తత్త్వమును తెలియుట అనగా నేమి?**

కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను చూచుట అనగా కర్మజేయుచు నిర్లిప్తంగా నుండుట మరియు నిర్లిప్తంగా నుంటూ కర్మనాచరించుట - అను నీ రీతిగా సమస్త కర్మలను చేయువాడే యోగి, బుద్ధిమంతుడు. (4/15)

**ఏమిటా బుద్ధిమత్వము?**

ఎవని కర్మలు సంకల్పము, కోరికలు లేనివై యుండునో, ఎవని సమస్త కర్మలు జ్ఞానాగ్ని చేత దహింపబడునో, అట్టివానిని జ్ఞానులు కూడా పండితుడు అని పలికెదరు. ఇదియే అతని బుద్ధిమత్వము, విజ్ఞత యనబడును.(4/19)

**అట్టి పురుషుని స్థితి ఏమగును?**

అతడు కర్మయందు, కర్మఫలములయందు ఆసక్తిని, ఆశ్రయమును కలిగి యుండడు. నిరంతరము తృప్తిగా నుండును. అందుచేత అతడు సమస్తమును ఆచరించుచు కూడా ఏమియు చేయని వాడే యగును. (4/20)

**ఒకవేళ ఏ సాధకుడేని నివృత్తి పరాయణుడగుచో?**

శరీర అంతఃకరణములను వశపరచుకొన్నవాడు, సకల విధముల సంగ్రహము (పరిగ్రహము)ను త్యజించినవాడును, సాంసారిక ఆశలేని వాడునగు సాధకుడు కేవలము శరీర సంబంధమగు కర్మను జేసినను బంధింపబడడు. (4/21)

**ఒకవేళ సాధకుడు ప్రవృత్తి పరాయణుడగుచో?**

అతడు కూడా ఎలాంటి పరిస్థితి ఏర్పడునో, దానితోడనే సంతుష్టుడై యుండును, ఈర్ష్యలేనివాడును, ద్వంద్వరహితుడును (ఏదేని కార్యము) సిద్ధించినను, సిద్ధింపకున్నను సమంగా నుంటూ కర్మ జేసినను బంధింపబడడు. అంతేగాదు, ఎవడు ఆసక్తిరహితుడై, స్వాధీనుడై, పరమాత్మను పొందుటకు

మాత్రమే నిశ్చయము గలవాడునై యిట్లు యజ్ఞార్థంగా కర్మనాచరించువాడునగు సాధకుని యొక్క సమస్త కర్మలు విలీనమై పోవును. అనగా వాని కర్మలన్నియును అకర్మగా నగుచున్నవి. (4/22-23)

**కృష్ణా! ఆ యజ్ఞము లెన్ని విధములుగా నుండును?**

పార్థా! సకల కరణములు, ఉపకరణములు, సామగ్రి, క్రియాదులన్నియు బ్రహ్మస్వరూపమే యగుచున్నవి. అదియే 'బ్రహ్మయజ్ఞ'మనబడును. సమస్త సామగ్రి, క్రియాదులు నాకు అర్పించబడునది 'భగవదర్పణరూప యజ్ఞము' అగును. సాధకుడు తన్నుతాను బ్రహ్మయందు ఐక్యము జేయునది 'అభిన్నతారూప యజ్ఞము' అగును. సాధకుడు తన యింద్రియములను వాని-వాని విషయములనుండి తొలగజేయునట్టిది, సంయమనము జేయునట్టిది- 'సంయమ రూపయజ్ఞము' అనబడును. సాధకుడు రాగ-ద్వేష రహితమగు ఇంద్రియములతోడ విషయ సేవనము జేయునది 'విషయ - హవనరూప యజ్ఞ' మగును. ప్రాణముల, ఇంద్రియముల, మనస్సుయొక్క వ్యాపారముల నన్నింటిని నిరోధించి, బుద్ధి జాగృతమై యుంటూ నిర్వికల్పము నొందుట 'సమాధిరూప యజ్ఞ' మగును. స్వధర్మమును నిర్వహించుట యందు కలిగెడు కష్టమును ప్రసన్నతా పూర్వకంగా సహించుట 'తపోయజ్ఞ'మగును. సిద్ధి - అసిద్ధి యందు సమంగా నుండుటయే 'యోగ యజ్ఞము' అనబడును, సత్-శాస్త్రముల పఠన, పాఠనము, నామ - జపాదులను చేయుట, 'స్వాధ్యాయ రూప జ్ఞానయజ్ఞము' అగును. పూరకము, కుంభకము, రేచకములతో ప్రాణాయామము చేయుట 'ప్రాణాయామ రూప యజ్ఞ' మందురు. ఈ సమస్త యజ్ఞములు కేవలము కర్మసంబంధమగు బంధమును తొలగించుట కొరకేనని ఎరుగవలెను. ఈ విధంగా చేయబడిన యజ్ఞముల వలన సకల పాపములు నశించిపోవును. (4/24-30)

**అచ్యుతా! పాపములు నశించిన మీదట ఏమగును?**

ఓ కురుశ్రేష్ఠా! పైన పేర్కొనబడిన యజ్ఞము చేయువారలకు అమృత స్వరూపుడగు పరమాత్ముని ప్రాప్తి కలుగును. కాని యజ్ఞము చేయని వానికి ఇహలోకముకూడా లాభదాయకముగాదు. అట్టియెడల పరలోకము లాభదాయకమగుటెట్లు? (4/31)

**ఈ యజ్ఞములను గూర్చి మరెచ్చట వర్ణింపబడియున్నవి?**

ఓ పరంతపా! ఈ విధమైన యజ్ఞములు వేదములందు వర్ణింపబడి యున్నవి. ఈ యజ్ఞములను కర్మవలన పుట్టినవానిగ (కర్మజన్యములని) నీ వెరుంగుము. ఇవ్విధముగ తెలిసి యజ్ఞము చేసిన యెడల నీవు అశుభ సంసారమునుండి విముక్తుడవు కాగలవు. (4/32)

**ప్రభూ! శ్రేష్ఠమైన యజ్ఞ మెయ్యది?**

పరంతపా! కర్మ జన్య యజ్ఞము కంటే జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది. ఏలయనిన జ్ఞానమునందే సమస్త కర్మలు లయమగుచున్నవి. (4/33)

**మధుసూదనా! ఇట్టి జ్ఞానమును పొందుటెట్లు?**

ఓ కుంతీపుత్రా! అట్టి జ్ఞానమును పొందుట కొరకై నీవు జ్ఞానుల వద్ద కేగుము. వారి పాదపద్మములకు సాష్టాంగ వందనము నాచరింపుము. అనంతరము వారికి సేవ చేయుము. వినయ పూర్వకంగా తత్త్వ జిజ్ఞాసను గూర్చి ప్రశ్నించుము. అప్పుడా జ్ఞానులగు మహాపురుషులు నీకు జ్ఞానమును ఉపదేశించెదరు. (4/34)

**కృష్ణా! వారి ఉపదేశ జ్ఞానమువలన ఏమి లభించును?**

అర్జునా! ఆ జ్ఞానము లభించిన పిమ్మట నీకు మోహము కలుగకుండును. అంతేగాక నీవు సమస్త ప్రాణులను మొదట నీయందును, మరల నా యందును చూడగలవు. అనగా సర్వత్రా ఒకే ఒక పరమాత్మ తత్త్వమును మాత్రమే అనుభవింపగలవు. (4/35)

**ప్రభూ! ఈ జ్ఞానము యొక్క మహిమ ఇంకనూ ఏమైన గలదా?**

అవును పార్థా! ఉన్నది. ఒకవేళ నీవు సమస్త పాపాత్ముల కంటే కూడ మిగుల పాపివైనప్పటికి గూడా జ్ఞాన రూపమగు నావ ద్వారా సకల పాపములను నీవు లెస్సగా దాటగలవు. (4/36)

**నావ ద్వారా సముద్రమును దాటిన మీదట సముద్ర మెట్లుండునో, అటులే పాపముల నుండి దాటిన పిమ్మట పాపమైతే వుంటుంది గదా?**

లేదు అర్జునా! దేదీప్యమానమగు (ప్రజ్వలింప చేయబడిన) అగ్ని కట్టెలను

ఏవిధంగా కాల్చి పూర్తిగా బూడిద జేయునో, అదేవిధంగా జ్ఞానరూపమగు అగ్ని సమస్త కర్మలను భస్మమొనర్చును. కావున ఈ మర్త్యలోకమునందు జ్ఞానముతో సమానముగ పవిత్రమైనది ఏదియును లేదు. ఆ జ్ఞానమే కర్మయోగము ద్వారా సిద్ధిని పొందిన పురుషునకు తనంతతానుగా ప్రాప్తించును.

(4/37-38)

**కర్మయోగ సిద్ధిని పొందిన పురుషునకు తనకు తానుగా ప్రాప్తించునట్టి జ్ఞానమును సాధకుడు పొందుటెట్లు?**

పార్థా! ఇంద్రియములను వశపరచుకొన్నవాడు, సాధన పరాయణుడు, శ్రద్ధగలవాడునగు సాధకునకు అట్టి జ్ఞానము లభించగలదు. ఇక జ్ఞానమును పొందిన అతడు మిక్కిలి శీఘ్రముగ పరమశాంతిని పొందగలుగును.

(4/39)

**కృష్ణా! ఇట్టి జ్ఞానమును పొందుటలో గల ఆటంకమేమిటి?**

కుంతీపుత్రా! స్వయంగా తెలియనివాడు, ఇతరులపై శ్రద్ధలేనివాడు, సంశయ చిత్తుడునగు పురుషుడు పతనమొందును. ఇట్టి సంశయము గల పురుషునకు ఇహలోకముగాని, పరలోకముగాని సౌఖ్యదాయకముగా నుండదు.

(4/40)

**ప్రభూ! ఈ సంశయము దూరమైన పిదప ఏమగును?**

ధనంజయా! కర్మయోగము ద్వారా కర్మలను నాశమొనర్చినవాడును, వివేక - విచారములతో సంశయమును నివర్తించిన వాడును అగు పురుషునకు జ్ఞానము లభించును. ఇక అతనిని కర్మలు బంధింపజాలవు. (4/41)

అర్జునా! హృదయమున నున్నట్టి అజ్ఞానమువలన పుట్టిన సంశయములను జ్ఞానరూపియను ఖడ్గముచే ఛేదించి నీవు నీ కర్తవ్య నిర్వహణమునకై సిద్ధము గమ్ము. (4/42)

'జ్ఞాన, కర్మ, సన్న్యాసయోగము' అనెడు
నాలుగవ అధ్యాయము ముగిసెను.



|| ఓం శ్రీపరమాత్మనే నమః ||

# ఐదవ అధ్యాయము - కర్మసన్న్యాస యోగము

అర్జున ఉవాచ

సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి ।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ।1।

శ్రీభగవాన్ ఉవాచ

సన్న్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ ।
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే ।2।

జ్ఞేయః స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ ప్రముచ్యతే ।3।

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః ।
ఏకమప్యాస్థితః సమ్యక్ ఉభయోర్విందతే ఫలమ్ ।4।

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ।5।

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః ।
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి ।6।

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ।7।

నైవ కించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ।8।

ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ నిమిషన్నపి ।
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్ ।9।

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా ॥ 10 ॥

కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి ।
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే ॥ 11 ॥

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్ ।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ 12 ॥

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్ న కారయన్ ॥ 13 ॥

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥ 14 ॥

నాదత్తే కస్యచిత్ పాపం న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః ॥ 15 ॥

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।
తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ 16 ॥

తద్బుద్ధయస్తదాత్మానః తన్నిష్ఠాస్తత్పరాయణాః ।
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ 17 ॥

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥ 18 ॥

ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్ బ్రహ్మణి తే స్థితాః ॥ 19 ॥

న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య నోద్విజేత్ ప్రాప్య చాప్రియమ్ ।
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥ 20 ॥

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్ ।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥ 21 ॥

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః । 22 ।

శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః । 23 ।

యోఽంతఃసుఖోఽంతరారామః తథాంతర్జ్యోతిరేవ యః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి । 24 ।

లభంతే బ్రహ్మనిర్వాణమ్ ఋషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః । 25 ।

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ । 26 ।

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్ చక్షుశ్చైవాంతరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ । 27 ।

యతేంద్రియమనోబుద్ధిః మునిర్మోక్షపరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః । 28 ।

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి । 29 ।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాసయోగోనామ పంచమోఽధ్యాయః ॥ 5 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# ఐదవ అధ్యాయము - కర్మ, సన్న్యాసయోగము

అర్జునుడు ఇట్లు పలికెను -

ఓ కృష్ణా! ఒకసారి కర్మల త్యాగమును (సాంఖ్యయోగము) గూర్చి చెప్పెదవు. మరొకసారి కర్మయోగము ననుష్ఠించుట గూర్చి కూడా చెప్పెదవు. ఈ రెండింటిలో నిశ్చితముగా నాకు శ్రేయస్కరమైన దానిని మాత్రమే తెలియజెప్పుము. (5/1)

శ్రీ భగవానుడిట్లు వచించెను - అర్జునా! సాంఖ్యయోగము మరియు కర్మయోగము - అను నీ రెండునూ సమానంగా శ్రేయమును చేకూర్చునవే; కాని సాంఖ్యయోగమున కంటెను కర్మయోగమే శ్రేష్ఠమైనదని తెలియుము. (5/2)

**ప్రభూ! కర్మయోగమే ఎందుకు శ్రేష్ఠమైనది?**

పార్థా! రాగ, ద్వేషములు లేని కర్మయోగి ఎల్లప్పుడును సన్న్యాసిగా తెలియదగినవాడు. ఏలయనిన అతడు ద్వంద్వ రహితుడగుటచే సుఖముగా సంసార బంధమునుండి ముక్తుడైపోవును. (5/3)

**రెండునూ మేలు చేకూర్చునవియేనని నీవు తెలిపితివి. అయితే ఆ రెండింటి ఫలములలో భేదము లేదా?**

సాంఖ్యమును యోగమును వేర్వేరుగా చెప్పెడివారు బాలకులే (అజ్ఞులే) కాని పండితులుగారు, ఏలయన, రెండింటిలోనూ ఏ ఒకదాని యందు నిలిచినను సాధకుడు రెండింటి ఫలములను పొందును. అనగా - సాంఖ్యయోగులు ఏ ఫలమును పొందెదరో, అట్టి ఫలమునే కర్మయోగులు కూడా పొందెదరు. అందుచేత ఫలమునందు సాంఖ్యమును, యోగమును ఒకటిగా గాంచినవారే నిజమగు వివేకదృష్టి గలవారగుదురు. (5/4-5)

**రెండింటి ఫలితము ఒక్కటే అయినప్పుడు కర్మయోగము శ్రేష్ఠమెట్లగును?**

కర్మయోగము లేకుండా అనగా సిద్ధి-అసిద్ధి యందు సమంగా నుండకుండా సాంఖ్యయోగము సిద్ధించుట అనగా సమరూప స్వరూపమునందు నిలచియుండుట కష్టము. కాని యోగయుక్తుడగు ఏ

పురుషుడు సిద్ధి - అసిద్ధి యందు సముడగునో, అతడు సమరూప బ్రహ్మను శీఘ్రముగా పొందగలుగును. (5/6)

**కర్మయోగము ద్వారా బ్రహ్మను అతడెట్లు పొందగలుగును?**

మనస్సును, శరీరేంద్రియములను జయించినవాడు, సమస్త ప్రాణులలో తన్నుతాను స్థితునిగా గాంచువాడునగు యోగయుక్తుడగు పురుషుడు కర్మ నాచరించుచు కూడా కర్మలతో లిప్తుడు గాకుండును అనగా తత్త్వమును పొందగలడు. (5/7)

**సాంఖ్యయోగి కర్మలతో నిర్లిప్తంగా ఎట్లుండగలడు?**

సత్ - అసత్ తత్త్వము నెరిగి సత్తునందే స్థిరంగా నుండెడు సాంఖ్యయోగి చూచుచు, వినుచు, స్పర్శించుచు, ఆఘ్రాణించుచు, తినుచు, నడచుచు, నిద్రించుచు, శ్వాసించుచు, మాటలాడుచు, మల మూత్రములను విసర్జించుచు, కన్నులు మూయుచూ, తెరుచుచూ కూడా 'ఇంద్రియములే తమ - తమ విషయములలో వర్తించుచున్నవి' అని భావించి స్వరూప భూతంగా (స్వయంగా)నే నేదికూడా చేయుట లేదని - అనుభవించి కర్మలతో నిర్లిప్తంగా నుండును. (5/8-9)

**కర్మయోగి, సాంఖ్యయోగి - ఈ ఇరువురు కర్మలతో నిర్లిప్తంగా నుండెదరు. ఇట్లు నిర్లిప్తంగా నుండుటకు మరింకేదేని ఉపాయమున్నదా?**

అవును. ఉన్నది. భక్తియోగి ఆసక్తిని త్యజించి సకల కర్మలను పరమాత్మునకు అర్పించి వేయును. అందుచేత అతడు కూడా నీటియందలి తామరాకు వలె కర్మలతో అంటుకొనకుండును. (5/10)

**భక్తియోగి భగవత్సమర్పణ భావముతో కర్మ నాచరించును. కనుక అతడు కర్మలతో లిప్తుడు కాడు. అయితే కర్మయోగి ఏ ఉద్దేశ్యంతో కర్మనాచరించుచూ లిప్తుడు కాడు?**

కర్మయోగి శరీర, ఇంద్రియ, మనో, బుద్ధులతో మమకారమును వదిలివేసి, ఫలాసక్తిని త్యజించి కేవలం అంతఃకరణ శుద్ధికొరకే కర్మ నాచరించుటచేత అతడు ఎల్లప్పుడు శాశ్వతమైన శాంతిని పొందును. కాని యోగి కానివాడు కోరిక కారణంగా కర్మఫలంతో బంధించబడును.

**ప్రభూ! సాంఖ్యయోగి కర్మ నాచరించు విధమెట్టిది?**

శరీరమును, ఇంద్రియములను, మనస్సును వశపరచుకొనిన సాంఖ్యయోగి, మనస్సుతో సకల కర్మలను నవ ద్వారములతో గూడిన శరీరమునందు వదిలివేసి తాను చేయువానిగా గాని, చేయించువానిగా గాని యుండక స్వస్వరూపమునందే స్థితుడై యుండును. (5/13)

**ఆ సాంఖ్యయోగి కర్మ చేయడు, కర్మను చేయించడు. అయితే పరమాత్ముడే కర్మ చేస్తూ, చేయించవచ్చును కదా?**

ఆ పరమాత్ముడు ఎవరి కర్తృత్వాన్ని సృష్టింపడు, ఎవరితోనూ కర్మను చేయించడు. అటులే ఎవరి కర్మఫల సంయోగమును గానీ సృజింపడు. కాని జీవులు తమ - తమ స్వభావము (అభ్యాసము) ననుసరించియే కర్మలు చేయుదురు. తమ యందు కర్తృత్వమును భావింతురు. అందువలన కర్మల ఫలసంయోగము దానంతటదే ఏర్పడును. (5/14)

**పరమాత్ముడు ఎవరి కర్తృత్వాదులను సృజించడుగానీ, ప్రాణుల కర్మఫలాన్ని అయితే స్వీకరించవచ్చును గదా?**

ఆ వ్యాపక తత్త్వము (పరమేశ్వరుడు) ఎవరి పాపపుణ్యములనూ స్వీకరింపడు. కాని అజ్ఞానముచేత జ్ఞానము కప్పబడి యుండుట వలననే ఆ జీవులు (జనులు) మోహము నొందుచున్నారు. అనగా తమను కర్మలకు కర్తగా, భోక్తగా భావించెదరు. అందుచేత వారు జనన - మరణచక్రములో పడెదరు. (5/15)

**అయితే ఏమిటి, జీవులందరు కూడా ఇదేవిధంగా తమను కర్తగా, భోక్తగా భావించి మోహము నొందుచుండెదరా?**

కాదు, కాదు! జ్ఞానము ద్వారా తమ అజ్ఞానమును నశింపజేయు వారిలో ఆ జ్ఞానము సూర్యునివలె కర్తృత్వ, భోక్తృత్వ రహితమగు తత్త్వమును ప్రకాశింపజేయుచున్నది. అనగా దానిని అనుభవింప జేయుచున్నది. (5/16)

**అట్టి జ్ఞానమును పొందగల సాధన మేది?**

తద్రూపమునొందిన మనస్సు, బుద్ధిని గలవాడై, పరమాత్మ తత్త్వమునందే నిలిచియున్న వాడై తత్పరాయణుడగు సాధకుడు జ్ఞానము వలన పుణ్య - పాపరహితుడై పరమాత్మను పొందును. అతనికి పునర్జన్మ యుండదు. (5/17)

**పరమాత్మను పొందినట్టి మహాత్ముల జ్ఞానము వ్యవహార సమయము నందెట్లుండును?**

అట్టి తత్త్వజ్ఞులగు మహాపురుషులు, విద్యా వినయముగల బ్రాహ్మణుని యందును, ఆవు, ఏనుగు, కుక్క, చండాలుని యందును ఒక్క పరమాత్మనే సమరూపంగా దర్శించెదరు. అన్నపానాదుల విషయములో ఏకత్వమును ఆచరింపరు. (5/18)

**వారు ఇట్టి సమదర్శులుగా ఎందుకయ్యెదరు?**

మనస్సు ఎల్లప్పుడు సామ్యావస్థ (సమభావము) యందు అనగా పరమాత్మ తత్త్వమునందు నిలిచియుండు వారలు సంసారమును జయించుదురు. అనగా వారలు సంసారము నందు ఉన్నతంగా ఎదిగి పోయెదరు. బ్రహ్మము దోషరహితుడు, సముడు అగుటచేత వారు సమరూపుడగు బ్రహ్మమునందు స్థితులై యుండెదరు. (5/19)

**ఇట్లు సామ్యావస్థయందు నిలిచి యుండుటకు గల ఉపాయమేమి?**

వ్యవహారంలో అనుకూల - ప్రతికూల పరిస్థితులు సంభవించినపుడు రాగ - ద్వేషములకు లోనుకాకుండా, మోహరహితుడై, స్థిరబుద్ధిని కలిగియుండెడు పురుషుడు పరమాత్మయందే నిలిచి యుండును. (5/20)

**ఈ స్థితి ఏ క్రమంలో పొందబడుతుంది ప్రభూ!**

అర్జునా! బాహ్య పదార్థముల యందు ఆసక్తి లేక, అతడు తనలో తానుగా (ఆత్మస్థుడై) సాత్త్విక సుఖమును అనుభవించుచుండును. అప్పుడాతడు పరమాత్మతో ఏకమై అక్షయ సుఖమును అనుభవించును. (5/21)

**బాహ్య పదార్థములయందు ఆసక్తి కలిగియుండక పోవుటెట్లు?**

ఓ కుంతీనందనా! సంబంధ-సంయోగ జనిత సుఖములన్నీ కూడా ఆది, అంతములను కలిగియుండి, దుఃఖములకు కారణములగుచున్నవి కావున వివేకవంతుడగు పురుషుడు వానియందు రమింపడు. (5/22)

**భోగాసక్తుడు కానివాని వైశిష్ట్యమేమి?**

జీవితకాలమునందే కామ క్రోధముల వేగములను సహించుటకు సమర్థుడగు వాడు లేదా కామ క్రోధముల వేగము ఉత్పన్నముగాకుండా నిగ్రహించి యుండువాడే నిజమైన సుఖవంతుడు, అతడే యోగి, అతడే నరుడు, వీరుడు అని తెలియుము. (5/23)

**అటు పిమ్మట ఏమగును?**

కామక్రోధ వేగములుత్పన్నము కానందున బాహ్య పదార్థములందలి

ఆసక్తి లేమిచే అతనికి పరమాత్మ తత్త్వ సుఖము లభించును. అతడు పరమాత్మయందే రమించుచుండును. అతని జ్ఞానము సదా అలుప్తమై యుండును. ఈ విధంగా బ్రహ్మస్వరూపుడైన సాధకుడు శాంత బ్రహ్మను పొందుచున్నాడు. (5/24)

**ఆ శాంత బ్రహ్మమును ఇంకా ఎవరు పొందుదురు?**

ఇంద్రియములను వశపరచుకొన్నవారు, ప్రాణుల హితమునందు తత్పరులై యుండువారు, పాపములు నశించి పోయినవారు, మనో సంశయములు తొలగిపోయినవారు, అగు వివేకులైన సాధకులు నిర్వాణ బ్రహ్మను పొందుచున్నారు. (5/25)

**నిర్వాణ బ్రహ్మను పొందగలుగు లక్షణములేవి?**

ఎవరి అంతఃకరణము స్వాధీనమై యుండునో, ఎవరు రాగద్వేష కామక్రోధ రహితులో, అట్టివారికి జీవించినను, లేక మరణించినను - నిరంతరము నిర్వాణ బ్రహ్మయే పొందబడును. అనగా వారు సచ్చిదానందమైన బ్రహ్మయందు ఐక్యమై పోయెదరు. (5/26)

**వేరొక సాధన ద్వారా ఈ సుఖము లభింపగలదా?**

అవును, ఈ సుఖము ధ్యానయోగము ద్వారా కూడా లభించును. బాహ్య విషయములను బయటకు నెట్టివేసి అనగా ప్రాకృతములైన విషయములను త్యజించి నాసిక యందు సంచరించు ప్రాణాపానవాయువులను - రేచక, పూరకములను సమముగావించి, మనస్సును, బుద్ధిని, ఇంద్రియములను వశపరచుకొనునట్టి కామ, క్రోధ భయరహితుడు, మోక్షపరాయణుడునగు సాధకుడు నిత్యముక్తుడే యగును. (5/27-28)

**ఈ నిర్వాణ సుఖము లభించుటకుగాను, వేరే సులభమైన సాధనము గలదా?**

అర్జునా! కలదు, అదియే భక్తియోగము. సకల యజ్ఞములకు, తపస్సులకు నన్ను భోక్తగా, సకల లోకములకు మహేశ్వరునిగా మరియు ప్రాణి మాత్రులకు సుహృదుని (సుహృత్తు)గా తెలిసికొని దృఢముగా విశ్వసించువానికి శాశ్వతముగా పరమశాంతి లభించి తీరును. (5/29)

'కర్మ సన్న్యాస యోగము' అనెడు ఐదవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# ఆఱవ అధ్యాయము - ఆత్మసంయమయోగము

శ్రీ భగవాన్ ఉవాచ

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాక్రియః ।1।

యం సన్న్యాసమితి ప్రాహుః యోగం తం విద్ధి పాండవ ।
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన ।2।

ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే ।3।

యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే ।4।

ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః ।5।

బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ।6।

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః ।7।

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః ।8।

సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ।9।

యోగీ యుంజీత సతతమ్ ఆత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ।10।

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్ ।11।

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః ।
ఉపవిశ్యాసనే యుంజ్యాత్ యోగమాత్మవిశుద్ధయే ।12।

సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ।13।

ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః ।
మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ।14।

యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః ।
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ।15।

నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ।16।

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ।17।

యదా వినియతం చిత్తమ్ ఆత్మన్యేవావతిష్ఠతే ।
నిఃస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ।18।

యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః ।19।

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ।20।

సుఖమాత్యంతికం యత్తత్ బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్ ।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ।21।

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ।22।

తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥ 23 ॥

సంకల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః ।
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః ॥ 24 ॥

శనైః శనైరుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥ 25 ॥

యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్ ।
తతస్తతో నియమ్యైతత్ ఆత్మన్యేవ వశం నయేత్ ॥ 26 ॥

ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥ 27 ॥

యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శమ్ అత్యంతం సుఖమశ్నుతే ॥ 28 ॥

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ 29 ॥

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥ 30 ॥

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥ 31 ॥

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥ 32 ॥

అర్జున ఉవాచ

యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన ।
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥ 33 ॥

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్ ।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥ 34 ॥

శ్రీభగవాన్ ఉవాచ

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥ 35 ॥

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥ 36 ॥

అర్జున ఉవాచ

అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥ 37 ॥

కచ్చిన్నోభయవిభ్రష్టః ఛిన్నాభ్రమివ నశ్యతి ।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥ 38 ॥

ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః ।
త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥ 39 ॥

శ్రీభగవాన్ ఉవాచ

పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।
న హి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి ॥ 40 ॥

ప్రాప్య పుణ్యకృతాం లోకాన్ ఉషిత్వా శాశ్వతీః సమాః ।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥ 41 ॥

అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥ 42 ॥

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్ ।
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన ॥ 43 ॥

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే । 44 ।

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధః తతో యాతి పరాం గతిమ్ । 45 ।

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున । 46 ।

యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః । 47 ।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే ఆత్మసంయమయోగోనామ షష్ఠోఽధ్యాయః ॥ 6 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# ఆఱవ అధ్యాయము - ఆత్మసంయమయోగము

శ్రీభగవానుడు పలికెను - అర్జునా! (రెండవ అధ్యాయము నుండి ఐదవ అధ్యాయము వరకు) నేను కర్మయోగమును గూర్చిన అనేక విషయములను తెలిపితిని. ఇప్పుడిక కర్మయోగ సారమును గూర్చి తెలిపెదను. కర్మఫలమును - ఉత్పత్తి, వినాశకరమగు పదార్థములను ఆశ్రయింపక కర్తవ్య కర్మనాచరించు మనుష్యుడే సన్న్యాసి, అతడే యోగి యనబడును. కేవలము అగ్నిని, క్రియను త్యజించినంత మాత్రమున వాడు సన్న్యాసి గాని, యోగిగాని కానేరడు. (6/1)

**కృష్ణా! సన్న్యాసిలో, యోగిలో గల గొప్ప మహత్త్వము ఏమిటి?**

అర్జునా! అదియే సంకల్పత్యాగము. ఏలయన, సంకల్పాలను వదిలిపెట్టకుండా మనిషి ఎలాంటి యోగి కాజాలడు కదా! (6/2)

**కేశవా! యోగి యగుటకు ముఖ్య కారణమేమి?**

పార్థా! యోగమునందు ఆరూఢము కాగోరెడు వాడు నిష్కామ భావంతో కర్మ నాచరించవలెను. అదియే అందులకు ముఖ్య కారణము. అట్టి యోగారూఢుడగు పురుషునకు లభించు శాంతియే పరమాత్మ తత్త్వమును పొందుటకు ముఖ్యకారణము అనగా సంసారమును త్యజించుటచే లభించెడు శాంతిని ఉపభోగించకపోవుటయే పరమాత్మ తత్త్వము ప్రాప్తించుటకు కారణమగుచున్నదని తెలియుము. (6/3)

**అచ్యుతా! యోగారూఢుని లక్షణము లెట్లుండును?**

యోగారూఢునకు ఎలాంటి పదార్థములందుగాని, ఎటువంటి కర్మల యందుగాని ఆసక్తి ఉండదు. అతని కెలాంటి సంకల్పములు ఉండవు.(6/4)

**మనుజుడు యోగారూఢుడగుటకు ఏమి చేయవలెను?**

మానవుడు స్వయంగా తనకు తానే ఉద్ధరించుకొనవలెను. అతడు తనకు తానే మిత్రుడు, తనకు తానే శత్రువు. కావున తన్ను తానే అధోగతి పాలు చేసికొనరాదు! (6/5)

**తనకుతానే మిత్రుడు, శత్రువు ఎట్లగును?**

స్వయంగా తనను తాను జయించిన వాడే తనకు తానుగా మిత్రుడు అగును. తనను తాను జయించలేని వాడు తనకే తాను శత్రువు కాగలడు! (6/6)

**తనకు తానే మిత్రుడగుటచే ఏమగును?**

అతడు ప్రారబ్ధానుసారముగా లభించెడు అనుకూల - ప్రతికూలము లందు, ప్రస్తుతము చేయు కర్మల సఫలమునందు, విఫలమునందు, పరులచే జరిగెడు మానావమానములందు ప్రసన్నముగా నుండును. కావున అతనికి పరమాత్మ ప్రాప్తి కలుగును. (6/7)

**ప్రభూ! పరమాత్ముడు ప్రాప్తించిన పురుషుని లక్షణములేవి?**

అతని అంతఃకరణము సదా జ్ఞాన విజ్ఞానములతో తృప్తి గలిగియుండును. అతనికి యింద్రియములు వశమైయుండును. అతడు అన్ని పరిస్థితులందు నిర్వికారుడై యుండును. మట్టి, రాయి, బంగారములయందు సమబుద్ధి కలిగియుండును. కేవలము పదార్థములందేగాక, సుహృదుడు, మిత్రుడు, శత్రువు, ఉదాసీనుడు, మధ్యస్థుడు, ద్వేషి, బంధువు, సాధువు, పాపి, మున్నగు వ్యక్తులలో కూడా అతడు సమబుద్ధిని కలిగియుండును. ఇట్టి సమబుద్ధిని గలిగినవాడు మిక్కిలి శ్రేష్ఠుడు. (6/8,9)

**ఇట్టి సమబుద్ధి, కర్మ యోగముతో మాత్రమే కలుగునా? లేక వేరే ఇతరమైన సాధనముతో కూడా సంభవమా?**

ఈ సమబుద్ధి ధ్యానయోగముతో కూడా కలుగుతుంది. కావున నేను ఈ ధ్యాన యోగ విధానమును తెలిపెదను. ధ్యానయోగి పరిగ్రహమును త్యజించి కామనారహితుడై (కోరికలు లేనివాడై) ఏకాంత స్థానమునందు ఒంటరిగా నున్నవాడై తన మనస్సును పరమాత్మయందు నిలుపవలెను. (6/10)

**పరమాత్మయందు మనస్సును నిలుపుటకు అనగా ధ్యానము చేయుటకు కావలసిన దేమిటి?**

శుద్ధమగు పవిత్రమైన స్థలమందు యోగి తన ఆసనమును దర్భలతో, మృగచర్మముతో, పవిత్ర వస్త్రముతో యుక్తముగా నుండునట్లు సిద్ధపరచుకొని, ఎక్కువ ఎత్తైనదిగా గాని, ఎక్కువ క్రిందుగా గాని ఉండకుండా సమానముగా నుండునట్లు చూచుకొనవలెను. (6/11)

**ఆసన మేర్పరచుకొని ఏమి చేయవలెను?**

ఆ యాసనముపై కూర్చుండి మనస్సు, యింద్రియముల చేష్టలను వశపరచుకొని అంతఃకరణ శుద్ధికై ధ్యానయోగమును అభ్యసింపవలెను. (6/12)

**ఆసనముపై కూర్చుండు టెట్లు?**

శరీరమును, కంఠమును (మెదడు), శిరస్సును నిటారుగా, సమంగా, కదలకుండా నిలిపి, అటునిటు చూడకుండా కేవలము నాసికాగ్రభాగమునే చూచుచూ స్థిరముగా కూర్చుండవలెను. (6/13)

**ఆసనముపైన ఏ భావముతో కూర్చుండవలెను?**

భయరహితము, ప్రశాంతమగు అంతఃకరణము గలిగిన యోగి బ్రహ్మ చర్య వ్రతము ననుష్ఠింపుచు మనస్సును ప్రాపంచిక విషయములనుండి తొలగించి నాయందే చిత్తము నిలిపి, నా పరాయణుడై కూర్చుండవలెను. (6/14)

**దీనివలన ఫలితమేమి?**

ఈ విధంగా ధ్యాన యోగమును అభ్యసింపుచు, మనస్సును వశపరచుకొనిన యోగికి నాలో నుండెడి పరమానందానికి పరాకాష్ఠ రూపమైనట్టి శాంతి లభించును. (6/15)

**పైన చెప్పబడిన ప్రకారంగా ధ్యానము చేయువారెందరో నుండెదరు. అయితే వారందరికి ధ్యానయోగము ఏల సిద్ధించుట లేదు? అందులో గల బాధ ఏమిటి?**

అతిగా భుజించువాడికి, బొత్తిగా తిననివానికి అంతేగాక, అధికంగా నిద్రించెడువానికి, పూర్తిగా నిద్రించకుండా వుండెడువానికి ఈ యోగము సిద్ధింపదు. (6/16)

**అయినచో ఈ యోగ మెవనికి సిద్ధింపగలదు?**

యథోచితముగా ఆహార విహారాదులు గావించువానికి, కర్మలలో తగిన విధముగా ప్రవర్తించెడు వానికి, ఉచితరీతిగా నిద్రాజాగ్రుతులు అలవరచుకొన్న వానికి వాటి ద్వారా దుఃఖము నశింపచేయు ఈ యోగము సిద్ధించును. (6/17)

**దుఃఖములను నశింపజేయునట్టి ఈ యోగము ఎప్పుడు సిద్ధించును?**

వశపరచుకొనబడిన చిత్తము (మనసు) స్వస్వరూపమునందే నిలచియుండి నప్పుడు, స్వయంగా సంపూర్ణమగు పదార్థములనుండి విముఖమగుచున్నప్పుడు అనగా తనకు ఏ పదార్థము లేశమాత్రముకూడా అవసరము లేదని భావించినప్పుడే, అతడు యోగియని పిలువబడును. అనగా అప్పుడాతనికి యోగము సిద్ధించును. (6/18)

**యోగికి స్వాధీనమైన చిత్తస్థితి ఎట్లుండును?**

గాలిలేని ప్రదేశమునందుండెడి దీపము ఏ విధముగా చలింపక యుండునో, అలాంటి స్థితియే యోగి యొక్క స్థిర చిత్తమునకు ఉండును. (6/19)

**చిత్తమునకు ఇటువంటి స్థితి కలిగిన మీదట ఏమగును?**

యోగాభ్యాసమువలన నిరోధింపబడిన చిత్తము ఉపరతిని పొందును. అప్పుడు యోగి తనను తాను స్వయంగా తనలోనే దర్శించుచూ, తనలో తాను సంతుష్టుడై పోవును. (6/20)

**ఇలాంటి యోగి కేమి లభించును?**

సాత్త్విక, రాజస, తామస సుఖములతో విలక్షణమైన ఆత్యంతిక సుఖము లభించును. తిరిగి అతడు స్వస్వరూపమునుండి ఎప్పుడు కూడా విచలితుడు కానేరడు. (6/21)

**అతడు ఏ కారణంగా విచలితుడు కానేరడు?**

అతడు నిలిచియున్న స్థితిలో సుఖమునకు కొదువ యుండనే యుండదు. కనుక దుఃఖము అచటికి చేరుకొనజాలదు. అందువలన అతడు చలింపక యుండును. (విచలితుడు కానేరడు) (6/22)

**ఇట్టి సుఖమును పొందుటకై ఏమి చేయవలెను?**

దుఃఖముల సంయోగము యొక్క వియోగమునే యోగమందురు. అట్టి యోగమును విసుగు జెందని ధైర్యోత్సాహములతో కూడిన చిత్తముతో పొందవలయును. (6/23)

**స్వస్వరూప ధ్యానముతో ప్రాప్తించెడు యోగము (సాధ్యరూపమగు సమతాస్థితి) పొందుటకై మరింకేదేని ఉపాయము గలదా?**

• ఔను, కలదు! అదే నిర్గుణ - నిరాకార ధ్యానము. సంకల్పంవలన ప్రభవించెడు సకల కోరికలను త్యజించి, మనస్సు ద్వారా యింద్రియ సముదాయమును వశపరచుకొని, క్రమ క్రమముగా సంసారము నుండి విరక్తి పొందనగును. సర్వత్రా పరిపూర్ణమైన పరమాత్మ యందు స్థితుడై ఆవంతయును చింతింపకూడదు. (6/24,25)

**ఒకవేళ చింతించినచో!**

అభ్యాసము చేయవలెను. అనగా మనస్సు ఎచ్చటెచ్చట (మనస్సు) తిరుగాడుచుండునో, అచ్చచ్చటి నుండి దానిని తొలగించి పరమాత్మయందే నిలుపవలెను. (6/26)

**ఇటుల జేసినచో ఏమగును?**

రజోగుణ వృత్తి తొలగిపోయి, ప్రశాంత మనస్సు గలిగి దోషరహితుడై బ్రహ్మ భూతుడైన (బ్రహ్మతో ఏకత్వము పొందినట్టి) యోగికి ఉత్తమమైన (సాత్త్వికి) సుఖము లభించును. (6/27)

**అటు పిమ్మట నేమగును?**

పాపరహితుడగు ఆ యోగికి సుఖపూర్వకముగ పరబ్రహ్మ స్వరూపమగు అవధులులేని సుఖము లభించును. (6/28)

**ఇక్కడ (ఇరువది ఎనిమిదవ శ్లోకం) వరకు మీరు మూడు విధములుగా ధ్యాన మొనర్చెడు వారిని గూర్చి వర్ణించినారు. అయితే వారు ప్రపంచమును ఏ దృష్టితో చూచెదరో, దానిని వర్ణింపలేదు. స్వస్వరూపమును గూర్చి ధ్యానమొనర్చెడువారు ప్రపంచమును ఏ దృష్టితో చూచెదరు అను సంగతిని గూర్చి అడుగుచున్నాను?**

అతడు సకల ప్రాణులలో తనను - తన ఆత్మ స్వరూపమును, సకల ప్రాణులను తన ఆత్మలోనే చూచును. అందుచేత అతడు సమదర్శియగును. (6/29)

**నీ సగుణ స్వరూపమును ధ్యానించునతడు ఈ ప్రపంచమును ఏ దృష్టితో చూచును?**

అతడు అందరిలో నన్ను గాంచును. అటులే అందరిని నాలో చూచును. కావున అతని ముందు నేను అదృశ్యుడనుగాను, అతడు నా ముందు అదృశ్యుడు కానేరడు. (6/30)

**మీరును మరియు ఆ యోగి ఇరువురును పరస్పరముగా అదృశ్యము గాకుండా ఏల ఉండెదరు?**

అతడు సకల ప్రాణులలో నున్న నాతో ఏకమై నన్ను భజించును. అందువలన అతడు నిత్య నిరంతరము నాలోనే యుండును. ఇక మేము ఇరువురము, ఒకరికొకరము అదృశ్యమై ఎట్లుండగలము? ఉండలేము. (6/31)

**నిర్గుణ నిరాకారమును ధ్యానించువాడు, ఈ ప్రపంచము నెట్లు చూచును?**

అజ్ఞాని యగు పురుషుడు తన శరీర అవయవములందు, తన సుఖ - దుఃఖములందు తనను ఏ విధంగా ఏకరూపముగ జూచునో, అట్లే అతడు ఇతరుల సుఖదుఃఖములను తన సుఖదుఃఖములుగా భావించును. అందుచేత ఆ యోగి సర్వశ్రేష్ఠుడుగా నెంచబడును. (6/32)

అర్జునుడి ట్లనెను - ఇప్పటివరకు మీరు సమతా ప్రాప్తికి సాధనమైన ధ్యానయోగమును గూర్చి వర్ణించినారు. కాని నేనైతే మనస్సు చంచలమైనందున ఆ ధ్యాన యోగంలో స్థిరస్థితిని గాంచలేకున్నాను. ఏలయన, మనస్సు కడు చంచలమైనది. కలత బెట్టునది. బలమైనది. మొండితనము గలది. కనుక దానిని విగ్రహించుట వాయువువలె కఠినమైనదని నేను తలంచుచున్నాను. **(6/33,34)**

భగవానుడిట్లనెను - చాలా చక్కనిమాట, సత్యమైన మాట. మనస్సు

అటువంటిదే కాని, అభ్యాస వైరాగ్యముల చేత అది నిగ్రహింపబడును. అర్జునా! అందుచేత మనస్సు, యింద్రియములు వశముగాని వానికి, ధ్యానయోగము ప్రాప్తించుట కఠినము. అట్లే మనస్సు, యింద్రియములు వశమునందు గలవాని ద్వారా ధ్యానయోగము పొందబడును. (6/35,36)

అర్జును డిట్లనెను - ఓ మధుసూదనా! ఓ మహాబాహూ! సాధనయందు శ్రద్ధ గలిగి, శిథిల ప్రయత్నము గల సాధకుడు అంత్యకాలము నందు సాధన నుండి తొలగిపోయినచో ఆ సాధకుడు ఎలాంటి గతిని పొందును? ప్రాపంచిక విషయములకు ఆశయ రహితుడు, పరమాత్మ ప్రాప్తి మార్గము నందు మోహితుడైన సాధకుడు చెదిరి, ముక్కలైన మేఘమువలె ఉభయ భ్రష్టుడై నశించి పోజాలడు గదా? ఓ కృష్ణా! ఇదే నా సంశయము. నా ఈ సందేహమును మీరే నివారింపగలరు. దీనిని మీరు తప్ప మరెవరునూ నివారింపజాలరు. (6/37-39)

భగవానుడిట్లనెను - పార్థా! అతడు ఈ లోకమునగాని, పరలోకమునగాని పతన మొందడు. ప్రియతమా! కళ్యాణ కారకమైన కర్మ నాచరించువాడు ఎవడైనా సరే! దుర్గతిని పొందనేరడు. (6/40)

అతడు దుర్గతి నొందడు. అయితే ఎచటికి వెళ్ళును?

కొంత సాంసారిక సుఖేచ్ఛను కలిగియున్న యోగభ్రష్టుడగు సాధకుడు పుణ్యకర్మల నాచరించెడు వారి లోకములకు వెళ్ళి, అచట అనేక సంవత్సరాలు నివసించి, తిరిగి మృత్యు (మర్త్య) లోకమునందలి పవిత్రాచరణముగల శ్రీమంతుల ఇంట జన్మించును. మరియు సాంసారిక సుఖేచ్ఛ లేకుండా అంత్యకాలములో ఏ కారణం చేతనైనా యోగభ్రష్టుడైన సాధకుడు, నేరుగా (స్వర్గాదిలోకములకు వెళ్ళకుండా) తత్త్వజ్ఞులగు యోగుల వంశములో జన్మించును. అయితే ఇటువంటి జన్మ కలుగుట ఈ లోకంలో మిక్కిలి దుర్లభమైనది. (6/41,42)

తత్త్వజ్ఞులగు యోగుల వంశంలో జన్మించిన మీదట నేమగును?

కురునందనా! అక్కడ అతనికి పూర్వజన్మలో చేయబడిన సాధన - సామగ్రి అనాయాసముగనే లభించును. తిరిగి అతడు దానిని సిద్ధింప చేసికొనుటకై తత్పరతతో ఇతోధికముగా ప్రయత్నము చేయును. (6/43)

**యోగుల వంశంలో జన్మించిన వారల సంగతిని తెలిపినావు, ఇక శ్రీమంతుల ఇంట జన్మించినవారి సంగతేమిటి?**

భోగములపట్ల పరవశుడగుతూ కూడా అట్టి యోగభ్రష్టుడు పూర్వాభ్యాస కారణంగా పరమాత్మ ప్రాప్తమగుమార్గంవైపు ఆకర్షితుడగును.

**అతడట్లు సాధనవైపు ఆకర్షితుడగుటకు గల పూర్వాభ్యాస శక్తి ఏమిటి?**

యోగజిజ్ఞాసువే వేదోక్త సకామ కర్మలను అతిక్రమించగల్గినపుడు, యోగమునందు లగ్నమై యోగభ్రష్టుడైన సాధకుని గూర్చి చెప్పవలసిన దేమున్నది? (6/44)

**పరమాత్మవైపు ఆకర్షితుడగుటచే నేమగును?**

అతిశీఘ్రముగా అతడు సాధనయందు మునిగిపోవును. తద్వారా సకల పాపములనుండి ముక్తుడై, అనేక జన్మల ద్వారా సిద్ధుడైన ఆ సాధకుడు పరమగతి యగు పరమాత్మను పొందును. (6/45)

**పరమగతిని పొందిన యోగి గొప్పతనమేమి?**

అర్జునా! ఆ యోగి సకామ తపస్సంపన్నులకంటెను, జ్ఞానులకంటెను, కర్మ నిష్ఠులకంటెను గూడా శ్రేష్ఠుడు. కావున నీవు కూడా యోగివి గమ్మ. (6/46)

**యోగులలో శ్రేష్ఠుడైన వాడు ఎవరు?**

కుంతీపుత్రా! నాయందే అంతఃకరణమును లగ్నమొనర్చి నన్ను శ్రద్ధా భక్తులతో భజించునట్టి వాడు యోగులందరిలోకెల్ల శ్రేష్ఠుడు. (6/47)

'ఆత్మసంయమయోగము' అనెడు
ఆఱవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# ఏడవ అధ్యాయము - జ్ఞానవిజ్ఞానయోగము

శ్రీ భగవాన్ ఉవాచ

మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్ మదాశ్రయః ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ।1।

జ్ఞానం తేఽహం సవిజ్ఞానమ్ ఇదం వక్ష్యామ్యశేషతః ।
యద్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే ।2।

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ।3।

భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ।4।

అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ।5।

ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా ।6।

మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ।7।

రసోఽహమప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః ।
ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ।8।

పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ।9।

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్ ।10।

బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ।11।

యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే ।
మత్త ఏవేతి తాన్ విద్ధి న త్వహం తేషు తే మయి ।12।

త్రిభిర్గుణమయైర్భావైః ఏభిః సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ।13।

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ।14।

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః ।
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ।15।

చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ।16।

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమ్ అహం స చ మమ ప్రియః ।17।

ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।
ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ।18।

బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।
వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః ।19।

కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః ।
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా ।20।

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ।21।

స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధనమీహతే ।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ ।22।

అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ।
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి ॥ 23 ॥

అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః ।
పరం భావమజానంతో మమావ్యయమనుత్తమమ్ ॥ 24 ॥

నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥ 25 ॥

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ 26 ॥

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప ॥ 27 ॥

యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః ॥ 28 ॥

జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమ్ అధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥ 29 ॥

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః ॥ 30 ॥

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానవిజ్ఞాన యోగో నామ సప్తమోఽధ్యాయః ॥ 7 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# ఏడవ అధ్యాయము - జ్ఞానవిజ్ఞానయోగము

**కృష్ణా! నీవు తెల్పిన సర్వశ్రేష్ఠుడగుయోగిని నేను కాగలనా?**

అవశ్యము కాగలవు.

**ఎట్లు?**

భగవానుడిట్లనెను - పార్థా! నా యందే చిత్తమునుంచి, నన్నే ఆశ్రయించి, నన్నే భజింపుచూ నీవు నిస్సందేహముగా నా సమగ్రరూపమును తెలియగలవు. ఈ విషయంలో నీవు నా మాటను వినుము. నేను నీకు విజ్ఞానముతో కూడిన జ్ఞానమును సంపూర్ణంగా చెప్పెదను. దీనిని తెలియుటవలన నా సమగ్రరూప జ్ఞానము కల్గును. నీకు మనుష్యలోకం (ప్రపంచం)లో తెలియవలసినది మరేదీ మిగిలియుండదు. (7/1,2)

**అదే నిజమైతే మీ సమగ్రరూపము నందరూ ఎందుకు తెలిసికొనరు?**

ఇలాంటి సహజ ప్రవృత్తి చాలా తక్కువమందిలో వుంటుంది. వేలాది మనుష్యులలో ఏ ఒక్కడు మాత్రమే తన శ్రేయస్సును గూర్చి యత్నించును. అట్లు ప్రయత్నించు సిద్ధులలో కూడా ఏ ఒక్కడో నా సమగ్రరూపమును తాత్త్వికంగా తెలిసికొనును. (7/3)

**మీ సమగ్రరూపమెట్టిది? దాని మూలకారణ మెవరు?**

నా అపరా(జడ) ప్రకృతి భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అను నీ ఎనిమిది విధములుగ విభజింపబడినది. దీనికంటే పూర్తిగా భిన్నమైన జీవరూపమగు నా పరా (చేతన) ప్రకృతి గలదు. అది (అహంకార-మమకారముల జేసి) జగత్తును ధరించియున్నది. ఈ అపరా, పరా ప్రకృతుల ద్వారానే సకల ప్రాణులు ఉత్పన్నమగుచున్నవి.

వాస్తవమునకు సంపూర్ణ జగత్తునకు మూలకారణము నేనే, ఏలనన, నా నుండే జగత్తు ఉద్భవించినది. నాలోనే లయ మొందుచున్నది. అందుచేత నేను, నేనే అయియున్నాను. ఓ ధనంజయా! నా కన్న వేరొండు కారణము

ఏదియూ లేదు. దారముతో గ్రుచ్చబడిన మాలయందు గల మణులలో దారము నందు అంతటా దారమే యున్నట్లు ఈ జగత్తునందంతటా నేనే ఓతప్రోతమై యున్నాడను. (7/4-7)

**ప్రపంచంలో తమరు ఏ రూపాలలో నిండియున్నారు ప్రభూ?**

కుంతీపుత్రా! జలములోని రసమును నేను. సూర్యచంద్రుల వెలుగును నేను. సకల వేదములలో ఓంకారమును నేను. ఆకాశంలో శబ్దమును, మనుష్యులలో పురుషార్థమును, పృథ్విలో పవిత్ర గంధమును, అగ్నియందు తేజస్సును, సర్వప్రాణుల జీవనమును (చేతనాశక్తిని), తాపసుల యందలి తపస్సును నేను. పార్థా! సకల ప్రాణులలో అనాదియైన బీజమును నేను. బుద్ధిమంతులలోని బుద్ధిని, తేజోవంతులగు పురుషుల తేజస్సు (ప్రభావము)ను నేనే. బలవంతులగు వారిలో ఆసక్తి, కోరిక (కామ-రాగము)లు లేనట్టి శుద్ధమగు బలమును నేను. మనుజులలో❖ ధర్మయుక్తమగు కామమును నేను. ఇంకను ఏమని చెప్పను? సాత్త్విక, రాజస, తామస భావములెన్నెన్ని గలవో, అవన్నియునూ నావల్లనే కలుగును. కాని అవి నా యందుగాని, నేను వానియందుగాని లేను. అనగా వాని నుండి నేను పూర్తిగా నిర్లిప్తంగా, అతీతంగా ఉన్నాను. (7/8-12)

**ఒకవేళ ఇలాంటి మాటే వున్నట్లయితే అందరూ తమరిని ఈ విధంగా ఎందుకు తెలిసికొనరు?**

వారలు కేవలము త్రివిధ గుణముల వలన మోహితులగుచున్నారు. అనగా ఈ జగత్తునందు వారు పుట్టుచూ - గిట్టుచూ యుండెదరు. పుట్టు - చావులకే పరిమితమయ్యెదరు. అందుచేత త్రిగుణములకు అతీతుడను, అవినాశిని యగునన్ను తెలియజాలరు. (7/13)

**అయినచో నిన్ను ఎవరు ఎరుగుదురు?**

నా ఈ త్రిగుణాత్మకమైన మాయ కడు దుస్తరమైనది. ఈ మాయకు విముఖులై ఎవరైతే నన్ను మాత్రమే శరణు కోరెదరో, వారే ఈ మాయను

❖ ధర్మనిర్ణయము మనుష్యుల కొరకే గాని, మనుష్యేతర ప్రాణులయందు ధర్మ విధానము శాసింపబడదు.

దాటి పోయెదరు. అనగా నా కృప వలన మాయను తరించి నన్ను తెలిసికొనెదరు. (7/14)

**ఇది నిజమైతే అందరూ నీ శరణు కోరుట లేదెందుకు?**

ఆసుర భావము నాశ్రయించిన మూఢ జనులు, మాయచేత జ్ఞానము కప్పబడినవారగు నీచ మానవులు, దుష్టులయిన వారలు నా శరణు గోరరు. (7/15)

**అట్లయిన నీ శరణు కోరువారెవరు ప్రభూ?**

భరతవంశ శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసువులు, జ్ఞానులు (ప్రేమభక్తులు) ఈ నాలుగు విధములైన ఉత్తమకర్మలొనర్చు భక్తులు నన్ను భజించెదరు. అనగా నా శరణు గోరెదరు. (7/16)

**ఈ నలుగురిలో శ్రేష్ఠుడు ఎవరు?**

అనన్య ప్రేమభక్తి కలిగియున్న జ్ఞాని శ్రేష్ఠుడు. ఎందుకనగా? అతడు కేవలము నాయందే చరించును. అందుచేత నేను అతనికి, అతడు నాకు అత్యంత ప్రియుడు. (7/17)

**ఇతర భక్తులెవరూ శ్రేష్ఠులు కారా?**

వారందరును ఉదారులే. శ్రేష్ఠులే. (7/18)

**జ్ఞాన (ప్రేమ) భక్తునకు ఇంతటి గొప్పతనమేల?**

అనేక జన్మల అంతిమమగు మనుష్య జన్మను పొంది నా శరణుగోరి సర్వము వాసుదేవుడే యని యిట్లు అనుభవింపగల మహాత్ములు ఈ ప్రపంచంలో మిక్కిలి దుర్లభము కదా! (7/19)

**అందరు ఇటువంటి ప్రేమ భక్తులు కాకపోవుటలో గల కారణమేమిటి?**

రకరకములైన కోరికల కారణంగా 'సర్వస్వము వాసుదేవమయ' మనెడు జ్ఞానము కప్పివేయబడినట్టి మనుష్యులు తమ స్వభావముచేత నియంత్రింపబడినవారై నా శరణు కోరక (నన్ను వదిలి) ఇతర దేవతల శరణు జొచ్చెదరు అనగా ఆ దేవతలను ఉపాసించుటలో నిమగ్నమయ్యెదరు. (7/20)

**వారిని నీవు నీవైపు ఏల ఆకర్షించకుందువు?**

మనుష్యుల కివ్వబడిన స్వేచ్ఛను (స్వతంత్రమును) నేను లాగుకొనను. అంతేగాక, ఏ మనుష్యుడు ఏ ఏ దేవతను శ్రద్ధాపూర్వకంగా పూజించునో, ఆ యా దేవతలపట్ల నేను అతని శ్రద్ధను దృఢముగా జేసెదను. అతడునూ అదే శ్రద్ధాయుక్తుడై ఆ దేవతలను సకామభావముతో ఆరాధించును.

కాని వారికి ఆ ఉపాసన ద్వారా ఏ ఫలము లభించునో, అది నా ద్వారా నిర్ణయింపబడినదే లభింపగలదు! అయితే సకామ భావయుక్తంగా దేవతల నారాధించు కారణంగా ఆ అల్పబుద్ధులకు అంతముగల అనిత్యమైన ఫలమే లభించును. వారికి నా ప్రాప్తి లభింపదు. వారలు ఎక్కువ కెక్కువగా దేవతల పునరావర్తి లోకములకు వెళ్లవచ్చును. కాని, నా భక్తులు మాత్రము నన్నే చేరుకొందురు. (7/21,22,23)

**నీ భక్తులకు నీవు ప్రాప్తించినపుడు, అందరూ నీ భక్తులే కావలెను కదా?**

మిత్రమా! వారు నా యొక్క అవినాశి (శాశ్వితత్త్వ) భావమును గుర్తించకుండా నన్ను సాధారణ మనిషిగానే భావించుచున్నారు. కనుక వారు నా భక్తులుగా ఎట్లు కాగలరు? (7/24)

**వారలు నీ పరమ భావమును గుర్తించరు సరే; వారి యందు దయతో నీవే నీ నిజ రూపముతో ప్రత్యక్షము ఏలకావు?**

ఆ మూఢ జనులు నన్ను జన్మలేని వానిగా, అవినాశిగా సమ్మతించనపుడు నేను కూడా యోగమాయతో ఆచ్ఛాదింపబడి అడ్డు తెరతో దాగి యుండెదను. కనుక వారి ముందు నిజస్వరూపముతో ప్రత్యక్షము గాను. (7/25)

**ఆ యోగమాయ యొక్క అడ్డు తెర మీ ముందు కూడా ఉండవచ్చును గదా?**

లేదు. అర్జునా! భూత, భవిష్యద్వర్తమానములందు కలుగు సంపూర్ణ ప్రాణులను గూర్చి నేనెరుగుదును. కాని, మాయా మోహితులగు జీవులు నన్ను మాత్రము తెలిసికొనజాలరు. (7/26)

**నిన్ను తెలియక పోవుటలోగల ముఖ్య కారణమేముండును?**

ఓ పరంతపా! ఇచ్ఛా, ద్వేషముల నుండి ఉత్పన్నమైనవి ద్వంద్వ మోహములు. ఈ ద్వంద్వమోహముల వల్లనే మనుష్యులు జగత్తులో జన్మమరణముల నొందుచుండెదరు.

**అయితే అందరూ ద్వంద్వ మోహములతో మోహితులయ్యెదరా?**

లేదు. పుణ్య కర్ములగు ఏ మనుష్యుల పాపము నశించి పోయినదో, అట్టి వారలు ద్వంద్వమోహ రహితులయ్యెదరు. మరియు దృఢవ్రతులై నా భక్తిలో లీనమయ్యెదరు. (7/28)

**దృఢవ్రతులై (నీ భజన యందు లీనమగు) నీ భక్తిని గలిగి యుండుచో నేమగును?**

జరా - మరణముల నుండి ముక్తి నొందుటకై నన్ను మాత్రమే ఆశ్రయించి ప్రయత్నించెడు వారలు బ్రహ్మమును, అధ్యాత్మమును, సంపూర్ణ కర్మను తెలిసికొందురు. వారలు అధిభూత, అధిదైవ, అధియజ్ఞ సహితముగా నన్ను అనగా నా సమగ్ర స్వరూపమును (వాసుదేవః సర్వమ్ అని) తెలియుదురు. అంతేగాక, అంత్యకాలమున వారు నన్ను చేరుకొనెదరు. (7/29,30)

'జ్ఞానవిజ్ఞానయోగము' అనెడు
ఏడవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# ఎనిమిదవ అధ్యాయము-అక్షరబ్రహ్మయోగము

అర్జున ఉవాచ

కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।
అధిభూతం చ కిం ప్రోక్తమ్ అధిదైవం కిముచ్యతే ।1।

అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన ।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ।2।

శ్రీభగవాన్ ఉవాచ

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ।3।

అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర ।4।

అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేవరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ।5।

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేవరమ్ ।
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః ।6।

తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।
మయ్యర్పితమనోబుద్ధిః మామేవైష్యస్యసంశయమ్ ।7।

అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ।8।

కవిం పురాణమనుశాసితారమ్
అణోరణీయాంసమనుస్మరేద్యః ।
సర్వస్య ధాతారమచింత్యరూపమ్
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।9।

ప్రయాణకాలే మనసాచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్ ।10।

యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ।11।

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమ్ ఆస్థితో యోగధారణామ్ ।12।
ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ।13।
అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ।14।
మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ।15।
ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।
మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే ।16।
సహస్రయుగపర్యంతమ్ అహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః ।17।
అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవంత్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే ।18।
భూతగ్రామః స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే ।19।

పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్ సనాతనః ।
యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ।20।

అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః తమాహుః పరమాం గతిమ్ ।
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ ।21।

పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా ।
యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ।22।

యత్ర కాలే త్వనావృత్తిమ్ ఆవృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ ।23।

అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ।24।

ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే ।25।

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే ।
ఏకయా యాత్యనావృత్తిమ్ అన్యయావర్తతే పునః ।26।

నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మాత్ సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ।27।

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ ।28।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరబ్రహ్మయోగో నామ అష్టమోఽధ్యాయః ॥ 8 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# ఎనిమిదవ అధ్యాయము-అక్షరబ్రహ్మయోగము

**అర్జునుడిట్లనెను - ఓ పురుషోత్తమా! మీరు ఇప్పుడే మీ ఆశ్రిత జనుల ద్వారా తమ బ్రహ్మము, అధ్యాత్మము మొదలగు సమగ్ర రూపమును తెలియునట్టి సంగతి తెలిపితిరి. అయితే బ్రహ్మ మనగా నేమిటో తెలియగోరు చున్నాను?**

భగవానుడిట్లనెను - ఆ పరమ అక్షరమును అనగా నిర్గుణ నిరాకార పరమాత్మను బ్రహ్మమనెదరు.

**అధ్యాత్మమన నేమి?**

జీవుల ఉనికిని (స్థితిని) అధ్యాత్మమనెదరు.

**కర్మ ఏమిటి?**

సృష్ట్యాది యందు 'నేనొక్కడినే అనేక రూపములనగుదునుగాక' యనెడు నా సంకల్ప రూప త్యాగమే కర్మ (ఆదికర్మ) యనబడును.

**భగవన్! అధిభూతమను పేరుతో ఏమి చెప్పబడినది?**

అర్జునా! నశించునట్టి పదార్థములు అన్నియు అధిభూతములు.

**అధిదైవమని దేనిని అందురు?**

సృష్టి ప్రారంభములో తొలుదొల్తగా అవతరించెడు హిరణ్యగర్భ బ్రహ్మయే అధిదైవము.

**ఈ దేహమునందు అధియజ్ఞుడు ఎవరు?**

ఈ మనుష్య శరీరమునందు అంతర్యామి రూపమున నేనే అధి యజ్ఞుడనై యున్నాను.

**భగవన్! అంత్యకాలమున మీరు ఎట్లు గుర్తుకు రాగలరు?**

అంత్యకాలమున నన్ను స్మరించుచు శరీరమును విడుచువాడు నన్నే పొందుచున్నాడు. అర్జునా! ఇందులో సందేహం లేదు. **(8/1-5)**

అంత్యకాలములో నిన్ను స్మరించినచో నిన్ను పొందవచ్చును. కాని నిన్ను స్మరించనిచో?

కుంతీపుత్రా! ఈ మానవుడు అంతిమ సమయంలో ఏ యే భావమును స్మరిస్తూ దేహత్యాగము జేయునో, అతడా భావముతో ఎల్లవేళల ప్రభావితుడగుతూ, అట్టి భావమునే పొందుచున్నాడు. (8/6)

**అటులయినచో, అంత్యకాలమునందు నీ స్మృతి ఉండుటకై ఏమి చేయాలి?**

నీవు, నీ మనోబుద్ధులను నా యందే అర్పించి సర్వకాల, సర్వావస్థల యందు నన్నే స్మరించుచూ (సర్వవేళల) కర్తవ్య కర్మలను కూడా ఆచరించుము.

**దీనితో నేమగును?**

నీవు నన్నే పొందగలవు. (8/7)

**ఏ స్వరూపముతో నిన్ను చింతించాలి, ప్రభూ?**

సగుణ నిరాకారము, నిర్గుణ నిరాకారము, సగుణ సాకారము లని త్రివిధ స్వరూపములు. వీనిలో ముందుగా నేను సగుణ నిరాకారమును చింతించు విధానమును తెలిపెదను. పార్థా! సావధానముగా వినుము. అభ్యాస యోగయుక్తుడై అనన్య చిత్తముతో, పరమ పురుషుని (నాయొక్క సగుణ నిరాకార స్వరూపమును) చింతనము చేయుచు ఎవడు తన శరీరమును విడిచి వెళ్ళునో, అతడు నా యొక్క ఆ స్వరూపమునే పొందును. (8/8)

**ఆ స్వరూపము ఎట్లున్నది, కృష్ణా?**

అతడు సర్వజ్ఞుడు, సర్వమునకు ఆదియైనవాడు (అనాది) సమస్తమును శాసించువాడు, సూక్ష్మాతి సూక్ష్ముడు, సకలమును ధారణ పోషణ చేయువాడు. అచింత్య స్వరూపుడు, అజ్ఞానాంధకార రహితుడు. సూర్యునివలె ప్రకాశ స్వరూపుడు. ఇట్టి స్వరూపమును చింతించునట్టి భక్తియుక్తుడగు పురుషుడు అంత్యకాలమున యోగబలము చేత నిశ్చలమైన మనస్సుతో తన ప్రాణములను భృకుటి మధ్యన చక్కగా నిలిపి, శరీరమును త్యజించి ఆ పరమ దివ్య పురుషుని చేరుకొనును. (8/9-10)

నేను మీ సగుణ నిరాకారమును చింతించువిధమును విన్నాను, ఇక నిర్గుణ - నిరాకారమును చింతించుటెట్లు?

వేదవేద్యులగు వారలు దేనిని అక్షరమని యందురో, రాగరహితులగు యతులు (సన్న్యాసులు) దేనిని పొందెదరో, దేనిని పొందుటకై బ్రహ్మచారులు బ్రహ్మచర్యమును పాటించెదరో, అట్టి పదమును పొందు సంగతిని సంక్షిప్తముగ చెప్పెదను. ఏ సాధకుడు అంత్యకాలమున సర్వేంద్రియములను నిగ్రహించి మనస్సును హృదయమందు స్థాపించి, ప్రాణములను మస్తిష్కమునందు ధరించి, 'ఓం' అను ఏకాక్షర బ్రహ్మనుచ్చరించుచు, నా నిర్గుణ నిరాకార స్వరూపమును చింతించుచు దేహమును వదిలివేయునో, అట్టి సాధకుడు పరమగతిని చేరుకొనును. **(8/11,12,13)**

**నిరాకారమును చింతించు రీతిని నేను విన్నాను, ఇక సగుణ సాకారమును చింతించువారందరికి మీరెట్లు సులభసాధ్యులు?**

పార్థా! ఏ మనుష్యుడు అనన్య చిత్తుడై నిత్యనిరంతరము నన్నే చింతించుచు, ఎల్లప్పుడు నాలో నిమగ్నుడై యుండునో, అతడే యోగి. ఆ యోగికి నేను సులభుడను అనగా అతనికి నేను సులభముగనే లభ్యము కాగలను. **(8/14)**

**భగవాన్! నీ ప్రాప్తివలన ఏమగును?**

ఏ మహాత్ములు నా పరమప్రేమను పొంది, తద్ద్వారా నన్ను పొందుచున్నారో, అట్టివారలు (ప్రతిక్షణము నశించునట్టి) క్షణభంగురమైన దుఃఖములకు నిలయమగు పునర్జన్మను పొందజాలరు. **(8/15)**

**అయితే పునర్జన్మ ఎవరికి కలుగును?**

అర్జునా! బ్రహ్మలోక పర్యంతము గల లోకములన్నీ కూడా పునరావృత్తి గలవి. అందుచేత ఆ లోకములకు వెళ్ళిన మీదట మరల రావలసి వచ్చును. అనగా మళ్ళీ జన్మ నెత్తవలసియే యుంటుంది. కాని నన్ను చేరిన పిదప పునర్జన్మ అంటూ ఉండదు. **(8/16)**

**ఆ లోకములు పునరావర్తులెందుకగును?**

కాలావధికి లోబడినవగుటచే. (8/16)

**ఆ అవధి ఏమిటి ప్రభూ?**

వేయి చతుర్ యుగములు బ్రహ్మకు ఒక దినము. అట్లే వేయి చతుర్ యుగములు బ్రహ్మకు ఒక రాత్రి యగును. బ్రహ్మ పగలు (దినము) ప్రారంభమగుటతో అనగా నిద్రనుండి బ్రహ్మ జాగృతము కాగా బ్రహ్మ యొక్క సూక్ష్మ శరీరము నుండి ప్రాణులు ఉత్పన్నమగుచున్నవి. అటులే బ్రహ్మకు రాత్రి కాలారంభములో అనగా బ్రహ్మ నిద్రించిన మీదట బ్రహ్మయొక్క సూక్ష్మ శరీరము నందే సకల ప్రాణులు లయమగుచున్నవి. (8/17,18)

**అవి మాటిమాటికి ఎందుకు జనన మరణముల నొందుచున్నవి కృష్ణా?**

పూర్వసృష్టిలో నున్న ప్రాణి సముదాయమే తమ రాగద్వేష స్వభావమునకు లోబడి బ్రహ్మ పగటి కాలమున మాటిమాటికీ ఉత్పన్నమగును. మరల బ్రహ్మరాత్రి సమయమున అతనియందే లీనమగును. (8/19)

**ప్రభూ! అవ్యక్తము (బ్రహ్మయొక్క సూక్ష్మశరీరము)న కంటే కూడా శ్రేష్ఠమైనది, ఎప్పుడు కూడా నశించనటువంటిది వేరొకటి కలదా?**

అవును, అర్జునా! ఉన్నది. ఆ బ్రహ్మకన్నా శ్రేష్ఠమగు మరొక నిత్య నిరంతరము సనాతనమగు అవ్యక్తము ఏది కలదో, అది సకలము నశించిన మీదట గూడా తాను నశింపదు. దానినే అవ్యక్తము, అక్షరము, పరమగతి అని యందురు. అయ్యది పొందిన మీదట జీవులు తిరిగిరారు. అదియే నా పరమధామము (స్వరూపము) అని ఎరుగుము. (8/20,21)

**ఆ పరమధామమును పొందుటెట్లు?**

పార్థా! సంపూర్ణ జగత్తు ఎవని అంతర్గతమైయున్నదో, ఎవనిచేత ఈ జగమంతయు నిండియున్నదో, అట్టి పరమ పురుషుడు అనన్య భక్తితో లభ్యమగును. (8/22)

**అన్యమైన సంబంధముండక పోవుటచే, అన్యమైన సంబంధముండుటచే ఏమగును?**

ఇతరమగు సంబంధము లేకుండా యే మార్గము ద్వారా వెళ్లిన ప్రాణి తిరిగి రాకుండునో మరియు ఇతర సంబంధములు ఎరిగి ఏ మార్గముగుండా వెళ్ళిన ప్రాణి తిరిగి వచ్చునో, ఆ రెండు మార్గములను గూర్చి తెలిపెదను. (8/23)

**కేశవా! ఆ రెండు మార్గము లేవి?**

ఏ మార్గమున అగ్ని, దినము, శుక్లపక్షము, ఉత్తరాయణము యొక్క అభిమాన దేవతలుందురో, దేహమును వదలి ఆ మార్గము గుండా వెళ్ళునట్టి బ్రహ్మవేత్తలు తిరిగి రారు మరియు ఏ మార్గమున ధూమ, రాత్రి, కృష్ణపక్ష, దక్షిణాయన అభిమాన దేవతలుందురో, ఆ మార్గము ద్వారా పై లోకములకు వెళ్ళిన ప్రకృతికి లోబడిన జీవులు (అచటి సుఖములు అనుభవించి) మరల తిరిగి వచ్చెదరు. (8/24,25)

**ఈ రెండు మార్గములు ఎప్పటినుండి ప్రారంభమైనవి?**

జీవులకు చెందిన ఈ రెండు మార్గములు అనాదిగా నున్నవి. అందులో శుక్లమార్గము ద్వారా వెళ్ళినవారు తిరిగి రావలసిన పనిలేదు. కాగా కృష్ణమార్గము గుండా వెళ్ళినవారు తిరిగి రావలసియుండును. (8/26)

**భగవన్! తిరిగి రాకుండా నుండుటకై ఏమి చేయాలి?**

ఈ రెండు మార్గముల నెరిగిన ఏ యోగి కూడా జగత్తునందు మోహమునొందదు. కావున ఓ అర్జునా! నీవు యోగివి కమ్ము అనగా జగత్తునందు ఎల్లవేళల నిర్లిప్తముగా నుండుము. (8/27)

**ఓ కృష్ణా! యోగి యగుటతో ఏమగును?**

అర్జునా! వేదములు, యజ్ఞము, తపస్సు, దానములందు చెప్పబడిన పుణ్యఫలమును అధిగమించి యోగియైనవాడు ఆదిస్థానమును అనగా సనాతనమైన పరమ పదమును పొందుచున్నాడు. (8/28)

'అక్షరబ్రహ్మయోగము' అనెడు
ఎనిమిదవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# తొమ్మిదవ అధ్యాయము-రాజవిద్యా రాజగుహ్యాయోగము

శ్రీభగవాన్ ఉవాచ

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞానసహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ।1।

రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ।2।

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని ।3।

మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ।4।

న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్ ।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ।5।

యథాకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ ।6।

సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్ ।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ।7।

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః ।
భూతగ్రామమిమం కృత్స్నమ్ అవశం ప్రకృతేర్వశాత్ ।8।

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ ।
ఉదాసీనవదాసీనమ్ అసక్తం తేషు కర్మసు ।9।

మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే ।10।

అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్ ।11।

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ।12।

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః ।
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ ।13।

సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః ।
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ।14।

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ।15।

అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధమ్ ।
మంత్రోఽహమహమేవాజ్యమ్ అహమగ్నిరహం హుతమ్ ।16।

పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్రమోంకార ఋక్సామ యజురేవ చ ।17।

గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ।18।

తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున ।19।

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।
తే పుణ్యమాసాద్య సురేంద్రలోకమ్
అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్ ।20।

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే ।21।

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ।22।

యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః ।
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్ ।23।

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।
న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే ॥ 24 ॥

యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః ।
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్ ॥ 25 ॥

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృతమ్ అశ్నామి ప్రయతాత్మనః ॥ 26 ॥

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥ 27 ॥

శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి ॥ 28 ॥

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥ 29 ॥

అపి చేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥ 30 ॥

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌంతేయ ప్రతి జానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31 ॥

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః తేఽపి యాంతి పరాం గతిమ్ ॥ 32 ॥

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా ।
అనిత్యమసుఖం లోకమ్ ఇమం ప్రాప్య భజస్వ మామ్ ॥ 33 ॥

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవమ్ ఆత్మానం మత్పరాయణః ॥ 34 ॥

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యారాజగుహ్యయోగోనామ నవమోఽధ్యాయః ॥ 9 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# తొమ్మిదవ అధ్యాయము-రాజవిద్యా, రాజగుహ్యాయోగము

నేను మధ్యలో వేసిన ప్రశ్నలకు తాము చెప్పినమాటలు విన్నాను. ఇప్పుడు మధ్యలో నేను ప్రశ్నించక ముందే మీరేమి చెప్పదలంచితిరి భగవన్?

భగవానుడు చెప్పెను - నేను ముందుగా విజ్ఞాన సహితమగు జ్ఞానమును గూర్చి చెప్పుచుంటిని. మిక్కిలి గోపనీయమగు అదే విజ్ఞాన సహిత జ్ఞానమును దోషదృష్టి రహితుడవగు నీకు మరల చెప్పెదను. దీనిని తెలిసికొనిన నీవు అశుభ సంసారము నుండి ముక్తుడవు కాగలవు. (9/1)

ఆ విజ్ఞాన సహిత జ్ఞానము చాలా కఠినమైనదా?

కాదు! విజ్ఞాన సహితమగు ఈ జ్ఞానము విద్యలన్నింటికి రాజు, పరమగోప్యమైనది. పవిత్రమైనది. ఉత్తమమైనది. ధర్మమయమైనది. ప్రత్యక్ష ఫలముగలది. ఎన్నడూ నశింపనిది. ఆచరించుటకు చాలా సులువైనది. (9/2)

అలౌకికమైన యిట్టి విద్యను అందరూ ఎందుకు పొందలేరు?

మానవులు ఈ జ్ఞాన విజ్ఞాన రూపధర్మమునందు శ్రద్ధా విశ్వాసములను కలిగియుండరు. తద్వారా వారు నన్ను పొందజాలక మృత్యురూపమగు సంసార మార్గమునందు తిరిగి వచ్చెదరు. అనగా మాటి - మాటికి జననమరణముల నొందెదరు.

భగవన్! అట్టి జ్ఞాన విజ్ఞాన రూపమగు ధర్మవిద్య అనగానేమి?

నేను అవ్యక్తరూపముద్వారా సమస్త ప్రాణులయందున్నాను. సమస్త ప్రాణులు నాలో నున్నవి. అట్లే సమస్త ప్రాణులలో నేను లేను. ఆ ప్రాణులు నాలో లేవు. అనగా ప్రాణుల స్వతంత్ర అస్తిత్వమునంగీకరించినపుడు, నేను వాటిలో ఉందును. అవి నాలో ఉన్నవి. కాని ప్రాణులకు స్వతంత్రమైన ఉనికిని అంగీకరించనిచో, ప్రాణులలో నేను లేను. అవి నాలో లేవు. కాని అంతటా నేనే యున్నాను. (9/4)

అయితే ప్రభూ! ఈ జగత్తునకు ఉత్పాదకులు, ఆధారభూతులు ఎవరో ఉండాలి కదా?

అర్జునా! ఉన్నది నేనే. కాని నా స్వరూపము ప్రాణుల నుత్పన్నము చేయునదై, ధారణ గావించునదై, వాని పాలన - పోషణ గావించుతూ కూడా వాని యందు లేదు. వాని నుండి పూర్తిగా నిర్లిప్తమై యున్నది. ఇది నా ఈశ్వరీయ సంబంధమగు యోగశక్తి (సామర్థ్యము) చూడుము. తెలియుము. (9/5)

అయినచో ఆ ప్రాణులు నీయందెట్లున్నవి?

సర్వత్ర సంచరించెడు మహావాయువు ఎల్లప్పుడు ఆకాశమునందే ఎట్లు నిలచియున్నదో, అట్లే సకల ప్రాణులు నా యందే నిలచియున్నవని ఎరుగుము. (9/6)

అయితే ఆ ప్రాణులు (జీవులు) ముక్తి నొందుచుండవచ్చునుగదా?

కౌంతేయా! కాదు, ప్రకృతి సంబంధమును కలిగియుండెడి ఆ ప్రాణులు మహా ప్రళయము నందు నా ప్రకృతిని చేరుకొనుచున్నవి. మహా సృష్టి ప్రారంభంలో నేను మరల వానిని సృజించుచున్నాను. (9/7)

వానిని మీరు ఎంతవరకు సృజించుచుందురు?

అవి తమ ప్రకృతి (స్వభావమునకు)కి పరవశమై (లోబడి) యుండువరకు నేను నా ప్రకృతి (మాయ) నాశ్రయించి వానిని మరల - మరల ఉత్పన్నము చేయుచునే యుందును. (9/8)

మళ్ళీ - మళ్ళీ మీరు సృజించినప్పుడు వాని కర్మలతో మీకు సంబంధము యుండవచ్చును గదా ప్రభూ?

లేదు, ధనంజయా! నేను ఆ కర్మల యందు ఉదాసీనుని వలె పూర్తి నిర్లిప్తముగా అనాసక్తుడనై నుండెదను. కావున ఆ కర్మలు నన్ను బంధింపనేరవు. (9/9)

అట్లగుచో, మీరు సృష్టి నిర్మాణమును ఏ విధముగా చేసెదరు?

వాస్తవమునకు నా అధ్యక్షతన, నా సత్తా స్ఫూర్తిని స్వీకరించిన ప్రకృతి, సకల చరాచర ప్రాణికోటిని రచించుచున్నది. ఈ కారణమువల్లనే (నా అధ్యక్ష కారణంగానే) జగత్తు నందు వివిధ మార్పులు జరుగుచున్నవి. (9/10)

మీ శక్తి చేతనే జగత్తునందు సర్వమూ జరుగుచున్నది, అయినాకూడా జనులు మీ యందు ఏల శ్రద్ధను కలిగియుండరు?

మూఢ జనులు నా యొక్క సకల భూతముల మహేశ్వర రూపమగు పరమభావమును తెలియకున్నారు. అందువలన ఒక సాధారణ మానవ మాత్రునిగా దలంచి నన్ను తిరస్కరించుచున్నారు. (9/11)

**ప్రభూ! ఆ మూఢ జనులు ఏ విధముగ నుండెదరు?**

ఆ మూఢ జనులు అసురీ, రాక్షసీ, మోహినీ యనెడు ప్రకృతి నాశ్రయించిన వారై యుందురు. వారి ఆశలన్నియు, అన్ని శుభకర్మలును వ్యర్థమై పోవును. వారి జ్ఞానము కూడా వృథాయై పోవును. అనగా వారి ఆశలు, కర్మలు, జ్ఞానము సత్ఫలితములనిచ్చునవిగా నుండనేరవు. (9/12)

**అయినచో కృష్ణా! మీ యెడల శ్రద్ధ కలిగిన వార లెవరు?**

నన్ను సకల భూతములకు మూలకారణముగను, అవినాశియగు అక్షరస్వరూపునిగను ఎరిగిన వారలే నా దైవ ప్రకృతిని ఆశ్రయించి అనన్య భావముతో నన్ను భజించుచున్నారు. (9/13)

**మిమ్ము భజించువారి లక్షణములెవ్వి?**

నిరంతరము నా (ధ్యానము)లోనే మునిగి యుండెదరు. అట్లు దృఢ వ్రతులైన వారలు భక్తి పూర్వకముగా నా నామ సంకీర్తనము చేయుదురు. నన్ను పొందుటకై ప్రయత్నించెదరు. నాకు ప్రణమిల్లుచూ నన్ను ఉపాసించెదరు. (9/14)

**కృష్ణా! నిన్ను ఇంకనూ ఏయే రీతులలో ఉపాసించెదరు?**

అర్జునా! జ్ఞాన యజ్ఞము ద్వారా అభేద భావముతో నన్ను ఉపాసించెడు వారెందరోగలరు. ఎందరో నన్ను భేద భావముతో భావించి ఉపాసించెదరు. మరికొందరు విశ్వమునే నా స్వరూపముగా భావించి ఉపాసింతురు. (9/15)

**ప్రభూ! విశ్వమును ఉపాసించుట వలన మీ ఉపాసన ఎట్లగును?**

అర్జునా! యజ్ఞమును, క్రతువును, స్వధయును, ఔషధమును, మంత్రమును, ఘృతమును, అగ్నిని హవన రూపక్రియను నేనే. తెలియదగు విధానమును (విధిని), పవిత్రతను, ఓంకారమును, ఋగ్వేదమును, సామవేదమును, యజుర్వేదమును నేనే. ఈ సంపూర్ణ జగత్తునకు తండ్రిని, తల్లిని, ధాతను, తాతను, గతిని, భర్తను, ప్రభువును, సాక్షిని, నివాసమును, ఆశ్రయమును, సుహృత్తును, ఉత్పత్తిని, ప్రళయమును, స్థానమును,

నిధానమును, నాశరహితమైన బీజమును కూడా నేనే. నేనే సూర్య రూపముతో తపింపజేయుదును. జలమును గ్రహించెదను. తిరిగి ఆ జలమునే వర్షించుచున్నాను. అమృతమును మృత్యువును కూడా నేనే. ఇంకేమని చెప్పుదును. ఓ పార్థా! సత్, అసత్తును (జడ - చైతన్యములు) కూడా నేనే. (9/16-19)

**విశ్వరూపముతో సర్వస్వము మీరే అయినప్పుడు, మిమ్మల్ని విడిచి ఈ మానవులు ఇతర దేవతలను ఏల ఉపాసించెదరు?**

నశ్వరమగు సుఖభోగములను కోరువారు మూడు వేదములలో తెల్పబడిన యజ్ఞాది సకామ శుభకర్మల ననుష్ఠించుట ద్వారా దేవేంద్రుని పూజించుచు స్వర్గమును యాచించెదరు. ఇతర దేవతలను ఉపాసించెదరు. సోమరసమును పానము జేయువారలు, స్వర్గమునకు ప్రతిబంధకమగు పాపకృత్యములనుండి బయటపడిన ఆ మానవులు తమ పుణ్యాబలము చేత సువిశాలమగు స్వర్గలోకమున కేగెదరు. అచట దేవతలు అనుభవించెడు దివ్య భోగములను అనుభవించి పుణ్యము క్షయమైన వెంటనే తిరిగి మర్త్యలోకమున కేతెంచెదరు. ఈ విధంగా వేదత్రయము నాశ్రయించిన సకామ పురుషులు మాటి మాటికి జనన మరణముల నొందెదరు. (9/20-21)

**ఇది సకామ భావంతో వేదత్రయము నాశ్రయించెడివారి పరిస్థితి. మరి, నిన్నాశ్రయించిన వారి స్థితి ఏమిటి?**

ఇతరులను ఆశ్రయించక అనన్యులై నన్నే చింతించుచు నన్ను మాత్రమే భజించుచు, నా యందే లీనమై యుండునట్టి భక్తుల యోగ, క్షేమములను స్వయంగా నేనే వహింతును. అనగా అప్రాప్తమును ప్రాప్తింపజేయుట, ప్రాప్తించిన దానిని రక్షించుట - అను కార్యమును స్వయంగా నేను చేయుదును. (9/22)

**కాని నిన్ను ఉపాసించకుండా ఎవరైనా శ్రద్ధాపూర్వకంగా ఇతర దేవతలనుపాసించినచో?**

కుంతీపుత్రా! శ్రద్ధాపూర్వకంగా ఇతర దేవతలను పూజించెడు (సత్, అసత్ సర్వస్వము నేనే - యనెడు దృష్టితో) మనుజులు కూడా నిజమునకు నన్నే పూజించెదరు. కాని వారల ద్వారా చేయబడు ఆ పూజలు విధిపూర్వకమైనవి కావు. (9/23)

**కేశవా! ఆ పూజ కూడా నీదే అయినప్పుడు, వారు చేసే పూజ విధిపూర్వకము కాదెట్లు?**

యజ్ఞము, దానము, తపస్సు వంటి శుభకర్మల భోక్తను, సమస్త జగత్తునకు స్వామిని (ప్రభువును) నేనే. కాని వారు తత్త్వపూర్వకంగా నన్ను తెలియకున్నారు. అందువలన వారు పతనమగుచున్నారు. (9/24)

**ఆ పతన మెట్టిది?**

దేవతలను పూజించువారు దేవతలను పొందెదరు. పితరులను పూజించువారు పితరులను చేరుకొందురు. భూత, ప్రేతములను పూజించు వారు భూత, ప్రేతములను పొందుచున్నారు. కాని నా భక్తులగువారు నన్నే చేరుకొందురు! (9/25)

**నిన్ను చేరుకొనుటకు చేయు భక్తి ఎంతటి కఠినమైనదో కదా?**

కాదు, మిత్రమా! అది చాల సులభమైనది. ఏ భక్తుడైనా సరే ప్రేమతో నాకు పత్రమునుగాని, పుష్పమునుగాని, ఫలమునుగాని, జలమునుగాని సమర్పించిన దానిని, నా యందే తన్మయత్వమునొందిన భక్తునిద్వారా భక్తితో నివేదింపబడిన వస్తువును నేను స్వయంగా భుజించెదను. (9/26)

**నేనేమి చేయవలయును?**

యజ్ఞము చేసినా, దానము యిచ్చినా, తపస్సు చేసినా, భోజనము చేసినా, ఇంతేగాక ఏది చేసినా కూడా అవన్నింటిని నాకే నీవు అర్పించుము. (9/27)

**ప్రభూ! సమర్పించినచో నేమగును?**

బంధకారకమైన సకల శుభాశుభకర్మల ఫలమునుండి ముక్తుడవై నన్నే చేరుకొందువు. (9/28)

**సర్వస్వము సమర్పించిన వాడిని బంధ విముక్తుని జేసెదవు బాగుంది. సర్వస్వము సమర్పించని వాడు బంధింపబడియే యుండును! నీలో ఇంత పక్షపాత బుద్ధి ఎందుకు?**

లేదు అర్జునా! లేదు. నా యందెలాంటి పక్షపాతమూ లేదు. నేనందరి ఎడల సమంగా - సమభావంతో నుండెదను. నాకెవ్వరూ ప్రియమైనవారు లేరు. ద్వేషులు లేరు. నన్ను ఎవరు ప్రేమపూర్వకముగా భజింతురో వారు నాలో నుండెదరు. నేను వారిలో విశేషించి యుండెదను. (9/29)

**దుర్మార్గుడైన వాడు కూడా నీ భక్తుడు కాగలడా?**

తప్పక కాగలడు. పాపులలో కెల్ల పాపియైనా కూడా ఇతరుల ఆశ్రయమును వీడి (అనన్య చిత్తుడై) నన్ను మాత్రమే భజించినచో అతడిని సాధువు అని, సజ్జనుడు అని సమ్మతింపవలెను, ఏలయన, అతడు తీసుకొన్న నిర్ణయము చాలా మంచిది. (9/30)

**అతడిని కేవలం సాధువు, సజ్జనుడు అంటే సరిపోతుందా, స్వామీ?**

లేదు! అతడు త్వరలోనే ధర్మాత్ముడగును. మహాపవిత్రుడగును. అతడు శాశ్వతమగు శాంతిని బడయును. ఓ కుంతీపుత్రా! నా భక్తుడు నశింపడని, పతనమొందడని, నీవు నిశ్చయంగా తెలియుము. (9/31)

**కృష్ణా! ఇంకెవరైనా నీ భక్తికి పాత్రులు కాగలరా?**

పార్థా! పాప యోనులలో జన్మించినవారు, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు కూడా నన్ను ఆశ్రయించి (నా శరణుగోరిన)న నన్ను చేరుకొందురు. అయితే జన్మ, కర్మలతో పవిత్రులైన బ్రాహ్మణ, క్షత్రియులే, నా భక్తులగుచో, ఇంక చెప్పవలసిన దేమున్నది?

**ప్రభూ! నేను అట్టి భక్తుడనెట్లగుదును?**

నశ్వరమైన, సుఖరహితమగు మానవ శరీరమును పొందిన నీవు నన్ను భజించుము. (9/32,33)

**నిన్ను నేనెట్లు భజించవలెను స్వామీ!**

నీవు నా భక్తుడవు గమ్ము. నా యందు మనస్సుగల వాడవగుము. నన్నే పూజించుము. నాకే నమస్కరించుము. ఈ విధముగ నాతో నిన్ను నీవే నియోగించుకొని, నా పరాయణుడవైనచో నీవు, నన్నే చేరుకొందువు. ఇది నిశ్చయము. (9/34)

'రాజవిద్యా రాజగుహ్యాయోగము' అనెడు
తొమ్మిదవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదియవ అధ్యాయము - విభూతియోగము

శ్రీభగవాన్ ఉవాచ

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః ।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ।1।

న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః ।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ।2।

యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసమ్మూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ।3।

బుద్ధిర్ జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమః శమః ।
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ ।4।

అహింసా సమతా తుష్టిః తపో దానం యశోఽయశః ।
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ।5।

మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ।6।

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ।7।

అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః ।8।

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్ ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ।9।

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ।10।

తేషామేవానుకంపార్థమ్ అహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ 11 ॥

అర్జున ఉవాచ

పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యమ్ ఆదిదేవమజం విభుమ్ ॥ 12 ॥
ఆహుస్త్వామ్ ఋషయః సర్వే దేవర్షిర్నారదస్తథా ।
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే ॥ 13 ॥
సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥ 14 ॥
స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ 15 ॥
వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభిర్విభూతిభిర్లోకాన్ ఇమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16 ॥
కథం విద్యామహం యోగిన్ త్వాం సదా పరిచింతయన్ ।
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్ మయా ॥ 17 ॥
విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన ।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥ 18 ॥

శ్రీభగవాన్ ఉవాచ

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే ॥ 19 ॥
అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ ॥ 20 ॥
ఆదిత్యానామహం విష్ణుః జ్యోతిషాం రవిరంశుమాన్ ।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥ 21 ॥

వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా । 22 ।

రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణామహమ్ । 23 ।

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।
సేనానీనామహం స్కందః సరసామస్మి సాగరః । 24 ।

మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః । 25 ।

అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।
గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః । 26 ।

ఉచ్చైఃశ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్ । 27 ।

ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః । 28 ।

అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।
పితౄణామర్యమా చాస్మి యమః సంయమతామహమ్ । 29 ।

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ । 30 ।

పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్ ।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ । 31 ।

సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున ।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ । 32 ।

అక్షరాణామకారోఽస్మి ద్వంద్వః సామాసికస్య చ ।
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః । 33 ।

మృత్యుః సర్వహరశ్చాహమ్ ఉద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ 34 ॥

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్ ।
మాసానాం మార్గశీర్షోఽహమ్ ఋతూనాం కుసుమాకరః ॥ 35 ॥

ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్ ।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥ 36 ॥

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః ।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ॥ 37 ॥

దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ ।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥ 38 ॥

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।
న తదస్తి వినా యత్ స్యాత్ మయా భూతం చరాచరమ్ ॥ 39 ॥

నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥ 40 ॥

యద్యద్విభూతిమత్ సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్ ॥ 41 ॥

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।
విష్టభ్యాహమిదం కృత్స్నమ్ ఏకాంశేన స్థితో జగత్ ॥ 42 ॥

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగో నామ దశమోఽధ్యాయః ॥ 10 ॥



॥ ఓం శ్రీ పరమాత్మనే నమః ॥

# పదియవ అధ్యాయము - విభూతియోగము

భగవానుడు చెప్పెను - ఓయీ! అర్జునా! వినుము!! మరల నేనొక శ్రేష్ఠమైన మాటను చెప్పెదను. ఏలనన, నీవు నా యందే ప్రేమగల వాడవు కావున నీ మేలుగోరి చెప్పబోవుచున్నాను. (10/1)

**భగవన్! ఆ శ్రేష్ఠమైన వచనము ఏమి?**

నేను అవతరించుటకు గల కారణమును దేవతలుగానీ, మహర్షులుగానీ తెలియజాలరు. ఎందుకనగా నేను అన్నివిధములా, అందరికీ ఆదికారణుడను. (10/2)

**మీ అవతారమును గూర్చి దేవతలకు, మహర్షులకే తెలియనపుడు, ఇక మానవులకు సాధ్యమా? వారికి మేలు ఎట్లు కలుగును?**

నన్ను జన్మ లేనివానిగా, నశించనివానిగా, సమస్తలోకములకు మహేశ్వరునిగా తెలియుచున్న వ్యక్తి అన్ని పాపములనుండి విముక్తుడగును. (10/3)

**కృష్ణా! మీ శ్రేష్ఠమగు వాక్కులను నేనెట్లు తెలిసికోగలను?**

బుద్ధి, జ్ఞానము, అసమ్మోహము, క్షమ, సత్యము, దమము, శమము, సుఖము, దుఃఖము, భవము (ఉత్పత్తి) అభావము (ప్రళయము) భయము, అభయము, అహింస, సమతా, తుష్టి, (తృప్తి) తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి- ప్రాణులలో నుండెడి ఇలాంటి అనేక తెరగుల, వివిధ భావములు నా వల్లనే కలుగుచున్నవి. కేవలము ఈ భావములే గాకుండా సప్తమహర్షులు, వారికంటే పూర్వము నందున్న నలుగురు సనక సనందనాదులు, పదునలుగురు మనువులు నా యందు శ్రద్ధా భక్తులను గలిగి యున్నవారు. వీరందరు నా మనస్సు (సంకల్పము)చే ఉద్భవించినవారు. ఈ లోకమునందు గల వారందరు వీరి ప్రజలే. అనగా వీరందరి ఉత్పత్తి కారకుడను, ఆచార్యుడను నేనే. (10/4-6)

బుద్ధి, జ్ఞానము మొదలగు సకల భావములు, మహర్షులు ఇత్యాదులు నా నుండే ఉత్పన్నమగుదురు - అని చెప్పుటలో మీ ఆంతర్యమేమిటి?

నా విభూతిని (ఐశ్వర్యమును) యోగశక్తిని తత్త్వసహితముగ చక్కగా తెలిసికొనుచున్న వానికే నా యందు అచంచలమైన భక్తి కలుగును. ఇందే మాత్రము సందేహములేదు. (10/7)

తత్త్వ సహితముగ తెలియుట అనగానేమి?

నేను ఈ యావజ్జగత్తునకు మూలకారణుడను. నా వల్లనే ప్రపంచ మంతయు నడచుచున్నది - అని ఈ రకంగా నన్ను తాత్త్వికముగా గుర్తించి నా యందే శ్రద్ధా, ప్రేమను (భక్తిని) కలిగియుండెడు బుద్ధిమంతుడగు భక్తులు నన్ను భజించెదరు. (10/8)

కృష్ణా! వారు భజించు విధమెట్టిది?

అర్జునా! నా యందే మనస్సు నుంచినవారు, నా యందే ప్రాణముల నర్పించినవారగు భక్తులు పరస్పరముగ నా గుణ, ప్రభావాదులను గూర్చి బోధించు కొనుచు, వానిని చర్చించుకొనుచు నిరంతరము సంతుష్టాంతరంగులై యుండెదరు. నా యందు భక్తిని గలిగి, నన్నే ప్రేమించెదరు. (10/9)

ఇలాంటి భక్తుల కొరకు తమరేమి జేసెదరు?

అట్లు నిరంతరం నా యందే లీనమై, ప్రేమపూర్వకంగా నన్ను భజించునట్టి భక్తులకు నేను బుద్ధియోగము (సమత్వము)ను ప్రసాదించెదను. తద్వారా నన్ను వారు పొందెదరు. (10/10)

తమరింకనూ ఏమైనా జేసెదరా?

ఔను. పార్థా! వారిని అనుగ్రహించుటకై, వారి స్వరూపమందుండినట్టి నేను వారల అజ్ఞాన జనితమగు అంధకారమును, దేదీప్యమానమగు జ్ఞానదీపము ద్వారా నశింపజేయుదును. (10/11)

అర్జునుడిట్లనెను - ఆహా! ఓ స్వామీ! భక్తులపట్ల అలౌకికము, విలక్షణమూనైన మీ కృపా విశేషమును గూర్చి వినిన నేను గద్గదమై పోవుచున్నాను. ఓ ప్రభూ! నిర్గుణ - నిరాకార బ్రహ్మము, పరంధామము,

మహా పవిత్రులు మీరే. శాశ్వతుడు (సనాతనుడు) దివ్య పురుషుడు, ఆదిదేవుడు, జన్మలేనివాడును, విభుడు (సర్వవ్యాపకుడు)ను మీరేనని ఈ విధంగా దేవర్షినారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు, ఇంకా మిగతా ఋషులందరునూ నుడువుచున్నారు. స్వయంగా మీరే నాతో చెప్పుచున్నారు. **(10/12-13)**

**అర్జునా! నేను చెప్పిన దానిని నీవు నమ్ముచుంటివా?**

ఔను. కేశవా! నీవు చెప్పుచున్నదంతయు నేను నిజమని విశ్వసించెదను. నీవు అవతరించుటను గూర్చి దేవతలుగాని, విచిత్రమాయావులు దానవులుగాని తెలియజాలరు గదా. (10/14)

**పార్థా! దేవతలు తెలియకున్నచో నన్ను ఎవరు తెలియుదురందువు?**

ఓ భూతభవనా! ఓ భూతేశ్వరా! ఓ దేవ దేవా! ఓ జగత్పతే! ఓ పురుషోత్తమా! స్వయంగా నీవు మాత్రమే నిన్ను తెలియగలవు. ఇందువలన నీ విభూతుల ద్వారా నీవు లోకమంతటా వ్యాపించియున్నావు. అట్టి నీ దివ్య విభూతులనన్నింటినీ సమగ్రముగా వివరించి చెప్పుటకు నీవే సమర్థుడవు. (10/15,16)

భగవానుడు చెప్పెను - సరే! బాగున్నది. నేను నా దివ్యమగు విభూతులను సంక్షిప్తముగ జెప్పెదను. ఏలయన, నా విభూతుల విస్తారమునకు అంతమే లేదు. (10/19)

**భగవాన్! మీ యొక్క ఆ దివ్య విభూతులు ఎటువంటివి?**

సమస్త ప్రాణులకు ఆది, మధ్య, అంతములు కూడా నేనే. ప్రాణుల అంతఃకరణములందు ఆత్మరూపంతో కూడా నేనే ఉన్నాను. అదితి పుత్రులలో విష్ణువు (వామనుడ)ను, ప్రకాశవంతమగు వస్తువులలో కిరణములతో వెలిగే సూర్యుడను నేనే. మరుత్తులలోని (వాయుదేవతలలోని) తేజస్సును, నక్షత్రముల కధిపతి యగు చంద్రుడను నేనే. వేదములలో సామవేదమును, దేవతలలో ఇంద్రుడను, ఇంద్రియములలో మనస్సును, ప్రాణులలోగల చైతన్యమును (ప్రాణశక్తిని) నేనే. రుద్రులలో శంకరుడను, యక్ష రాక్షసులలో కుబేరుడను,

వసువులలో అగ్నిని, శిఖరములు గల పర్వతములలో మేరు పర్వతమును నేనే. పురోహితులలో బృహస్పతిని నా స్వరూపునిగా తెలిసికొమ్ము.

**భగవన్! ఇంకనూ మీ విభూతులెవ్వి?**

సేనాపతులలో స్కందుడను, జలాశయములలో సముద్రమును నేనే. మహర్షులలో భృగువును, శబ్దములలో ఏకాక్షరమగు ఓంకారమును, యజ్ఞము లన్నింటిలో జప యజ్ఞమును, స్థిరముగ నుండువానిలో హిమాలయమును నేనే. సమస్త వృక్షములలో రావి చెట్టును, దేవర్షులలో నారదుడను, గంధర్వులలో చిత్రరథుడను, సిద్ధులలో కపిలమునిని నేనే. గుఱ్ఱములలో అమృతముతో బాటుగ క్షీరసాగరము నుండి ఉద్భవించిన ఉచ్చైశ్రవమను పేరుగల గుఱ్ఱమును, శ్రేష్ఠమగు ఏనుగులలో ఐరావతమనెడు ఏనుగును. మనుష్యులలో రాజును నా విభూతి యని గుర్తించుము. (10/20-27)

**ప్రభూ! ఇంకనూ వేటిని మీ విభూతులనుగా గుర్తించవలెను?**

అర్జునా! ఆయుధములలో వజ్రాయుధమును, ధేనువులలో కామధేనువును నేనే. సంతానోత్పత్తి కారకుడగు కామధేనువును నేనే. సర్పములలో వాసుకిని నేనే. నాగులలో❖ శేషుడను (అనంతుడను), జలజంతువులకు అధిపతియగు వరుణుడను, పితరులలో అర్యముడను, శాసించువారిలో యమధర్మరాజును నేనే. దితి వంశమునందుపుట్టిన దైత్యులలో ప్రహ్లాదుడను, లెక్కపెట్టు వారలలో కాలమును, మృగములలో మృగరాజైన సింహమును, పక్షులలో వినతాసుతుడగు గరుత్మంతుడను నేనే. పవిత్రము జేయువాటిలో వాయువును, శస్త్రధారులలో శ్రీరాముడను, జలచరములలో మొసలిని, ప్రవహించెడు నదులలో గంగాదేవిని నేనే. (10/28-31)

**హృషీకేశా! ఇంకనూ నీవు ఏయే వానిలో నున్నావు?**

అర్జునా! సకల సృష్టులకు ఆది, మధ్య, అంతములలో సృష్టి, స్థితి, ప్రళయములో నేనే ఉన్నాను. విద్యలలో అధ్యాత్మ విద్యను, పరస్పరము

❖ సర్పము భూమిమీద, నాగులు నీటియందుండును - ఇదియే సర్ప, నాగుల మధ్యగల భేదము.

శాస్త్రార్థము చేయువారిలో తత్త్వనిర్ణయమునకై చేయబడునట్టి వాదమును నేనే. అక్షరములలో అకారమును, సమాసములలో ద్వంద్వ సమాసమును నేనే. అక్షయకాలమును అనగా కాలానికి కూడా మహాకాలమును అన్నివైపుల ముఖములు గలిగిన దాతను కూడా నేనే. (10/32-33)

**అచ్యుతా! ఇంకనూ నీవు ఏయే రూపములలో నున్నావు?**

అందరిని హరించి వేయు మృత్యువును, ఉత్పన్నమగు వానికి ఉద్భవము (ఉత్పత్తి హేతువు)ను నేనే. స్త్రీ జాతిలోని కీర్తి, శ్రీ (సంపద) వాక్కు, స్మృతి, మేధా, ధృతి, క్షమను నేనే, గానము చేయదగిన శృతులలో బృహత్సామమును, వైదిక ఛందస్సులలో గాయత్రి ఛంధస్సును నేనే. మాసములలో మార్గశిరమాసమును, ఋతువులలో వసంత ఋతువును నేనే. మోసగించు వానిలో జూదమును, తేజోవంతులలోగల తేజస్సును నేనే. జయించువారిలోని విజయమును, నిశ్చయించుకొనువారిలోని నిశ్చయమును, సాత్త్విక పురుషులలోగల సాత్త్విక భావమును నేనే. (10/34-36)

**భగవన్! ఇంకా మీ స్వరూపములేవి గలవు?**

వృష్ణివంశీయులలో వాసుదేవుడను❖, పాండవులలో ధనంజయుడవగు నీవును నేనే. మునులలో వేదవ్యాసుడను, కవులలో (త్రికాల దర్శులలో) శుక్రాచార్యుడను నేను. దమనము చేయువారలలో దండమును (దమన శక్తిని), విజయము కోరువారిలో నీతిని, గోపనీయ భావములలో మౌనమును జ్ఞానవంతులలో గల జ్ఞానమును నేనే. ఇంకను ఏమని చెప్పుదును. సకల ప్రాణులయొక్క బీజమును నేనే అయియున్నాను. ఓ అర్జునా! నేను లేకుండా

---

❖ ఈ ప్రకరణములో ఏ విభూతులు వర్ణింపబడినవో, వాటినన్నింటిని భగవంతుడు విభూతి రూపంతోనే చెప్పినాడు. అవతార రూపంతో కాదు. ఎట్లనగా అదితి పుత్రులలో వామనుడను నేను (10/21) శస్త్రధారులలో రాముడను నేను (10/31) ఇచట వృష్ణివంశమున వాసుదేవు (కృష్ణు)డను నేనే, పాండవులలో ధనంజయుడను నేను. ఇత్యాది మాటలను బట్టి భగవద్విభూతి రూపమే ప్రధానమని తెలియుచున్నది. ఇచ్చటి ప్రసంగము కూడా విభూతులదేనని గమనించవలెను.

ఈ చరాచర ప్రాణులలో నేదియునూలేదు. అనగా సమస్త చరాచరమును నేనే అయియున్నాను. (10/37-39)

**కృష్ణా! నీవు నీ విభూతులన్నింటినీ తెలిపినట్లేనా?**

లేదు అర్జునా! నా దివ్య విభూతులకు అంతము లేదుకదా! ఇట్లు విస్తారమగు దానిని సంక్షిప్తముగనే జెప్పితిని. నా విభూతులను గూర్చి సంపూర్ణంగ నేనే చెప్పజాలను. కాని నా విభూతులను గూర్చిన నొక గుర్తును మాత్రము నీకు తెలిపెదను. (10/40)

**ప్రభూ! ఏమిటా గుర్తు?**

లోకములలో ఐశ్వర్యయుక్తమగు, శోభాయుక్తమగు, బలయుతమగు వస్తువు ఏదేది కలదో, ఆయా వస్తువులను నీవు నా తేజము (యోగము) యొక్క ఏదో ఒక అంశము నుండి ఉత్పన్నమైనదనియే గ్రహించుము. (10-41)

**కృష్ణా! వాసుదేవా! ఇంకనూ గుర్తించుటకు సులువైన ఉపాయము ఏమున్నది?**

అర్జునా! సకల జగత్తు అనంతకోటి బ్రహ్మాండమును నా యొక్క ఒకానొక అంశమునందే ధరించి యుండిన నేను ఒక చేతిలో కళ్ళెమును, వేరొక చేతిలోకోలను ధరించి నీ ఎదుట కూర్చొని యున్నాను. నీ ఆజ్ఞను పాలించు చున్నాను. ఇంకనూ నీకు ఎక్కువగా తెలియవలసిన యవసరమేమున్నది. (10/42)

'విభూతి యోగము' అనెడు
పదియవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీ పరమాత్మనే నమః ॥

# పదకొండవ అధ్యాయము - విశ్వరూప సందర్శనయోగము

అర్జున ఉవాచ

మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్ ।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ ।1।

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ ।2।

ఏవమేతద్యథాత్థ త్వమ్ ఆత్మానం పరమేశ్వర ।
ద్రష్టుమిచ్ఛామి తే రూపమ్ ఐశ్వరం పురుషోత్తమ ।3।

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో ।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మానమవ్యయమ్ ।4।

శ్రీభగవాన్ ఉవాచ

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ।5।

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రాన్ అశ్వినౌ మరుతస్తథా ।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ।6।

ఇహైకస్థం జగత్ కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి ।7।

న తు మాం శక్యసే ద్రష్టుమ్ అనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ।8।

సంజయ ఉవాచ

ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః ।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్ ।9।

అనేకవక్త్రనయనమ్ అనేకాద్భుతదర్శనమ్ ।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥ 10 ॥

దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవమ్ అనంతం విశ్వతోముఖమ్ ॥ 11 ॥

దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।
యది భాః సదృశీ సా స్యాత్ భాసస్తస్య మహాత్మనః ॥ 12 ॥

తత్రైకస్థం జగత్ కృత్స్నం ప్రవిభక్తమనేకధా ।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా ॥ 13 ॥

తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలిరభాషత ॥ 14 ॥

అర్జున ఉవాచ

పశ్యామి దేవాంస్తవ దేవ దేహే
సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్ ।
బ్రహ్మాణమీశం కమలాసనస్థమ్
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥ 15 ॥

అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్ ।
నాంతం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥ 16 ॥

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతాత్
దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్ ॥ 17 ॥

త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।

త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే ၊ 18 ၊

అనాదిమధ్యాంతమనంతవీర్యమ్
అనంతబాహుం శశిసూర్యనేత్రమ్ ၊
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపంతమ్ ၊ 19 ၊

ద్యావాపృథివ్యోరిదమంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ၊
దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ၊ 20 ၊

అమీ హి త్వాం సురసంఘా విశంతి
కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి ၊
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ၊ 21 ၊

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ၊
గంధర్వయక్షాసురసిద్ధసంఘా
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే ၊ 22 ၊

రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదమ్ ၊
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్ ၊ 23 ၊

నభఃస్పృశం దీప్తమనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ ၊
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో ၊ 24 ၊

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని ।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస ।25।

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసంఘైః ।
భీష్మో ద్రోణః సూతపుత్రస్తథాసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః ।26।

వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రాకరాళాని భయానకాని ।
కేచిద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః ।27।

యథా నదీనాం బహవోఽంబువేగాః
సముద్రమేవాభిముఖా ద్రవంతి ।
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి ।28।

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయ సమృద్ధవేగాః ।
తథైవ నాశాయ విశంతి లోకాః
తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ।29।

లేలిహ్యసే గ్రసమానః సమంతాత్
లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః ।
తేజోఽభిరాపూర్య జగత్ సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో ।30।

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర ప్రసీద ।

విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥ 31 ॥
శ్రీభగవాన్ ఉవాచ
కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః ।
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ 32 ॥
తస్మాత్ త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ 33 ॥
ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యానపి యోధవీరాన్ ।
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ 34 ॥
సంజయ ఉవాచ
ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలిర్వేపమానః కిరీటీ ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ 35 ॥
అర్జున ఉవాచ
స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః ॥ 36 ॥

కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే ।
అనంత దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్ తత్పరం యత్ । 37 ।

త్వమాదిదేవః పురుషః పురాణః
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనంతరూప । 38 ।

వాయుర్యమోఽగ్నిర్వరుణః శశాంకః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే । 39 ।

నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।
అనంతవీర్యామితవిక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః । 40 ।

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి ।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ ప్రణయేన వాపి । 41 ।

యచ్చావహాసార్థమసత్కృతోఽసి
విహారశయ్యాసనభోజనేషు ।
ఏకోఽథ వాప్యచ్యుత తత్సమక్షం
తత్ క్షామయే త్వామహమప్రమేయమ్ । 42 ।

పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।

న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ ॥ 43 ॥

తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥ 44 ॥

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే ।
తదేవ మే దర్శయ దేవరూపం
ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 45 ॥

కిరీటినం గదినం చక్రహస్తమ్
ఇచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే! ॥ 46 ॥

శ్రీ భగవాన్ ఉవాచ

మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వమనంతమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥ 47 ॥

న వేదయజ్ఞాధ్యయనైర్న దానైః
న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।
ఏవంరూపః శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥ 48 ॥

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్ ।

వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ 49 ॥

సంజయ ఉవాచ

ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః ।
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునః సౌమ్యవపుర్మహాత్మా ॥ 50 ॥

అర్జున ఉవాచ

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।
ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥ 51 ॥

శ్రీ భగవాన్ ఉవాచ

సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః ॥ 52 ॥
నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥ 53 ॥
భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥ 54 ॥
మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః ।
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ ॥ 55 ॥

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపదర్శనయోగో నామ ఏకాదశోఽధ్యాయః ॥ 11 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదకొండవ అధ్యాయము - విశ్వరూపసందర్శనయోగము

అర్జునుడిట్లనెను - భగవన్! కేవలము నా యందు దయజూపుట కొరకే మీరు (నన్ననుగ్రహించుట కొరకే తమరు) పరమగోపనీయమగు ఆధ్యాత్మిక (సమస్తమూలమునందు నేను ఉన్నాననెడు) విషయమును చెప్పుటవలన నా మోహము (అజ్ఞానము) నశించిపోయినది.

కమలపత్రాక్షా! మీ నుండి ప్రాణుల ఉత్పత్తి, ప్రళయములను గూర్చి విన్నాను. అవినాశియగు తమరి మాహాత్మ్యమును గూడ విస్తారముగా వినియున్నాను. (11/1-2)

**అర్జునా! ఇంకనూ ఏమి వినదలుచుకున్నావు?**

ఓ పరమేశ్వరా! మీరు తెలిపినదంతయూ వాస్తవమే. ఓ పురుషోత్తమా! ఇప్పుడు నేను మీ ఐశ్వర్యమయమగు రూపమును దర్శింపగోరుచున్నాను. అయితే, నేను చూడగలుగుదునని తమరు భావించినచో, సర్వసమర్థుడవగు ఓ ప్రభూ! అవినాశియగు తమ స్వరూపమును చూపింపుము. (11/3-4)

భగవానుడిట్లనెను - అర్జునా! నీవు నా ఒక్క రూపమునే ఏల జూచెదవు! వందల, వేలకొలది సంఖ్యలో గల దివ్యములైన నానా విధములైన, అనేక వర్ణములుగలిగి, అనేక విధములగు ఆకృతులుగా నున్న నా రూపమును తిలకించుము. (11/5)

**ఇంకనూ ఏమి చూడాలి, భగవన్?**

సమస్త ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీ కుమారులను, చూడుము. మరుద్గణమును కూడా చూడుము. ఇంకా ఎన్నెన్నో ఇంతకు ముందెన్నడూ నీవు చూడని ఆశ్చర్యమును గొలుపు రూపములను కూడా చూడుము. (11/6)

**అవన్నీ ఎక్కడ చూడాలి, ప్రభూ?**

నా శరీరంలోనే చూడాలి. చరాచర ప్రాణికోటిని చూడుము. శరీరమందంతటా గాక ఒకే ఒక భాగములో చూడుము. నీవు ఇంకను ఏమేమి చూడగోరెదవో, అదంతయు తిలకించుము. (11/7)

**మీరు మాటిమాటికి చూడు, చూడు అని అంటున్నారు, కాని నాకేమీ కనిపించడంలేదు కదా?**

నీవు నీ చర్మచక్షువులతో చూడలేవు. అర్జునా! ఇదిగో! నీకు దివ్యచక్షువులను ఇచ్చెదను. తద్వారా నా ఈశ్వరీయమగు సామర్థ్యమును (యోగశక్తిని) నీవు దర్శింపగలవు. (11/8)

**సంజయా! భగవంతుడు ఇట్లు చెప్పి ఏమి చేసెను?**

సంజయుడిట్లనెను - ఈ విధంగా చెప్పి మహా యోగేశ్వరుడగు శ్రీహరి అర్జునునకు ఐశ్వర్య సంపన్నమయిన తన దివ్య స్వరూపమును చూపించెను. (11/9)

**సంజయా! ఎటువంటి రూపమును చూపించెను?**

అద్భుతమైన అనేక ముఖములు, నేత్రములు, అనేక దివ్యాభరణములతోను, నానావిధ అస్త్రశస్త్రములను చేతులలో ధరించి, గొప్ప దివ్యమాలికలను ధరించినట్టి, లెక్కలేనన్ని దివ్యమగు చందనాదుల నలదుకొనినట్టి, ఆశ్చర్యమయమగు, నలువైపుల ముఖములు గలిగిన అనంత స్వరూపమును చూపించెను. (11/10-11)

**ఆ రూపము ఎందుకు ఆశ్చర్యముగ ఉండెను?**

ఆకాశములో ఒక్కపెట్టున వేలకొలది సూర్యులు ఉదయించినప్పుడు ఉత్పన్నమగు ప్రకాశమంతయు కలిసినప్పటికినీ, ఆ విశ్వరూపుని దివ్యప్రకాశము ముందు ఎందుకూ కొరగాదు కదా! (11/12)

**అర్జునుడు ఆ రూపమును ఎక్కడ జూచెను?**

భగవానుని శరీరమందలి ఒక భాగమునందే అనేక విభాగములతో కూడిన సంపూర్ణ జగత్తును అర్జునుడు చూచెను. (11/13)

**అట్టి రూపమును చూచిన అర్జునుడేమయ్యెను?**

అర్జునుడు ఆశ్చర్య చకితుడయ్యెను. అతని రోమములు నిక్కపొడచెను. (అతని దేహము పులకించిపోయెను) అప్పుడతడు శిరసా ప్రణామము గావించి, చేతులు జోడించి స్తుతించెను. (11/14)

**సంజయా! అర్జునుడేమని పలికెను?**

అర్జునుడిట్లు పలికెను - ఓ దేవా! నేను తమరి శరీరంలో దేవతలను, గొప్పవైన విభిన్న ప్రాణుల సముదాయములను, కమలము మధ్యన కూర్చొనిన బ్రహ్మను, కైలాసమునందు విరాజితుడైన మహాదేవుని, ఋషులను, దివ్యసర్పములను చూచుచున్నాను. (11/15)

ఓ విశ్వరూపా! ఓ విశ్వేశ్వరా! నేను అనేక బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు గలిగినవానిగా మిమ్మల్ని చూచుచున్నాను. అన్ని దిక్కులనుండి అనంత రూపములు గలవానిగ చూచుచున్నాను. నేను మీ (స్వరూపమునకు) మొదలేదో, మధ్యభాగమేదియో, అంతిమమేదియో కూడ చూడజాలకున్నాను. శిరముపై కిరీటము, చేతులలో గద, చక్రము (శంఖము, పద్మము) లను ధరించి (యుండి) తేజోరాశిగా సర్వదిక్కుల ప్రకాశించుచున్నట్టి దేదీప్యమానమగు అగ్నివలె, సూర్యునివలె జ్యోతిర్మయుమై కనులతో అతికష్టముమీద చూడగలిగిన అప్రమేయునిగా నేను చూచుచున్నాను. (11/16-17)

ఓ స్వామీ! ఓ ప్రభూ! తమరే అక్షర పరబ్రహ్మము. సమస్త జగతికి ఆధారము మీరే. సనాతన ధర్మమును రక్షించెడు సనాతన పురుషులు మీరే అనగా నిర్గుణ నిరాకారము, సగుణ నిరాకారము, సగుణ సాకారము కూడా మీరేనని నేను విశ్వసించుచున్నాడను. (11/18)

**కేవలం విశ్వసించుటయేనా? నిజంగా చూడడంలేదా?**

మిమ్ములను నేను ఆది మధ్యాంత రహితునిగా, అనంత ప్రభావశాలిగా, చంద్రసూర్యులనెడి నేత్రములను గలిగి, అగ్నిశిఖల వంటి ముఖములు గలిగి జగత్తునంతయు తపింప జేయుచుండగా తిలకించుచున్నాను. (11/19)

ఓ మహాత్మా! భూమి, ఆకాశముల మధ్య నున్న భాగమంతయును, దశ దిశలును మీ తోడనే నిండి యున్నవి. మీ ఈ ఉగ్రరూపమును తిలకించి ముల్లోకములు భయమందుచున్నవి. ఆహా! ఇదిగో! ఆ దేవతల సముదాయ మంతయు మీ యందు ప్రవేశించుచున్నది. వారిలో కొందరు భీతావహులై దోసిలొగ్గి మీ నామ గుణముల నుచ్చరించుచున్నారు. మహర్షులు, సిద్ధ సమూహములు 'కళ్యాణమగుగాక! మంగళ మగునుగాక!' యని స్వస్తిబల్కుచు సుందరమైన, ఉత్తమమైన స్తోత్రములచే మిమ్ములను స్తుతించుచున్నారు. (11/20-21)

రుద్రులు, వసువులు, సాధ్యదేవతలు, విశ్వేదేవతలు, అశ్వినీ కుమారులు, మరుద్గణము, పితృదేవతలు, గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధ సముదాయముల వారందరు మిగుల ఆశ్చర్యచకితులై మిమ్ముగాంచుచున్నారు. (11/22)

ఓ భగవన్! లెక్కలేనన్ని ముఖములు, కన్నులు గలిగిన అనేకములగు ఉదరములు, పాదములు గలిగి, అతిభయంకరమగు కోఱలతో కూడిన మీ స్వరూపమును గాంచిన సకలలోకములు మరియు స్వయంగా నేను కూడా భయభీతుడనగుచున్నాను. (11/23)

ఓ విష్ణో! ఆకాశము నంటుచూ, దేదీప్యమానమైన విశాలనేత్రములు గలిగి, తెరచిన నోళ్ళు గలిగినట్టి మీ రూపమును జూచి లోలోపల భయమును జెందిన నేను ధైర్యమును, శాంతిని పొందలేకపోవుచున్నాను. కాలాగ్నివలె ప్రజ్వలించుచున్న కోరలతో కూడిన భయంకరమగు, మీ ముఖములను జూచిన నాకు తూర్పు పడమరలు, ఉత్తర దక్షిణములనెడు దిక్కులు ఎటుగా నున్నవో తెలిసికొన జాలకున్నాను. నాకు శాంతి సైతము లభింపకున్నది. అందుచేత ఓ దేవేశ! ఓ జగన్నివాసా! మీరు ప్రసన్నులు కండు. (11/24-25)

మా వైపున గల ముఖ్యమగు యోధాగ్రేసరులు మరియు భీష్ముడు ద్రోణుడు, కర్ణుడు గూడా మీ నోటిలో ప్రవేశించుచున్నారు. వారి పక్షమునకు చెందిన రాజుల సమూహములతో సహితముగా ధృతరాష్ట్రుని కుమారు లందరును కరాళ కోరలతో భయంకరమైన మీ ముఖములందు అతివేగముగా ప్రవేశించుచున్నారు. వారిలో కొందరు ముక్కలు ముక్కలైన తలలతోబాటు మీదంతముల సందులలో చిక్కుకొని కనిపించుచున్నారు. (11/26-27)

నదులలోని జల ప్రవాహము సముద్రమున కభిముఖముగ ప్రవహించు రీతిగా మనుష్యులలో గొప్ప మహాశూర వీరులగు భీష్మద్రోణాదులు అందరును ప్రజ్వలించుచున్న మీ ముఖములందు ప్రవేశించుచున్నారు. మిడుతలు తమ నాశనము కొరకై అగ్నియందు ప్రవేశించుచున్న చందమున ఈ జనులెల్లరు మీ ముఖమునందు ప్రవేశించుచున్నారు. మీరు కూడా మండుచున్న నోళ్ళతో అందరిని భుజింపుచూ ఏకధాటిగా నాకుచున్నారు. ఉగ్రమైన మీ తేజస్సు జగత్తునంతయు తపింపజేయుచున్నది.

(11/28,29,30)

ఉగ్రరూపము కలిగిన తమరెవరో దయచేసి తెలుపుడు.

ఓ దేవ శ్రేష్ఠా! మీకు నమస్కారము. తమరు ప్రసన్నులు కండు. ఆదిరూపుడవగు మిమ్ములను నేను తత్త్వముతో తెలుసుకొన గోరుచున్నాను. ఏలయన, మీ ప్రవృత్తి ఏమిటో? నేను తెలియకున్నాను. (11/31)

భగవానుడిట్లు తెలిపెను - ఓయీ! వినుము! సంపూర్ణ జగత్తును సంహారము చేయుటకై నేను విజృంభించిన కాలుడను.

ఇచటికి తమరు ఏల వచ్చితిరి?

నేను సర్వమును సంహారము జేయుట కేతెంచితిని.

**ఇచట మీ ద్వారా ఎవరేని రక్షింప బడెదరా? లేదా?**

మీ ప్రతిపక్షము నందు నిలిచిన యోధులందరును, నీవు యుద్ధము జేయకపోయినను జీవించి యుండజాలరు. అందువలన నీవు యుద్ధమునకై లేచినిలువుము. యశస్సును గడించుము. శత్రువులందరిని జయించి రాజ్యమును అనుభవింపుము. వీరందరును ఇంతకుముందే నా చేత సంహరింపబడినారు.

**అయినచో నాకు యుద్ధముతో పని ఏమిటి?**

నీవు కేవలము నిమిత్తమాత్రుడవగుము. (11/32-33)

**కాని మహాప్రభో! భీష్ముడు, ద్రోణుడు, జయద్రథుడు, కర్ణుడు మొదలగువారిపై విజయమెట్లు లభించును?**

భీష్మ, ద్రోణాదుల వంటి ఇంకా ఇతర వీరులెందరో నా చేత సంహరింపబడినారు. కావున నీవు భయము చెందకుము. యుద్ధము జేయుము. యుద్ధమునందు నీవు శత్రువులను అందరినీ జయించగలవు. (11/34)

**సంజయా! అటుపిమ్మట ఏమి జరిగెను?**

సంజయుడిట్లు వివరించెను - భగవానుడు చెప్పిన మాటలు వినిన అర్జునుడు భయముతో వణకుచు, అంజలి ఘటించి, నమస్కరించెను. ఇంకనూ మిగుల భయభీతి నొందుచు మరల శ్రీకృష్ణభగవానునకు ప్రణమిల్లి, గద్గదస్వరముతో నిట్లనెను. (11/35)

**సంజయా! అర్జునుడు ఏమి చెప్పెను?**

అర్జునుడిట్లు స్తుతించెను - ఓ హృషీకేశా! మీ నామము నుచ్చరించుట చేత సకల జగత్తు హర్షించుచు, అనురాగమును పొందుచున్నది. మీ నామ సంకీర్తనము వలన రాక్షసులు దశ దిశలకు పారిపోవుచున్నారు. సిద్ధ సంఘములు మీకు నమస్కరించుచున్నవి. ఇది యంతయు తగినట్లే యున్నది. **(11/36)**

**ఇదంతా ఎందుకు తగియున్నది అర్జునా?**

ఎందుకనగా - మీరు అనంతులు - అంతము లేనివారలు. సమస్త దేవతలకు ఈశ్వరులు. జగత్తునకు ఆధార స్వరూపులు. మీరు అక్షర స్వరూపులు. సత్తు, అసత్తు కూడా మీరే. దానికంటే పరమైనది కూడా మీరే. ఓ మహాత్మా! మీరు బ్రహ్మదేవునకే ఆదికర్తలు. గురువులకు కూడా గురువులైన మీకు ఎవ్వరు? ఏల నమస్కరింప కుందురు? **(11/37)**

మీరే ఆదిదేవులు, పురాణపురుషులు. ఈ విశ్వమునకు తమరే పరమ ఆధారస్వరూపులు. సర్వము తెలియువారు, తెలియదగినవారు మీరే. సర్వమునకు ప్రధాన గంతవ్యస్థానము (చేరదగిన చోటు) తమరే అయి యున్నారు. ఓ అనంతరూపా! ఈ లోకమంతయు మీతో నిండియున్నది. **(11/38)**

వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, ప్రజాపతి (బ్రహ్మదేవుడు) ప్రపితామహులు (బ్రహ్మదేవుని జనకులు) మీరే అయి యున్నారు. అందువలన మీకు వేయిసార్లు నమస్కరించుచున్నాను. మాటిమాటికి నమస్కరించుచున్నాను. ముందునుండి, వెనకనుండి, అన్నివైపులనుండి మీకు నమస్కరించుచున్నాను. సర్వస్వమూ మీరే. జగత్తునందంతటా మీరే వ్యాపించి యున్నారు. **(11/39-40)**

ఓ పరమేశ్వరా! ఇలాంటి మీ మహిమను తెలియక, నేను మిమ్ములను స్నేహితునిగ భావించి, ఓ కృష్ణా! ఓ మిత్రుడా! ఓ యాదవుడా! యని పొరబాటుగ లేక ప్రేమతో పిలిచితిని. మరియు విహార, శయన, ఆసన, భోజనాది వేళలందు తాము ఒంటరిగా నున్నప్పుడు, మిత్రుల ముందు, ఇంటివారి యెదుట వినోదముతో నేను మిమ్ము పరిహాసముతో అవమానించితిని. ఇట్టి నా యపరాధమును క్షమింపుమని మిమ్ములు నేను వేడుకొనుచున్నాను. **(11/41-42)**

ఈ చరాచరజగత్తునకు మీరు తండ్రులు, పూజ్యులు, గురువులకే గురువులు. అనుపమ ప్రభావశాలియగు ఓ భగవంతుడా! ఈ మూడు లోకములందు మీకు సాటి ఎవ్వరూ లేరు. ఇక మీకంటే అధికుడు ఎట్లుండగలడు? కావున స్తుతింపదగిన వాడవగు నీకు నేను దండప్రణామము నాచరించి ప్రసన్నుడవగుటకు వేడుకొనుచున్నాను. తండ్రి తన తనయుని స్నేహితుడు తన స్నేహితుని, భర్త తన భార్యయొక్క అపరాధములను సహించునట్లుగా మీరు నా యపరాధములను మన్నింపుడు. (11/43-44)

**సరే! మంచిది. ఇంకనూ నీవేమి కోరుదువు?**

ఇట్టి అపూర్వమగు రూపమును చూచి నేను హర్షించుచున్నాను. భయముచే నా మనస్సు వ్యాకులత చెందుచున్నది. కనుక ఓ దేవేశా! ఓ జగన్నివాసా! మీరు ప్రసన్నులు కండు. శిరముపై మకుటము ధరించి చేతులలో శంఖ, చక్ర, గదా, పద్మములు ధరించెడు మీ దేవరూపము (చతుర్భుజ విష్ణురూపము)ను జూపింపుము. నేను ఆ రూపమునే చూడగోరుచున్నాను. ఓ సహస్రబాహూ! ఓ విశ్వమూర్తీ! మీరు మీ చతుర్భుజ రూపముతోనే నాకు దర్శనము నొసగుము. (11/45-46)

శ్రీ భగవానుడిట్లనెను - సోదరా! నేను మిగుల ప్రసన్నుడనై నా సామర్థ్యముచే తేజోమయము, అన్నింటికీ ఆదియగు, అనంత విశ్వరూపమును నీకు చూపితిని. ఈ రూపమును ఇంతకుముందు నీవు తప్ప మరెవ్వరూ దర్శించి యుండలేదు. (11/47)

**మానవుడు తన (పురుషార్థము) ప్రయత్నము ద్వారా నైతే చూడగలడు కదా భగవన్?**

లేదు! మానవలోకమున నీవంటి అనుగ్రహ పాత్రులకు తప్ప వేదాధ్యయనముచేతను, దానము చేతను, ఘోరమైన తపస్సు చేతను, గొప్ప అనుష్ఠానములచేతను, ఈ విధమైన విశ్వరూపమును వేరెవ్వరు దర్శింపజాలరు. (11/48)

**కాని ఓ భగవన్! భయము నొందుచున్న నేనేమి చేయుదును?**

మిత్రమా! ఈ విధమైన నా ఘోరమగు రూపమును గాంచి నీవు వ్యాకులత నొందవలదు. నీలో మూఢభావమునకు తావివ్వవలదు. ఇప్పుడు

నీవు భయమును వీడి, ప్రసన్నచిత్తము గలవాడవై మరల నా విష్ణురూపమును దర్శింపుము. (11/49)

**అటుపిమ్మట భగవానుడు ఏ రూపమును జూపించెను సంజయా?**

సంజయుడిట్లనెను - ఈ విధముగా తెల్పిన వాసుదేవ భగవానుడు అర్జునునకు తన చతుర్భుజరూపమును జూపించెను. తిరిగి సౌమ్యముగ నుండెడు ద్విభుజ రూపుడై భయభీతుడగు అర్జునుని ఓదార్చెను. (11/50)

**అర్జునా! ఇక నీ భయము తొలగిపోయినదా?**

అర్జునుడిట్లు తెలిపెను - ఓ జనార్దనా! మీ ఈ ప్రశాంతమైన మానవ రూపమును గాంచి నేను యిప్పుడు స్థిరచిత్తుడనైతిని. నా సహజస్థితిని పొందితిని. (11/51)

శ్రీభగవానుడిట్లనెను - నీవు చూచిన నా చతుర్భుజరూపమును దర్శించుట మిక్కిలి దుర్లభమైనది. దేవతలు కూడా ఈ రూపమును చూచుటకై సదా ఉవ్విళ్ళూరుచుండెదరు. నీవు నన్ను చూసినట్లుగా, వేదములచే, తపస్సుచే, దానముచే, యజ్ఞముచేనయిననూ నేను చూడశక్యుడనుగాను. (11/52-53)

**అయినచో, మిమ్ము దర్శించుటెట్లు?**

ఇట్టి చతుర్భుజ రూపముగల నేను అనన్యభక్తితో మాత్రమే చూడశక్యమైనవాడను. చూచుటవరకే కాదు, మీదు మిక్కిలి తత్త్వముచే యథార్థమెరుంగుటకు, పొంద గలుగుటకు కూడా శక్యమైనవాడను.(11/54)

**ప్రభూ! ఆ అనన్యభక్తి యెట్టిది?**

సర్వకర్మలను నా కొరకే జేయుట, నా భక్తుడగుట, నా పరాయణుడగుట సంసారమునందు ఆసక్తి రహితుడై యుండుట, ఏ ప్రాణి యందు కూడా వైరభావము లేకుండుట - అనునిట్టి భక్తి యుక్తుడైన భక్తుడు నన్నే పొందుచున్నాడు. (11/55)

'విశ్వరూప సందర్శనయోగము' అనెడు
పదకొండవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పన్నెండవ అధ్యాయము - భక్తియోగము

అర్జున ఉవాచ

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే ।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥ 1 ॥

శ్రీభగవాన్ ఉవాచ

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా మతాః ॥ 2 ॥

యే త్వక్షరమనిర్దేశ్యమ్ అవ్యక్తం పర్యుపాసతే ।
సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్ ॥ 3 ॥

సంనియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః ॥ 4 ॥

క్లేశోఽధికతరస్తేషామ్ అవ్యక్తాసక్తచేతసామ్ ।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥ 5 ॥

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ॥ 6 ॥

తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి నచిరాత్ పార్థ మయ్యావేశితచేతసామ్ ॥ 7 ॥

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ 8 ॥

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ॥ 9 ॥

అభ్యాసేప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥ 10 ॥

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ 11 ॥

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।
ధ్యానాత్ కర్మఫలత్యాగః త్యాగాచ్ఛాంతిరనంతరమ్ ॥ 12 ॥

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥ 13 ॥

సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పితమనోబుద్ధిః యో మద్భక్తస్స మే ప్రియః ॥ 14 ॥

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్షభయోద్వేగైః ముక్తోయస్స చ మే ప్రియః ॥ 15 ॥

అనపేక్షః శుచిర్దక్షః ఉదాసీనో గతవ్యథః ।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః ॥ 16 ॥

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః ॥ 17 ॥

సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః ॥ 18 ॥

తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।
అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మే ప్రియో నరః ॥ 19 ॥

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥ 20 ॥

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగోనామ ద్వాదశోఽధ్యాయః ॥ 12 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పన్నెండవ అధ్యాయము - భక్తియోగము

**అర్జునుడిట్లనెను - ఇప్పుడు తమరు తెల్పిన విధముగా భజించెడు భక్తులు కొందరు గలరు. మరికొందరు మీ అవ్యక్తరూపమును ఉపాసించువారు గలరు. కావున ఆ రెండు తెరగుల ఉపాసకులలో శ్రేష్ఠమైన వారుయెవరు? (12/1)**

భగవానుడిట్లనెను - నా యందు మనసు నుంచి మిక్కిలి శ్రద్ధాయుతులై నిత్య నిరంతరము నన్ను ఉపాసించెడు వారినే నేను సర్వశ్రేష్ఠులుగా నెంచుదును. (12/2)

**కాని అవ్యక్తము నుపాసించెడు వారిని?**

సర్వత్ర సమబుద్ధి గలవారై, ప్రాణులకు మేలు చేకూర్చుటలో మునిగి యుండునట్టి❖ పురుషుడు ఇంద్రియములను నిగ్రహించి, సర్వత్రా పరిపూర్ణుడై, అచింత్యమగు, కూటస్థమగు, అచలమైన, అనిర్దేశ్యమైన అవ్యక్తమగు, అక్షరమును ఉపాసించువారలు కూడా నన్నే పొందెదరు. (12/3,4)

**అయినచో, కృష్ణా! మిమ్ము భజించువారలు శ్రేష్ఠులెట్లయ్యెదరు?**

అర్జునా! అవ్యక్తమునందు ఆసక్తచిత్తముగల పురుషులు నా అవ్యక్త స్వరూపము నుపాసించెదరు. వారికి అధిక శ్రమ కలుగును. ఏలనన, దేహాభిమానులకు అవ్యక్తమార్గము అతి కష్టముతో సాధ్యమగును. కాని సంపూర్ణ కర్మలను నాయందే సమర్పించి, నా పరాయణులైన వారలు అనన్యభావముతో నన్ను ధ్యానించుచు, నన్ను ఉపాసించెదరు. ఇట్లు నా యందే చిత్తము నిల్పిన భక్తులను నేను స్వయముగా మృత్యురూపమగు సంసార సాగరము నుండి అతి శీఘ్రముగ ఉద్ధరించెదను. (12/5-7)

**నేను అనన్యభక్తుడ నెట్లగుదును?**

అర్జునా! నాలోనే నీ మనస్సు నిల్పుము. నా యందే నీ బుద్ధి నుంచుము. ఈ విధంగా మనస్సును, బుద్ధిని నా యందు నిల్పిన పిదప నీవు నాలోనే

---

❖ ప్రాణిమాత్రునకు హితమొనర్చుటలో, తన స్త్రీ పుత్ర పరివారమునకు హితమొనర్చుటలో జ్ఞానయోగికి కించిత్తు కూడా వ్యత్యాస ముండకూడదు. అప్పుడే ఆ జ్ఞానయోగికి తత్త్వజ్ఞానము కలుగును.

వసింతువు. ఒకవేళ నీవు నీ మనస్సును, బుద్ధిని నా యందు స్థిరముగా నుంచుటలో అసమర్థుడ వగుదువేని అభ్యాసయోగము ద్వారా నన్ను పొందగోరుము. ఒకవేళ అభ్యాసయోగము నందు కూడా నీవు అసమర్థుడ వగుచో, నా కొరకు కర్మ జేయుటకు పరాయణుడవు కమ్ము. దీనితో కూడా నీవు సిద్ధిని పొందగలవు. బహుశా నీవు నా కొరకు కర్మ చేయుటయందు కూడా అసమర్థుడవగుదువేని, నా భక్తియోగము నాశ్రయించి సర్వకర్మల ఫలమును (ఫలాసక్తిని) త్యాగమొనర్చుము. (12/8-11)

**కృష్ణా! ఇట్టి ప్రక్రియ ద్వారా మీ యోగము నాశ్రయించి కర్మఫలమును త్యజించుట నాలుగవదిగా తెల్పబడిన కారణమున నికృష్టమైన సాధనమగును కదా?**

కాదు, పార్థా! కాదు, యోగ (సమతా) రహితమైన అభ్యాసముకంటే శాస్త్రీయజ్ఞానము శ్రేష్ఠమైనది. యోగరహితమగు జ్ఞానము కంటే ధ్యానము శ్రేష్ఠమైనది. యోగ రహిత ధ్యానము కంటే నా యోగము నాశ్రయించి కర్మఫలమును త్యజించుట శ్రేష్ఠము. ఏలయన, త్యాగము వలన తత్క్షణమే శాంతి లభించును. (12/12)

**భగవన్! పైన తెల్పిన నాలుగు విధములగు సాధనములలో ఏదేని ఒకే ఒక సాధనతో నిన్ను పొందినట్టి సిద్ధుడగు భక్తుని లక్షణములెట్టివి? అనగా అతని యందు ఏ, ఏ గుణము లుండును?**

అర్జునా! అతనికి ఏ ప్రాణి యెడల కూడా ద్వేషముండదు. అంతేగాక అతనికి సకల భూతములతోడ స్నేహము, ప్రేమ యుండును. దయను గలిగియుండును. అతడు అహంకార మమకార రహితుడై, క్షమాశీలుడై సుఖదుఃఖముల ప్రాప్తియందు సమత్వము గలవాడై యుండును. అతడు అన్ని పరిస్థితులలోను నిరంతరము సంతుష్టుడై యుండును. శరీరము ఇంద్రియములు అతని వశము నందుండును. అతని మనస్సు, బుద్ధి నాకే అర్పింపబడియుండును. ఈ విధంగా దృఢమైన నిశ్చయము గల భక్తుడు నాకు ప్రియమైనవాడు. (12/13-14)

**అయ్యా! ఇంకెవరు నీకు ప్రియమైనవారు?**

కుంతీపుత్రా! తన వలన ఇతరులకు ఉద్వేగము కలుగకుండ, ఇతరుల

వలన తాను ఉద్వేగపడకుండా, హర్షము, ఈర్ష్య, భయము, ఉద్వేగములు లేనివాడగు భక్తుడు నాకు ప్రియుడు. (12/15)

**ప్రభూ! ఇంకనూ నీకు ప్రియమైన వారెవరు?**

పార్థా! తనకొరకు ఎలాంటి వస్తువును కాని, వ్యక్తిని కాని కోరకుండా, అంతర్బాహ్యములందు పవిత్రముగ నుండువాడు, ఏ పని నిమిత్తమై తాను ఇచటకేతెంచెనో, అట్టి పనిని ముగించుకొను నట్టి దక్షత గలవాడు, జగత్తునుండి ఉపరతిని పొంది, ప్రశాంతచిత్తము గలవాడు, భోగానుభవములకై కర్మలనాచరించని భక్తుడు నాకు ప్రియుడు. (12/16)

**కృష్ణా! ఇంకనూ ఎవరు ప్రియమైనవారు?**

అనుకూలత లభించినప్పుడు హర్షించనివాడు, ప్రతికూలత ప్రాప్తించినప్పుడు ద్వేషింపనివాడు, దుఃఖదాయకమగు పరిస్థితిలో శోకించనివాడు, సుఖదాయకమగు పరిస్థితిని కోరనివాడు - ఈ విధంగా అనుకూల - ప్రతికూలములందు రాగద్వేషములను త్యజించునట్టి భక్తుడు నాకు ప్రియుడు. (12/17)

**మరింకనూ ప్రియమైన వారెవరు ప్రభూ?**

శత్రు, మిత్రులయందు, మానావమానములయందు, అనుకూల ప్రతికూలములందు, సుఖదుఃఖములందు సమత్వము కలిగి యుండువాడు, ప్రాపంచిక ఆసక్తి లేనివాడు, నిందాస్తుతులను సమానముగ నెంచువాడు, ఏ విధంగానైనా కూడా శరీర నిర్వహణలో సంతుష్టుడై యుండువాడు, మననశీలుడై, నివాసస్థానము నందు, శరీరము నందు కూడా మమత, ఆసక్తి లేనివాడై యుండునట్టి స్థిరబుద్ధి గలిగిన భక్తుడు నాకు ప్రియమైనవాడు. (12/18-19)

**ఇప్పటి వరకు మీరు మీకు ప్రియమైన ఐదుగురు సిద్ధ భక్తులను గూర్చి తెలిపితిరి. ఇక మీకు అత్యంత ప్రియమైన వారెవరు?**

అర్జునా! శ్రద్ధాప్రేమ పూర్వకముగ నా పరాయణులైనవారు, ఇప్పుడే చెప్పబడిన సిద్ధభక్తుల లక్షణ (గుణ)ముల యందు ఇష్టము గలిగినట్టి సాధక భక్తులు నాకు అత్యంత ప్రియమైనవారని తెలియుము.

'భక్తియోగము' అనెడు పన్నెండవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదుమూడవ అధ్యాయము - క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము

శ్రీభగవాన్ ఉవాచ

ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ।1।

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ ।2।

తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ।3।

ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ।4।

మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ ।
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః ।5।

ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః ।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ ।6।

అమానిత్వమదంభిత్వమ్ అహింసా క్షాంతిరార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ।7।

ఇంద్రియార్థేషు వైరాగ్యమ్ అనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ।8।

అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వమ్ ఇష్టానిష్టోపపత్తిషు ।9।

మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్తదేశసేవిత్వమ్ అరతిర్జనసంసది ॥ 10 ॥

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।
ఏతద్ జ్ఞానమితి ప్రోక్తమ్ అజ్ఞానం యదతోఽన్యథా ॥ 11 ॥

జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వామృతమశ్నుతే ।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥ 12 ॥

సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ 13 ॥

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ 14 ॥

బహిరంతశ్చ భూతానామ్ అచరం చరమేవ చ ।
సూక్ష్మత్వాత్ తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥ 15 ॥

అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।
భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ 16 ॥

జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥ 17 ॥

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే ॥ 18 ॥

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥ 19 ॥

కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే ।
పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥ 20 ॥

పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ ।
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు ॥ 21 ॥

ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥ 22 ॥

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥ 23 ॥

ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా ।
అన్యేసాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ 24 ॥

అన్యే త్వేవమజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే ।
తేపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ 25 ॥

యావత్సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజంగమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ తద్విద్ధి భరతర్షభ ॥ 26 ॥

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి ॥ 27 ॥

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥ 28 ॥

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాత్మానమ్ అకర్తారం స పశ్యతి ॥ 29 ॥

యదా భూతపృథగ్భావమ్ ఏకస్థమనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥ 30 ॥

అనాదిత్వాన్నిర్గుణత్వాత్ పరమాత్మాయమవ్యయః ।
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే ॥ 31 ॥

యథా సర్వగతం సౌక్ష్మ్యాత్ ఆకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే । 32 ।

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః ।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత । 33 ।

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమ్ అంతరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్ । 34 ।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగో నామ త్రయోదశోఽధ్యాయః ॥ 13 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదుమూడవ అధ్యాయము-క్షేత్ర-క్షేత్రజ్ఞ విభాగయోగము

**కేశవా! నిన్ను ఉపాసించెడు వారలు నీకు అత్యంత ప్రియముగా నుండెదరు; కాని నిర్గుణ నిరాకారమునుపాసించెడు వారలు ఎట్లుండెదరు?**

అర్జునా! వారు వివేకవంతులై యుండెదరు.

**ప్రభూ! వివేకము దేనిదై యుండును?**

పార్థా! క్షేత్రక్షేత్రజ్ఞులది. ఇదంతా (ఇదమ్ - ఇది - ఈ రూపం)తో చెప్పబడునట్టి శరీరమే క్షేత్రము. ఈ క్షేత్రము (శరీరము) నెరిగినవాడు క్షేత్రజ్ఞుడు (శరీరి) యనబడును. (13/1)

**ఆ క్షేత్రజ్ఞుని స్వరూపమెట్టిది?**

కౌంతేయా! అన్ని క్షేత్రము (శరీరము) లందు క్షేత్రజ్ఞుని (శరీరి) రూపముతో నేను వున్నానని తెలియుము.* (13/2)

**భగవన్! ఇట్లు తెలియుట యనగానేమి?**

క్షేత్రము వేరు, క్షేత్రజ్ఞుడు వేరు - అని దీనిని బాగుగా తెలియుటయే జ్ఞానమని నా మతము. అనగా క్షేత్రమునకు, జగత్తునకు ఏకత్వము గలదు. అటులే క్షేత్రజ్ఞునకు నాతో ఏకత్వము గలదు - అను దీనిని లెస్సగా అనుభవించుటయే జ్ఞానమని నా అభిప్రాయము. (13/2)

---

* ఇచట 'అన్ని క్షేత్రములలో గల క్షేత్రజ్ఞునిగా నన్ను తెలియుము.' అని చెప్పుటలో గల తాత్పర్యమేమన, ఈ శరీరము ప్రకృతి గత అంశము అందుచేత నీవు వీరి పట్ల పూర్తిగా విముఖుడవుకమ్ము. నీవు నా అంశమే కనుక నీవు నా సమ్ముఖుడవు గమ్ము. రెండవ సారాంశమేమన. నీవు క్షేత్రము (శరీరము)తో ఏకత్వము స్వీకరించిన చోటనే, నాతో ఏకత్వమును స్వీకరింపుము. ఏలననగా, నీకు శరీరముతో ఏకత్వము లేదు. నాతోనే నీకు స్వతఃసిద్ధ ఏకత్వము గలదు అని దీనిని నీవు ఎరుగుము.

క్షేత్ర, క్షేత్రజ్ఞుల జ్ఞానమునకై ఏ విషయము తెలియవలసి యుండును?

ఆరు సంగతులు తెలియుట అవసరము. క్షేత్రమును గూర్చి నాలుగు, క్షేత్రజ్ఞుని గూర్చి రెండు, ఆ క్షేత్రము ఏది, ఎట్లున్నది, ఏ వికారములు గలది, దేనిద్వారా జన్మించినది, అటులే ఆ క్షేత్రజ్ఞుడెవరు, ఎట్టి ప్రభావము గలవాడు- ఈ వివరములన్నీ నా నుండి నీవు సంక్షిప్తముగ వినుము. (13/3)

దీని విస్తారము ఎచట లభింపగలదు?

ఋషులద్వారా, వేదఋక్కులద్వారా యుక్తియుక్తమగు బ్రహ్మ సూత్రముల ద్వారా ఇయ్యది విస్తారముగ చెప్పబడినది. (13/4)

క్షేత్రమనగా నేమి?

పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, ప్రకృతి, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సు ఒకటి, యింద్రియ విషయములైదు, వెరసి ఇరువది నాలుగు తత్త్వములతో కూడినది క్షేత్రము. (13/5)

ఆ క్షేత్రము యొక్క వికారము లెవ్వి?

ఇచ్ఛా, ద్వేషము, సుఖము, దుఃఖము, శరీరము, చేతనత్వము (జీవనశక్తి) ధృతి (ధారణాశక్తి) అను నీ సప్త వికారములతో కూడిన క్షేత్రమును సంక్షిప్తముగ నేను తెలిపితిని. (13/6)

భగవన్! వికార సహితమగు క్షేత్రము ఇదంతయు - (ఈ రూపము)తో నెట్లు గోచరించును?

1. తమ శ్రేష్ఠత్వముపై అభిమానము లేకుండుట.
2. తనలో డాంబికత్వము లేకుండుట.
3. మనో వాక్కాయములతో ఎవరికీ కించిత్తు కూడా కష్టమును కల్గించ కుండుట.
4. క్షమను కలిగియుండుట.
5. శరీరము, మనస్సు, వాక్కులలో సరళత్వము.

6. జ్ఞాన సంపాదనకై గురువువద్దకు వెళ్ళి అతనికి సేవా శుశ్రూషల జేయుట.
7. శరీరము యొక్క, అంతఃకరణము యొక్క శుచిత్వమును కలిగియుండుట.
8. సాధనలో అఖండమగు దృఢత్వమును వహించుట.
9. మనో నిగ్రహము.
10. ఇంద్రియవిషయ భోగములందు వైరాగ్యము.
11. అహంకారములేకుండుట.
12. వైరాగ్యమునకై జనన, మరణ, వృద్ధావస్థలను, రోగములందు దుఃఖ రూపమగు దోషముల కారణములను పరిశీలించుట.
13. ఆసక్తిరహితముగ నుండుట.
14. స్త్రీ పుత్ర గృహాదులందు నిమగ్నము గాకుండ నుండుట.
15. అనుకూల ప్రతికూలముల ప్రాప్తియందు సదా సమముగా నుండుట.
16. సంసారము నుండి ఉపరతి మరియు నా యందు అనన్యయోగముతో అవ్యభిచారిణి భక్తిని కలిగియుండుట.
17. ఏకాంత ప్రదేశమున నుండెడు స్వభావమును కలిగియుండుట.
18. జనసముదాయము నందు ప్రీతి లేకుండుట.
19. పరమాత్మ అస్తిత్వమును నిరంతరము మననము జేయుట.
20. పరమాత్మను సర్వత్రా దర్శించుట.

ఇట్టి ఇరువది సాధనములతో శరీరము "ఇదం" అను భావంతో గోచరించుచుండును. శరీరమును 'ఇది' యని చూచుటయే జ్ఞానము, దానిని తన స్వరూపముగా చూచుటయే అజ్ఞానము. (13/7-11)

**క్షేత్రక్షేత్రజ్ఞ జ్ఞానముతో లభించెడు తత్త్వమేమిటి?**

జ్ఞేయతత్త్వము. దేనిని తెలియుట వలన అమరత్వము లభించునో, అట్టి జ్ఞేయతత్త్వమును నేను చెప్పెదను. (13/12)

ఆ తత్త్వ స్వరూప మేమిటి?

ఆది ఆద్యంతరహితము. అదియే పరబ్రహ్మము. అది 'సత్' అని చెప్పజాలము అటులే 'అసత్' అని కూడా చెప్పజాలము.* (13/12)

అయినను అది ఎట్లున్నది ప్రభూ?

అర్జునా! అది అంతటా చేతులు, కాళ్ళు గలదిగా, సర్వత్రా నేత్రములు, శిరస్సులు, ముఖములను గలదిగా, అంతటా చెవులు గలదిగా నున్నది. అది అంతటా వ్యాపించియున్నది. అది సకలేంద్రియములతో రహితమైనది. సంపూర్ణ ఇంద్రియముల విషయములను ప్రకాశింపచేయునది, ఆసక్తి రహితమైనది, సంపూర్ణ జగత్తును భరించునది, పోషించునది. అంతేగాక, అది గుణ రహితమై యుండి, గుణముల భోక్తయై యున్నది. (13/13-14)

ఒకే తత్త్వమునందు పరస్పర విరోధ లక్షణము లెట్లుండును?

అనేక విరోధభావములు ఆ ఒక్కదానిలోనే ఇమిడిపోవును. యిక దానిలో విరోధమే ఉండదు. ఏలయన, స్థావరజంగమాది సకల ప్రాణుల వెలుపల కూడా అదే ఉన్నది. లోపలకూడా అదియే యున్నది. చరాచర ప్రాణుల రూపములో కూడా అదే ఉన్నది అనగా అది గాకుండా వేరొక సత్తాయే లేదు. దూరములో అతి దూరమై యున్నది యిక దగ్గరలో మిక్కిలి దగ్గరగా కూడా అదే ఉన్నది.** అది అత్యంత సూక్ష్మమనుటచేత అవిజ్ఞేయము అనగా

---

* ఆ తత్త్వమును సత్-అసత్ అని చెప్పలేము. కారణమేమన, అసత్ భావన (సత్తా) లేకుండా 'సత్' అని కూడా చెప్పలేము. 'అసత్' అసలే ఉండదు. అందుచేత ఆ తత్త్వమును 'సత్' అని కూడా చెప్పలేము. ఆ పరమాత్మ తత్త్వము ఎప్పుడునూ అభావమగునది కాదు, అందువలన దాని 'అసత్' అని కూడా చెప్పజాలము. కనుక ఆ తత్త్వమునందు సత్ - అసత్ శబ్దముల అనగా వాక్ ప్రవృత్తి కలుగనే కలుగనటువంటి నిరపేక్షమైనది పరమాత్మతత్త్వము అని తాత్పర్యము.

** దూరము, సమీపము మూడు విధములుగా నుండును - దేశకృతము, కాలకృతము వస్తుకృతము. దేశముద్వారా - దూరాతి దూరముగను; సమీపమునందలి సమీపమైన (ప్ర)దేశము నందు కూడా అదియే కలదు.

ఇంద్రియములకు, అంతఃకరణమునకు విషయము కాదు. అందువలన దానిలో విరోధమే లేదు. (13/15)

**భగవన్! దానిలో ఏల విరోధము లేదు?**

అది విభాగరహిత మవుతూ కూడా అనేక విభాగములుగల ప్రాణుల (వస్తువుల)లో విభక్తమైనట్లుగా నున్నది. ప్రాణులనన్నింటికిని ఉత్పత్తి, స్థితి, సంహార రూపమైనది కూడా అదియే. దానిని తెలియవలయును. (13/16)

**దానినెట్లు తెలియవలెను?**

ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగునవన్నియు, వానిద్వారా కలిగెడు జ్ఞానమంతయు, దాని ద్వారానే ప్రకాశితమగును. కనుక అది సంపూర్ణ జ్యోతులకు (జ్ఞానములకు) జ్యోతి (ప్రకాశకము) వంటిది. దాని యందు అజ్ఞానము ఎంతమాత్రము లేదు. అది జ్ఞానస్వరూపము. తెలియదగినది కూడా నదియే. జ్ఞానమువల్లనే (తెలిసినంతలోనే) అది పొందబడును. అనగా జ్ఞానము వినా దానిని తెలియుటకు వేరొండు ఉపాయములేదు. అందరి హృదయములలో అది విరాజిల్లుచున్నది. (13/17)

**ఇంకనూ ఏమేమి తెలియవలెను. దానిని తెలియు మాహాత్మ్యమేమి?**

క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయము ఈ మూడింటిని తెలియాలి. ఈ మూడింటిని బాగుగా నెఱిగిన నా భక్తుడు నా భావమును పొందగలుగును అనగా - 'వాసుదేవస్సర్వమ్' అను తత్త్వప్రాప్తి నొందును. (13/18)

---

కాలము ద్వారా - మున్ముందుగా అదియే యుండెను. పూర్తి చివరగా కూడా అదే ఉండును. ఇప్పుడు కూడా అదియే ఉన్నది. వస్తువుద్వారా - వస్తువులన్నింటికంటే ముందుగా కూడా అదే ఉన్నది. చివర కూడా ఉన్నది. వస్తువుల రూపములో కూడా అదియే ఉన్నది. అందువలన అది అతిదూరముగను, మిక్కిలి సమీపముగను ఉన్నది. ఈ శ్లోక విషయమును బాగుగా నెరిగిన మీదట, దీని భావమును మననము చేసిన పిమ్మట మనిషి ఏ వ్యవహారములో నున్నాసరే, ఏకాంతములో నున్నాసరే, ఎలాంటి పరిశ్రమ, కృషి చేయకుండానే దీని భావము యొక్క జాగృతి అతనిలో సహజముగనే నిలిచివుండును. ఈ శ్లోకము ఈ ప్రకరణమునకు సారము వంటిది.

**ఇప్పుడే మీరు భక్తునికొరకై క్షేత్రము, జ్ఞానము (జ్ఞాన ప్రాప్తికైన సాధనము) జ్ఞేయతత్త్వమును వర్ణించితిరి. జ్ఞానమార్గమును మాత్రమే కోరుకొనుసాధకుడు, తప్పకుండా తెలియవలసినదేమిటి?**

ప్రకృతి, పురుషుల వివేకము అతనికి తప్పక అవసరము. వీనిని వేరు వేరుగా తెలియాలి. ప్రకృతి, పురుషులు ఈ రెండును అనాదిగా నున్నవి.

**ఈ రెండూ అనాది యైనచో, గుణ, వికారములతో కూడిన జగత్తు దేనివలన ఉత్పన్నమైనది?**

ప్రకృతివలన గుణములు, వికారములు జనించుచున్నవి. అయితే కార్యకరణముల ఉత్పన్నమునకు హేతువు ప్రకృతి యగుచున్నది.

**ప్రభూ! పురుషుడు దేనికి హేతువగుచున్నాడు?**

సుఖదుఃఖములను అనుభవించుటకు పురుషుడు కారణ మగుచున్నాడు. (13/19-20)

**పురుషుడు అనుభవించుటకు కారణముగా ఎప్పుడగును?**

ప్రకృతియందు స్థితుడగుటవల్లనే పురుషుడు గుణముల ననుభవించు చున్నాడు. ఇట్టి గుణముల యందు (సంగము) ఆసక్తి కలుగుట చేతనే మంచి-చెడు యోనులందు జన్మించును. (13/21)

**ఓ మహానుభావా! ఆ పురుషుని స్వరూపము ఎట్టిది?**

ఆ పురుషుడు - ప్రకృతి కార్యమగు శరీరముతో సంబంధము కలిగి యుండుటవలన ఉపద్రష్ట (చూచువాడు, సాక్షి)గా, దానితో కలిసిపోయి సమ్మతించుట చేత అనుమంతగా, తనను వాని భరణ, పోషణముల జేయువానిగా తలంచుటచే భర్తగా, వాని సంగముతో సుఖదుఃఖములను అనుభవించుటచే భోక్తగా, తనను వానికి యజమానిగా భావించుటచే మహేశ్వరునిగా అగుచున్నాడు. కాని అతడు వాస్తవముగా స్వరూపముతో 'పరమాత్మ' అనియే చెప్పబడుచున్నాడు. అంతేగాక, ఈ దేహమునందు ఉన్నప్పటికి కూడా అతడు దేహమునకు అతీతుడుగానే ఉండును.(13/22)

**ఈవిధంగా ప్రకృతి, పురుషుల స్వరూపమును తెలియుటచే ఏమగును, భగవన్?**

ఈ విధముగా గుణసహిత ప్రకృతిని, గుణరహిత పురుషుని చక్కగా తెలిసికొనిన మీదట అన్నివిధముల వ్యవహరింపుచు (విహిత కర్మలను ఆచరించుచు) కూడా అతడు తిరిగి జన్మింపడు. (13/23)

**అట్టి పురుషుని తెలియుటకు ఇంకనూ ఏదేని ఉపాయమున్నదా?**

లేకేమి, కొందరు ధ్యానయోగము ద్వారా, మరికొందరు సాంఖ్యయోగము ద్వారా, ఇంకొందరు కర్మయోగము ద్వారా తమంతట తామే, తమలోనే తమ (స్వ) స్వరూపమును తమద్వారా తెలియుదురు. (13/24)

**ఇంకనూ ఏదేని సులభోపాయము కలదా?**

ఉన్నది, ధ్యాన, యోగ, సాంఖ్య యోగాది సాధనముల నెరుగనివాడు జీవన్ముక్తులగు మహాపురుషుల ఆజ్ఞాపరాయణులై వారు కూడా మృత్యువును దాటెదరు. అనగా ముక్తులగుదురు. (13/25)

**వారలు మృత్యువును ఎట్లు దాటిపోయెదరు ప్రభూ?**

అర్జునా! పుట్టుచున్న ప్రాణులన్నీ కూడా క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగము చేతనే పుట్టుచున్నవి. కాని క్షేత్రముతో తన సంబంధమును సమ్మతింపని వారలు మాత్రమే ముక్తులయ్యెదరు. (13/26)

**ఈ (క్షేత్రక్షేత్రజ్ఞ) సంయోగమునుండి బయటపడుటకు మనుష్యుడు ఏమి చేయవలెను?**

కౌంతేయా! ముఖ్యముగా చేయవలసినవి రెండు. స్వయముగా పరమాత్మ తత్త్వమును ఎఱుగుట, ప్రకృతి (శరీరము)తో సంబంధమును వదలుకొనుట.

తన స్వస్వరూపమునందు పరమేశ్వరుని చూచినవాడే నిజమైన ద్రష్ట అనగా అతనికే వాస్తవముగా ఆత్మ (పరమాత్మ) తత్త్వము అనుభవములోనికి వచ్చును. ఆ పరమాత్మ నానారూపాత్మకమైన ఈ (విషమ) జగత్తున సమభావముతో స్థితుడైనవాడు, అనిత్యమైనవాటిలో నిత్యుడైనవాడు.

సర్వత్ర సమానముగా పరిపూర్ణుడైన పరమాత్మతో ఏకత్వము కలుగుటచే శరీరముతోగల తాదాత్మ్యము అభావమగును. అప్పుడు శరీరము నశించినను

తాను నశించినట్లు అతడు భావింపడు. కనుక అతడు ఆత్మహంతకుడు కాడు. అతడు పరమగతిని (పరమాత్మను) పొందును. (13/27-28)

**నీవు పరమాత్మ తత్త్వమును తెలిసికొను విషయమునైతే తెల్పితివి. కాని ప్రకృతి (శరీరము)తో సంబంధమును వదలుకొనుట ఎట్లో తెల్పుము?**

క్రియలన్నియు ప్రకృతిద్వారా మాత్రమే జరుగును - అను జ్ఞానము కలిగినప్పుడు అతనిలో కర్తృత్వ భావము అడుగంటును. సమస్త ప్రాణుల వేర్వేఱు భావములు (శరీరములు) ఒకే ప్రకృతియందు స్థితమైనవిగాను, ప్రకృతి నుండియే ఉత్పన్నమైనవిగాను తెలిసినప్పుడు బ్రహ్మజ్ఞానము (బ్రహ్మప్రాప్తి) కలుగును. అప్పుడు అతనికి ప్రకృతితో ఎట్టి సంబంధమూ ఉండదు. (13/29-30)

**అచ్యుతా! ఈ విధంగా ఎందుకు జరుగును?**

కుంతీపుత్రా! అవినాశియగు పురుషుడు స్వయంగా అనాదియగుటచే, గుణరహితుడగుటచే శరీరము నందు ఉండి కూడా వాస్తవమునకు కర్తగా, భోక్తగా నుండడు. (13/31)

**అతడు ఎట్లు భోక్త గాకుండును?**

ఆకాశము అంతటా వ్యాపించి యుండి కూడా ఎప్పుడూ అంటకుండా నుండినట్లుగానే, పురుషుడు సర్వత్రా నిండియుండి కూడా ఎప్పుడునూ, దేనిలోనూ కించిన్మాత్రమైనను అంటుకొనక యుండును. (13/32)

**హే భగవన్! మరి కర్తగా ఎట్లు గాకుండును?**

సూర్యుడు ఒక్కడే సంపూర్ణ విశ్వమును ప్రకాశింప జేయుచున్నట్లుగా క్షేత్రజ్ఞుడు, సంపూర్ణ క్షేత్రమును ప్రకాశింపజేయును. కాని అతడు ప్రకాశక మాత్రుడగును. ఈ విధంగా జ్ఞాననేత్రముల ద్వారా క్షేత్రక్షేత్రజ్ఞుల భేదమును* యథార్థముగా గ్రహించిన వారు, కార్య, కారణ (ప్రకృతి) సహితముగా సంపూర్ణజగత్తు నుండి తనను వేరుగా అనుభవించిన వారలు, పరమపదమును పొందెదరు. (13/33-34)

**'క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము' అనెడు పదమూడవ అధ్యాయము ముగిసెను.**



* క్షేత్రమును జడము, వికారి, క్షణికము, నశ్వరమనియు, క్షేత్రజ్ఞుని చేతనుడు, అవికారి, నిత్యుడు, అవినాశియని తెలియుటయే వాని భేదమును తెలియుట యగును.

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునాల్గవ అధ్యాయము - గుణత్రయవిభాగయోగము

శ్రీభగవాన్ ఉవాచ

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।
యద్ జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః ।1।

ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।
సర్గేఽపి నోపజాయంతే ప్రలయే న వ్యథంతి చ ।2।

మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।
సంభవః సర్వభూతానాం తతో భవతి భారత ।3।

సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః ।
తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా ।4।

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః ।
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ।5।

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమనామయమ్ ।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ ।6।

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్ ।7।

తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।
ప్రమాదాలస్యనిద్రాభిః తన్నిబధ్నాతి భారత ।8।

సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ।
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత ।9।

రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।
రజఃసత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజస్తథా । 10 ।
సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే ।
జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత । 11 ।
లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా ।
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ । 12 ।
అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన । 13 ।
యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్ ।
తదోత్తమవిదాం లోకాన్ అమలాన్ ప్రతిపద్యతే । 14 ।
రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే ।
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే । 15 ।
కర్మణః సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।
రజసస్తు ఫలం దుఃఖమ్ అజ్ఞానం తమసః ఫలమ్ । 16 ।
సత్త్వాత్ సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ । 17 ।
ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః । 18 ।
నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి । 19 ।
గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖైః విముక్తోఽమృతమశ్నుతే । 20 ।

అర్జున ఉవాచ

కైర్లింగైః త్రీన్ గుణానేతాన్ అతీతో భవతి ప్రభో ।
కిమాచారః కథం చైతాన్ త్రీన్ గుణానతివర్తతే । 21 ।

శ్రీభగవాన్ ఉవాచ

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి । 22 ।

ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే । 23 ।

సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।
తుల్యప్రియాప్రియో ధీరః తుల్యనిందాత్మసంస్తుతిః । 24 ।

మానావమానయోస్తుల్యః తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే । 25 ।

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే । 26 ।

బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమ్ అమృతస్యావ్యయస్య చ ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ । 27 ।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయవిభాగయోగో నామ చతుర్దశోఽధ్యాయః ॥ 14 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునాల్గవ అధ్యాయము-గుణత్రయ విభాగయోగము

శ్రీభగవానుడిట్లు చెప్పెను - మననశీలురగు పురుషులందరు దేనిని తెలిసికొని పరమసిద్ధిని పొందియున్నారో, అట్టి జ్ఞానము లన్నింటిలోకెల్లా అత్యుత్తమమైన జ్ఞానమును ఇంకనూ తెలిపెదను. (14/1)

**కృష్ణా! ఆ జ్ఞానమునకు ఇంకనూ ఎటువంటి మహిమ గలదు?**

ఈ జ్ఞానమును ఆశ్రయించి నా స్వరూపమును పొందినవారు సృష్ట్యాదియందు కూడా తిరిగి జన్మింపరు. అటులే మహా ప్రళయము నందైననూ వ్యథజెందరు. (14/2)

**కృష్ణా! మహాసృష్టియందు ఈ జగత్తు ఎట్లు ఉత్పన్నమగుచున్నది?**

భారతా! నా మూల ప్రకృతి ఉత్పత్తిస్థానము. నేను దానియందు (బీజము) చేతనరూపమగు జీవుని స్థాపించెదను. తద్వారా సర్వప్రాణులు ఉత్పన్నమగును. కావున వేరు, వేరు యోనులలో ఉత్పన్నమగు ప్రాణులన్నింటి ఉత్పత్తియందు, తల్లి స్థానము నందు నా మూల ప్రకృతి గలదు. బీజమును స్థాపించుటలో తండ్రిస్థానమునందు నేను ఉన్నాను.

(14/3-4)

**జీవులన్నింటికి తండ్రి తమరేకదా! మరైతే ఆ జీవులు బంధనములో ఎందుకు చిక్కుకొందురు?**

కుంతీపుత్రా! సత్త్వము, రజస్సు, తమస్సు - అను నీ మూడు గుణములు ప్రకృతి నుండి జనించును. అయితే ఈ మూడు గుణములే అవినాశియగు దేహిని గుణ సాంగత్యమువలన శరీరమునందు బంధించి వేయును.(14/5)

**భగవన్! సత్త్వగుణ స్వరూపమెట్టిది? అది దేహిని దేహమునందెట్లు బంధించును?**

అర్జునా! ఈ మూడు గుణములలో సత్త్వగుణము సహజముగ నిర్మలమైనది, ప్రకాశవంతమైనది, వికార రహితమైనది కాని అది సుఖము, జ్ఞానము లందలి ఆసక్తి, అభిమానము వలన దేహిని బంధించివేయును.

(14/6)

**రజోగుణము ఎట్లుండును? అదెట్లు దేహిని బంధించును?**

కుంతీపుత్రా! తృష్ణ, ఆసక్తి వలన రజోగుణము జనించును. అది రాగ స్వరూపమైనది. అది కర్మల యందలి ఆసక్తి చేత దేహిని బంధించుచున్నది. (14/7)

**కృష్ణా! తమోగుణ స్వరూప మెట్లుండును? అదెట్లు బంధించగలదు?**

తమోగుణము అజ్ఞానమువలన ఉత్పన్నమగును. ప్రాణులన్నింటిని అది మోహింపజేయును. నిర్లక్ష్యము, సోమరితనము, నిద్ర మొదలగు వానిచే దేహిని బంధించి వేయును. (14/8)

**బంధించుటకు ముందు ఈ మూడు గుణములేమి చేయును?**

సత్త్వగుణము ప్రాణిని సుఖము నందు నియోగించి తన అధికారమును కల్గియుండును. రజోగుణము కర్మయందు నిలిపి తన బలమును చూపించును. ఇక చివరిదైన తమోగుణమేమో ప్రాణియందలి జ్ఞానమును కప్పివైచి, నిర్లక్ష్యము, అశ్రద్ధకు గురిచేసి తన అధికారమును చూపించును. (14/9)

**హే ప్రభో! ఈ మూడు గుణములు జీవులయందు ఒక్కొక్కటి తమ అధికారమును ఎట్లు చూపించగలవు?**

రజోగుణమును, తమోగుణమును అణచివేసి సత్త్వగుణము వృద్ధిచెందును. తమోగుణము, సత్త్వగుణమును అణగద్రొక్కి రజోగుణము ఆధిక్యతను చూపించును. ఇక సత్త్వగుణమును, రజోగుణమును అణచివేసి తమోగుణము తన అధికారమును చేజిక్కించుకొనును. (14/10)

**కృష్ణా! సత్త్వగుణము వృద్ధి చెందినదని తెలియుట ఎట్లు?**

ఇంద్రియములన్నింటిలో స్వచ్ఛత, వివేకశక్తి వికసించినప్పుడు సత్త్వగుణము వృద్ధి నొందినదని తెలియవలెను. (14/11)

**స్వామీ! వృద్ధినొందిన రజోగుణ లక్షణములెట్లుండును?**

అంతఃకరణములో ధనాదులయందు లోభత్వము, క్రియా ప్రవృత్తి, ఆసక్తి పూర్వకంగా క్రొంగ్రొత్త కర్మలను ఆరంభించుట, అశాంతిని కలిగియుండుట, స్పృహ ఇత్యాది వృత్తులు అనగా విషయ భోగములందు కోరిక జనించుట ఇవన్నియునూ రజోగుణము పెరిగిపోయినదని తెలిపెడు లక్షణములు. (14/12)

**ఇక తమోగుణము పెరిగిపోయినచో గుర్తించుట ఎట్లు?**

ఇంద్రియముల ద్వారా తమ-తమ విషయములను తెలియదగు వృత్తి లేకపోవుట, ఏ పనిని చేయుటకు ఇష్టపడకుండుట, కర్తవ్యకర్మను చేయకుండుట, వ్యర్థ చేష్టలయందు (మనస్సు) మునిగిపోవుట, సోమరితనము, నిద్రవంటి మోహవృత్తులు జనించుట, ఇన్ని లక్షణములు కలిగినప్పుడు తమోగుణము పెరిగిపోయినదని గుర్తింపుము. (14/13)

**గుణములు వృద్ధిచెందిన వేళ మరణించిన వాని గతి ఏమిటి?**

సత్త్వగుణ వృద్ధియందు మరణించిన ప్రాణి ఉత్తమలోకములకేగును. రజోగుణము పెరిగినవేళ మరణించిన ప్రాణి మనుష్య యోనిలో జన్మించును. తమోగుణము వృద్ధినొందిన వేళ మరణించిన ప్రాణి పశు, పక్షి, కీటకాది మూఢ యోనులలో పుట్టుచుండును. (14/14-15)

**ప్రభూ! ఈ గుణాలవలన ఇలాంటి గతులు ఏల కలుగును?**

గుణముల వృత్తుల ననుసరించి కర్మలు జరుగుచుండుటయే దీనికి కారణము. అందువలన సాత్త్విక కర్మయొక్క ఫలము నిర్మలముగా నుండును. రాజసకర్మకు ఫలము దుఃఖము లభించును. అటులే తామస కర్మకు ఫలము అజ్ఞానము కలుగును. తాత్పర్యమేమన - సాత్త్వికాది గుణముల వృత్తులయొక్క ఫలములు ఎట్లుండునో, అట్లే సాత్త్వికాది కర్మలకు కూడా ఫలము లుండును. (14/14-16)

**వృత్తులకు, కర్మలకు మూలమెవరు?**

మూడు గుణములు, సత్త్వగుణము వలన జ్ఞానము కలుగును. రజోగుణము వలన లోభమేర్పడును. ఇక తమోగుణముచేత మోహము, నిర్లక్ష్యము, అజ్ఞానము జనించును. (14/17)

**వాసుదేవా! ఈ మూడు గుణములలో నున్నవారికి ఏ, ఏ గతి లభించును?**

సత్త్వగుణము నందు స్థితులైనవారలు స్వర్గాది పైలోకములకు వెళ్ళెదరు. రజోగుణము నందుండువారలు మానవలోకము నందు జన్మించెదరు.

నిందనీయమగు తమోగుణము నందు స్థితులైనవారలు నరకముల వంటి అధోగతి పొలగుదురు. (14/18)

**ఈ మూడు గుణములకు అతీతముగా నుండుటకేమి చేయవలెను కృష్ణయ్యా!**

త్రిగుణముల జోక్యముతోనే కర్మలు జరుగుచుండును. కాని ఇందులో వేరొక కర్తలేడని చూచుచు వాడు తనను గుణములకు అతీతముగా అనుభవించును. అప్పుడతడు త్రిగుణములకు అతీతమైన నా భావమును అనగా సచ్చిదానంద ఘన స్వరూపమగు పరమాత్మ భావమును పొందును. (14/19)

**ప్రభూ! మీ భావమును పొందగలుగు తీరేది?**

వివేకవంతుడగు ఆ పురుషుడు దేహము ఉత్పన్నమగుటకు కారణరూపమగు మూడు గుణములను అతిక్రమించిపోయి, దేహముతో జనించెడు జన్మ, మృత్యు, జరాదుఃఖములచే ముక్తుడైపోవును. అందువలన అతడు అమరత్వమును అనుభవించును. (14/20)

**అప్పుడు అర్జునుడిట్లు ప్రశ్నించెను - ఓ ప్రభూ! గుణాతీతుడగు పురుషుడు ఎట్టి లక్షణములను గలిగియుండును?**

మిత్రమా! గుణాతీతుడగు పురుషుడు సత్వగుణ కార్యరూపమైన ప్రకాశమును, రజోగుణ కార్యరూపమగు ప్రవృత్తిని, తమోగుణ కార్యరూపమగు మోహమును - ఈ వృత్తులలో ఏర్పడినప్పుడు, వానిని ద్వేషింపకుండును. ఇవి తొలగిపోయినప్పుడు, వానిని కాంక్షింపకుండును. అంతియేగాక గుణముల ప్రభావమునకు చలించకుండా, ఉదాసీనుడై, సాక్షివలె నుండును. గుణములే గుణములందు వర్తించుచున్నవని తలంచును. అందుచేత స్వయంగా చేష్టారహితుడై స్వస్వరూపమునందు స్థితుడై యుండును. అతడెన్నడూ ఇట్టి స్థితి నుండి వైదొలగిపోవడు. (14/22-23)

**ఓ అచ్యుతా! ఇట్టి గుణాతీతుడగు వాని ఆచరణ ఎట్లుండును?**

గుణాతీతుని ఆచరణ సమతా పూర్వకముగా నుండును. అతడు తన

(స్వ) స్వరూపమునందు నిత్యస్థితుడై యుండును. అతడు సుఖదుఃఖములను సమానముగా తలంచును. మట్టిని, రాయిని, బంగారమును సమముగా జూచును. ప్రియమును, అప్రియమును ఒకటిగా నెంచును. ఆత్మ నిందను, స్తుతిని సైతము సమముగా లెక్కించును. మానావమానములయందు సమానభావము కలిగియుండును. శత్రుమిత్రుల యెడ సమబుద్ధిని కలిగియుండును. ఇంకనూ సర్వకర్మల ఆరంభత్యాగిగా అనగా కర్తృత్వాభిమానమును త్యజించి వేయును. ఈ విధమైన ఆచరణ కలిగినవాడే గుణాతీతుడని చెప్పబడును. (14/24-25)

**అయితే కృష్ణా! గుణాతీతుడగుటకు గల ఉపాయమేమి?**

పార్థా! అనన్యమైన భక్తియోగముచేత నన్ను నిరంతరము భజించుటయే ఇందుకు ముఖ్యోపాయము. ఇట్టివాడు మూడు గుణములను అతిక్రమించిపోయి సచ్చిదానందఘన బ్రహ్మప్రాప్తికి యోగ్యుడగును. (14/26)

**ఓ కృష్ణా! భజించేది నిన్ను మరి, యోగ్యత కలిగేది బ్రహ్మప్రాప్తికి, ఇదెట్లు కుదురుతుంది, తండ్రీ?**

బావా! పరబ్రహ్మమును, అవినాశియగు అమృతమునకు, సనాతన ధర్మమునకు, అఖండరూపమగు ఆనందమునకు నేనే ఆశ్రయమై యున్నాను. అనగా ఇవన్నియును నేనే, నా పేర్లే అని తెలిసికొనుము. (14/27)

'గుణత్రయ విభాగయోగము' అనెడు
పదునాలుగవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునైదవ అధ్యాయము - పురుషోత్తమప్రాప్తి యోగము

శ్రీభగవాన్ ఉవాచ

ఊర్ధ్వమూలమధశ్శాఖమ్ అశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ।1।

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాలాః ।
అధశ్చమూలాన్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే ।2।

న రూపమస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।
అశ్వత్థమేనం సువిరూఢమూలమ్
అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ।3।

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివర్తంతి భూయః ।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ।4।

నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।
ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైః
గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్ ।5।

న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ।6।

మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః ।
మనఃషష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ।7।

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్ ।8।

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ।9।

ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్ ।
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః ।10।

యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్ ।
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః ।11।

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ।12।

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా ।
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ।13।

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ।14।

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాంతకృద్వేదవిదేవ చాహమ్ ।15।

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే । 16 ।

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః । 17 ।

యస్మాత్ క్షరమతీతోఽహమ్ అక్షరాదపి చోత్తమః ।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః । 18 ।

యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత । 19 ।

ఇతి గుహ్యతమం శాస్త్రమ్ ఇదముక్తం మయానఘ ।
ఏతద్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత । 20 ।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమయోగోనామ పంచదశోఽధ్యాయః ॥ 15 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునైదవ అధ్యాయము-పురుషోత్తమప్రాప్తియోగము

బ్రహ్మ, అవినాశియగు అమృతము మొదలగు వానికి ఆధారము, ఆశ్రయము తమరే అయినప్పుడు ఈ జగత్తునకు ఆధారము, ఆశ్రయము ఎవరు, ప్రభూ?

భగవానుడిట్లనెను - ఈ జగత్తునకు మూలము, ఆధారము, ఆశ్రయమును నేనే. జగద్రూపమగు వృక్షము పైకి మూలమును గలిగి, క్రిందికి కొమ్మలను గలిగియున్నది. రేపటి వరకు కూడా స్థిరముగా నుండని కారణముచేత దీనిని 'అశ్వత్థ'మని యందురు. దీని ఆద్యంతములు తెలియకుండుట వలన, ప్రవాహ రూపముతో నిత్యముండుట వలన - దీనిని "అవ్యయము" అని అందురు. వేదములందు పేర్కొనిన సకామ అనుష్టానముల వర్ణనయే ఈ వృక్ష పత్రములని చెప్పబడినది. ఈ సంసార వృక్ష తత్త్వమును యథార్థముగా నెరిగినవాడే వాస్తవమునకు వేదములను తత్త్వముతో తెలిసినవాడగును. (15/1)

ఈ సంసార వృక్షము ఇంకనూ ఎట్లున్నది, తండ్రీ?

ఈ సంసారవృక్షము సత్త్వము, రజస్సు, తమస్సు - అను నీ మూడు గుణములద్వారా పెరిగియున్నది. దీని కొమ్మలు క్రింద, మధ్య, పైన గల అన్ని లోకములకు వ్యాపించియున్నవి. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడు ఐదు విషయములే ఈ వృక్షమునందు గల చిగుళ్ళు. ఇట్టి విషయములను చింతించుటచే కొంగ్రొత్త చిగుళ్ళు జనించుచుండును. అయితే ఈ మనుష్య లోకమే ఈ వృక్షము యొక్క శాఖలకు మూలము ఏలయన, ఈ మనుష్య లోకమునందు చేయబడిన కర్మల ఫలములే అన్ని లోకములందు అనుభవింప బడునుగదా! (15/2)

ఈ వృక్ష స్వరూపమెట్టిది?

ఈ సంసారవృక్షము జనులు చూచుటకు సత్యముగా, సుందరముగా కన్పట్టును. కాని అట్టి రూపమును ఎంతగా ఆలోచించినను అంతుచిక్కదు. ఏలయన దానికి ఆద్యంతములు లేవు, స్థితియునూ లేదు. (15/3)

**అయినచో దీనితో సంబంధమును (తెంచుకొనుటకు) మనుష్యుడు ఏమి చేయవలెను?**

అహంకార మమకార, కామనా (వాసనా) రూపమగు శాఖలతో దృఢమైన మూలము గలిగినది ఈ సంసారవృక్షము. దీనిని అసంగశస్త్రము అనగా దృఢవైరాగ్యముతో ఖండించవలెను. అనగా దీనితో సౌఖ్యము నొందవలెననెడు కోరికను త్యజించి, ఆ పరమపదమును వెదుక వలయును. (15/4)

**వెదకలేకపోయినచో ఏమి చేయవలెను?**

ఎవనిని పొందిన మీదట మనుష్యుడు తిరిగి సంసారమున బడకుండునో, ఎవనిచేత ఈ సృష్టి అనాది కాలముగా విస్తరించి యున్నదో, అట్టి ఆది పురుషుడైన పరమాత్మను శరణు బొందవలయును. (15/3-4)

**శరణు బొందుటచే నేమగును?**

శరణుబొందినవారలు మానమోహములతో రహితులయ్యెదరు. ఆసక్తి లేకుండుట వలన కోర్కెలు పూర్తిగా నశించిపోవును. తత్ఫలితంగా వారు కేవలము పరమాత్మయందే నిలచియుందురు. అందువలన సుఖదుఃఖాది ద్వంద్వములచే విడువబడినవారై అవినాశియగు పరమపదమును పొందెదరు. (15/5)

**భగవన్! అవినాశి యగు పదమెట్లున్నది?**

ఆ పరమపదమును సూర్యుడు కాని, చంద్రుడు కాని, అగ్నికాని, ప్రకాశింప జేయజాలరు. అచటికి చేరుకొనిన మీదట వెనుతిరిగి రావలసిన పనిలేదు. అదియే నా పరమధామమని యెరుంగుము. (15/6)

**వెనుతిరిగి ఏల రాలేరు స్వామీ?**

సనాతనమైన ఈ జీవాత్మ నా అంశమే. కావున నన్ను పొందిన మీదట అది తిరిగిరాదు. కాని పొరబాటుగా ప్రకృతి కార్యములగు ఇంద్రియములను, మనస్సును తనవిగా భావించును. కనుక పునర్జన్మ కలుగును. (15/7)

**ఇంద్రియాదులను తనవిగా భావించుట చేత నేమగును?**

వాయువు గంధము (వాసన) గల స్థానము నుండి గంధమును గ్రహించి

వెడలు విధముగా ఇంద్రియాదులకు యజమానిగా భావించిన జీవుడు విడిచి పెడుతున్న శరీరము నుండి మనస్సుతో బాటుగా ఇంద్రియములను గ్రహించి తిరిగి తాను పొందెడు శరీరమునందు వీనితోబాటుగా ప్రవేశించును. అనగా పుట్టుతూ - గిట్టుతూ ఉండును. (15/8)

**భగవన్! అతడు అక్కడ ఏమి చేయును?**

అక్కడ (ఆ దేహమునందు) జీవుడు మనస్సును ఆశ్రయించి కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము - అను నీ పంచేంద్రియముల ద్వారా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడు ఐదు విషయములను రాగపూర్వకముగా అనుభవించును. (15/9)

**రాగపూర్వకంగా విషయములను అనుభవించుట చేత ఏమగును, ప్రభూ?**

జన్మించుచు, మరణించుచు, ఉన్నప్పుడు భోగములను అనుభవించు చున్నప్పుడు కూడా ఈ జీవాత్మ స్వరూపముతో నిర్లిప్తముగనే ఉండును. రాగపూర్వకంగా విషయములను సేవించెడు మూఢజనులు దీనిని తెలియ జాలరు. (15/10)

**అయినచో మరి ఎవరు ఎరుగుదురు?**

జ్ఞాననేత్రములు గలిగిన వివేకవంతులు మాత్రమే ఎరుగుదురు. (15/11)

**భగవన్! ఎవరి జ్ఞాననేత్రములు తెరుచుకొనును, ఎవరివి తెరుచు కొనలేవు?**

తమ అంతఃకరణమును పరిశుద్ధమొనర్చుకొనిన వారు తమలో తామై యున్నట్టి (ఆత్మ) తత్త్వమును తెలియుదురు. అనగా వారి జ్ఞాననేత్రములు విప్పుకొనును. ఇక అంతఃకరణము శుద్ధముగా చేసికొనని వారు ఎంత ప్రయత్నించినప్పటికినీ ఆత్మతత్త్వమును తెలియజాలరు అనగా వారి జ్ఞాన నేత్రములు తెరుచుకొనలేవు. (15/11)

**కృష్ణా! తనలో తానై యున్న తత్త్వమేమిటి?**

నేను సూర్యునిలో, చంద్రునిలో, అగ్నిలో తేజోరూపముతో నిలిచియుండి సమస్త విశ్వమును ప్రకాశింప జేయుచున్నాను. అటులనే అన్నింటి, అందరిలోపల కూడా నేనే ఉన్నాను. (15/12)

**స్వామీ, తమరు ఇంకనూ ఏమి చేయుదురు?**

నేనే పుడమిలో ప్రవేశించి నా ఓజస్సు - శక్తి చేత సమస్త ప్రాణులను ధరించుచున్నాను. అంతేగాదు రసమయుడగు చంద్రుడనై ఓషధులను అనగా వనస్పతులను పోషించుచున్నాను. (15/13)

**తమరు ఇంకనూ ఏదేని పని నిర్వహించెదరా, ప్రభూ?**

అర్జునా! ఔనాను! ప్రాణము, అపానములతో కూడిన వైశ్వానరుడు (జఠరాగ్ని)నై నేనే ప్రాణులన్నింటి దేహములందు నిలచి, ఆ ప్రాణులద్వారా భుజింపబడు నాలుగు రకములగు అన్నములను జీర్ణింపజేయుచున్నాను. (15/14)

**భగవన్! ఇంకా మీ అద్భుతాలు ఏమి గలవు?**

నేనే అందరి హృదయములలో నున్నాను. నా వల్లనే స్మృతి, జ్ఞానము, అపోహనము (సందేహ విపర్యయ రాహిత్యము) ఇత్యాదులు కలుగుచున్నవి. వేదములకర్తను, వేదవిదుడను, వేదములద్వారా తెలియదగిన వాడను కూడా నేనే అయి యున్నాను. (15/15)

**అయ్యా! కృష్ణయ్యా! తమరు అందరి హృదయాలలో ఉన్నారు నిజమే! అయితే వారలెవరు?**

ఈ ప్రపంచములో క్షరుడు, అక్షరుడు - అని రెండు విధముల పురుషులు గలరు. ఇందులో క్షరుడు నశ్వరుడు. అనగా నశించువాడు. అక్షరుడు అనశ్వరుడు అనగా శాశ్వితముగా నుండువాడు. కాని ఉత్తమ పురుషుడు వేరుగా నున్నాడు. అతడే ప్రపంచములో పరమాత్మయని చెప్పబడినాడు. అతడే ముల్లోకములను ధారణపోషణములను చేయుచున్నాడు. అతడే అవినాశియగు పరమేశ్వరుడు. (15/16-17)

**ఉత్తమ పురుషుడు వేరే అన్నారు కదా! మరి తమ రెవరు ప్రభూ?**

ఆ ఉత్తమ పురుషుడు లేదా పురుషోత్తముడను నేనే. క్షరునకు అతీతుడను; అక్షరునకంటే ఉత్తముడను. అందువలన వేదములలో, లోకములలో పురుషోత్తముడనని ప్రసిద్ధి గాంచితిని. (15/18)

**భగవన్! మీరు పురుషోత్తములను పేరుతో ప్రసిద్ధులగుటచేత మానవులకు గల లాభమేమి?**

నన్ను పురుషోత్తముడని ఎరిగిన భక్తుడు, సర్వవిత్ అనగా సర్వజ్ఞుడనబడును. అట్టి సర్వజ్ఞుడైన భక్తుడు అనన్యభావముతో నన్ను మాత్రమే భజించును. అనగా అన్నివిధముల నా యందే ఆసక్తుడై యుండును. (15/19)

**ఆహా! ఇటువంటి మాటను తమరు అందరిముందు ఏల చెప్పకుందురు, ప్రభూ?**

ఓయీ బావా! అర్జునా! నేను ఇంతవరకు నీతో చెప్పిన విషయము అతి గోప్యమైనది. దీనిని యథార్థముగా తెలిసికొనిన నా భక్తుడు జ్ఞాతజ్ఞాతవ్యుడు, కృతకృత్యుడు,, (ప్రాప్తప్రాప్తవ్యుడు) అగుచున్నాడు. (15/20)

'పురుషోత్తమప్రాప్తి యోగము' అనెడు
పదునైదవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునాఱవ అధ్యాయము - దైవాసుర సంపద్విభాగయోగము

శ్రీ భగవాన్ ఉవాచ

అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ।1।

అహింసా సత్యమక్రోధః త్యాగః శాంతిరపైశునమ్ ।
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్ ।2।

తేజః క్షమా ధృతిః శౌచమ్ అద్రోహో నాతిమానితా ।
భవంతి సంపదం దైవీమ్ అభిజాతస్య భారత ।3।

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ ।4।

దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా ।
మా శుచః సంపదం దైవీమ్ అభిజాతోఽసి పాండవ ।5।

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।
దైవో విస్తరశః ప్రోక్తః ఆసురం పార్థ మే శృణు ।6।

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ।7।

అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।
అపరస్పరసంభూతం కిమన్యత్ కామహైతుకమ్ ।8।

ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ।9।

కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః ।
మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽ శుచివ్రతాః । 10 ।

చింతామపరిమేయాం చ ప్రలయాంతాముపాశ్రితాః ।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః । 11 ।

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।
ఈహంతే కామభోగార్థమ్ అన్యాయేనార్థసంచయాన్ । 12 ।

ఇదమద్య మయా లబ్ధమ్ ఇమం ప్రాప్స్యే మనోరథమ్ ।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ । 13 ।

అసౌ మయా హతః శత్రుః హనిష్యే చాపరానపి ।
ఈశ్వరోఽ హమహం భోగీ సిద్ధోఽ హం బలవాన్ సుఖీ । 14 ।

ఆఢ్యోఽ భిజనవానస్మి కోఽ న్యోఽ స్తి సదృశో మయా ।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః । 15 ।

అనేకచిత్తవిభ్రాంతాః మోహజాలసమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽ శుచౌ । 16 ।

ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః ।
యజంతే నామయజ్ఞైస్తే దంభేనా విధిపూర్వకమ్ । 17 ।

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽ భ్యసూయకాః । 18 ।

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్రమశుభాన్ ఆసురీష్వేవ యోనిషు । 19 ।

ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిమ్ । 20 ।

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధస్తథా లోభః తస్మాదేతత్త్రయం త్యజేత్ । 21 ।

ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైః త్రిభిర్నరః ।
ఆచరత్యాత్మనః శ్రేయః తతో యాతి పరాం గతిమ్ । 22 ।

యః శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ । 23 ।

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి । 24 ।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసురసంపద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః ॥ 16 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునారవ అధ్యాయము - దైవాసుర సంపద్విభాగయోగము

ఓ ప్రభూ! అత్యంత గోపనీయమగు విషయమునకు అధికారియగు వాడు ఎవడు?

దైవీ సంపదగలవాడు అందులకు యోగ్యుడు.

దైవీసంపద అనగా నేమిటి?

భగవానుడిట్లు చెప్పదొడగెను - 'దేవ' యనెడు పేరు నాది. ఆ దేవుని గుణముల సంపదనే దైవీ సంపత్తి యని పిలువబడుచున్నది. అనగా నన్ను పొందుటకు నిమిత్తముగా నుండ గల సాధనములే దైవీ సంపదయని పిలువబడుచున్నవి. అవి ఈ విధంగా నున్నవి -

1. నా యందు దృఢ విశ్వాసమును కలిగి భయము లేకుండా ఉండుట.
2. అంతఃకరణమునందు నన్ను పొందవలెననెడు ఏకైక దృఢనిశ్చయము కలిగి ఉండుట.
3. నన్ను తత్త్వముచే తెలియుటకై అన్ని పరిస్థితులలోను సమముగా నుండుట.
4. సాత్త్విక దాన మొసగుట.
5. ఇంద్రియములను వశపరచుకొనుట.
6. తన కర్తవ్యమును నిర్వహించుట.
7. శాస్త్రములలోని సిద్ధాంతములను తమ జీవితములో ఆచరించుట.
8. స్వధర్మపాలనలో వచ్చెడు కష్టములను సంతోషముతో సహించుట.
9. శరీరము, మనస్సు, వాక్కు నందు ఋజుత్వమును కలిగియుండుట.
10. మనోవాక్కాయములతో ఏ ప్రాణికినీ, ఎంతమాత్రమునూ కష్టమును కలిగింపకుండుట.
11. చూచినది, వినినది, తెలిసినది ఉన్నది ఉన్నట్లుగా ప్రియమైన - ఇంపైన మాటలతో చెప్పుట.

12. నా స్వరూపముగా భావించి ఎవరిపట్ల, ఎప్పుడునూ కోపగించకుండుట.
13. ప్రాపంచిక కోరికలను త్యాగమొనర్చుట.
14. అంతఃకరణమునందు రాగ, ద్వేషములతో జనించిన చాంచల్యము లేకుండుట.
15. చాడీలు చెప్పకుండుట.
16. అన్ని భూతముల యందు హేతురహిత దయాభావమును కలిగియుండుట.
17. విషయలోలత్వము లేకుండుట.
18. హృదయ కోమలత్వము కలిగియుండుట.
19. అకర్తవ్యము ఆచరించుటకు సిగ్గుపడుట.
20. చాంచల్యము లేకుండుట.
21. శరీరము, వాక్కునందు తేజమును ప్రభావమును కలిగియుండుట.
22. శిక్షించుటకు తగు సామర్థ్యము తనలో నున్నప్పటికినీ, అపరాధియొక్క అపరాధమును క్షమించి వేయుట.
23. ప్రతి పరిస్థితిలోను ధైర్యము వహించుట.
24. బాహ్యాభ్యంతర శుచిత్వము (పవిత్రత) కలిగియుండుట.
25. ద్రోహచింతనము లేకుండుట.
26. తనయందు పూజ్యత, అభిమానము లేకుండుట.

అనునీ సుగుణములన్నియు దైవీ సంపద గలిగిన పురుషుని లక్షణములు. అనగా ఇట్టి లక్షణములు గలిగిన వానిని నా భక్తికి తగు యోగ్యునిగా పేర్కొనవలెను. (16/1-3)

**అనధికారి ఎవడు ప్రభూ?**

ఆసురీ సంపద గలవాడు.

**ఆసురీ సంపత్తి అనగానేమిటి?**

'అసు' (అసువులు) అని ప్రాణములకు పేరు. ప్రాణములందే రమించుటకు నిచ్ఛగించువారిని, ప్రాణములనే రక్షించుకొన జూచువారిని అసురులనెదరు. అట్టి అసురుల సంపత్తి యే ఆసురీ సంపద యనబడును. వాని లక్షణము లిట్లుండును.

1. ఆడంబరమును కలిగియుండుట.
2. మమకారము గల వస్తువులను చూసి తనలోనే గొప్పతనమును - గర్వమును అనుభవించుట.
3. తనదనుకున్న వస్తువును చూసి అభిమానమును కలిగియుండుట.
4. ఇతరులకు హాని కలిగించుటకై అంతఃకరణమందు క్రోధాత్మకమగు వృత్తి జనించుట.
5. కఠినత్వము కలిగియుండుట.
6. అజ్ఞానము లేక అవివేకముతో నుండుట.

ఇవన్నియును ఆసురీసంపదను పొందిన పురుషుని లక్షణములు అనగా ఇలాంటి మానవుడు సాధారణంగా నా భక్తికి యోగ్యుడుకాడు. (16/4)

**భగవన్! ఈ దైవీ, ఆసురీ సంపదలకు ఫలమేమిటి?**

దైవీసంపద ముక్తి నిచ్చును. ఆసురీసంపద బంధకమగును. అయితే నీవు దైవీ సంపదను కలిగియున్న వాడవుగాన శోకించవలసిన పనిలేదు. (16/5)

**ఆసురీసంపద బంధకారక మెట్లగును?**

ఈ లోకము నందు రెండు విధముల ప్రాణులు సృజింపబడుచున్నవి - 1. దైవీ 2. ఆసురీ. దైవీ సంపదను గూర్చి నేను విశదముగా చెప్పియుంటిని. ఇక ఆసురీ సంపదను గూర్చి విస్తారముగా నీవు వినగలవు. ఆసురీసంపద గలవారు ఎందులో ప్రవృత్తి కావాలి, దేనినుండి నివృత్తులు కావాలి అను సంగతిని తెలియరు. అంతియేగాక వారిలో శౌచాచారముగాని, సదాచారముగాని, సత్యభాషణముగాని యుండదు. (16/6-7)

**అయినచో భగవన్ వారి నడవడి ఎట్లుండును?**

ఈ జగత్తు అసత్యమైనదని, దీనికి ఎలాంటి నియమము లేదని చెప్పుదురు. దీనిని రచించినవాడు ఈశ్వరుడు కాదనియు, స్త్రీకి పురుషుని యందు, పురుషునకు స్త్రీ యందు కోరిక కలిగినప్పుడు ఇరువురి సంయోగము వల్లనే ఇది ఉత్పన్నమగుచున్నది. అందువలన ఈ సృష్టి యంతటికి కామమే కారణమగుచున్నది. అంతకుమించి మరే కారణము లేదనియు నుడువుదురు. (16/8)

**వారి కర్మలు ఎట్లుండును?**

వారి కర్మలు మిక్కిలి క్రూరముగా నుండును. వారు ఆత్మను అంగీకరింపరు. వారు జగత్తునకు శత్రువులయ్యెదరు. వారి బుద్ధి కూడా తుచ్ఛమైన దగును. ఈ విధమైన దృష్టి గలిగిన మనుష్యుల సామర్థ్యము ప్రపంచ నాశనమునకే సమర్థమగును. (16/9)

**మరి, వారు ఎవరి నాశ్రయించెదరు ప్రభూ?**

ఎప్పటికీ నెరవేరని కోరికలను ఆశ్రయించి, దంభము, అభిమానము (గర్వము) మదములనబడు దుర్గుణములతో మత్తులై దుష్టమగు (వ్రతము) దీక్షలను ధరించెడు మనుజులు అజ్ఞానము వలన దురాగ్రహపూరితులై ప్రపంచమునందు ప్రవర్తించెదరు. (16/10)

**ఇంకనూ వారు ఎట్లుండెదరు?**

మృత్యుపర్యంతము వీడిపోవని హద్దులేని చింతల పాలగుదురు. పదార్థములను సంగ్రహించి వానిని అనుభవించుటయే జీవిత పరమార్థ మనియు అంతకు మించినదేదియు లేదను నిశ్చితాభిప్రాయము గలవారై ఉందురు. (16/11)

**వారు ఏ ఉద్దేశ్యముతో ప్రవర్తించెదరు కృష్ణా?**

వేలాది ఆశాపాశములతో కట్టువడిన ఆ మనుష్యులు కామక్రోధములకు బానిసలై విషయ భోగముల కొరకే అన్యాయముగా ధనమును సంపాదించుటకు ప్రయత్నింతురు. (16/12)

**వారి మనోభీష్టములు ఎట్లుండును?**

నా యిష్టానుసారముగా నేడు ఇంత ధనమును సంపాదించితిని. నా వద్ద ఇంత ధనమున్నది. ఇంకనూ మరింత ధనము లభించును. అని తలంతురు. (16/13)

**ఇంకనూ వారి కోరిక లెట్లుండును?**

ఆ శత్రువును నేను చంపివేసితిని. మిగిలిన శత్రువులను కూడా అంతమొందింతును. నేను సర్వసమర్థుడను, సిద్ధుడను, బలవంతుడను, సుఖవంతుడను. భోగములను భోగించువాడను. నేను కడు ధనవంతుడను. అనేకమంది వెంటగలవాడను. నా సరి మరియెవ్వరుండ గలరు? నేను బాగుగా

యజ్ఞములను చేయుదును, దాన ధర్మములు చేయుదును. ఆమోద ప్రమోదముల నొందెదను. అని యిట్లు అజ్ఞానముతో మోహితులై వారు లెక్కలేని మనో భ్రమలకు లోనై యుండెదరు. (16/14-15)

**ప్రభూ! వారి గతి ఏమిటి?**

అనేక మనో భ్రమలకు లోనై, మోహజాలము నందు జిక్కుకొని, కామోపభోగమునందు అత్యంత ఆసక్తులగు ఆ మనుజులు భయంకరమగు నరకములందు పడిపోవుదురు. (16/16)

**భోగములందు ఆసక్తులైన అసురీసంపద గలవారల లక్షణము లెట్లుండును?**

వారు తమకు తామే పూజ్యులమని భావించుకొందురు. వినయ రహితులై, ధనమానములచే గలిగిన మదమునందు గర్వితులై యుండెదరు. (16/17)

**ప్రభూ! ఇటువంటి వారు శుభకర్మలను గూడా చేయగలుగుదురా?**

ఔను! వారు యజ్ఞాది శుభకర్మలను కూడా ఆచరించెదరు, కాని దాంభికముగ, ఆడంబరము కొరకు, అవిధి పూర్వకంగా, పేరునకు మాత్రమే ఆచరింతురు. (16/17)

**వారు ఈ విధంగా ఎందుకు చేయుదురు?**

ఏలయన, వారు అహంకారము, మూర్ఖము, గర్వము, దర్పములను గలిగి కామక్రోధ పరాయణులై యుండెదరు.

**భగవన్! వారు ఇంకనూ ఏమేమి చేయుదురు?**

ఆ మనుష్యులు తమలో మరియు ఇతరుల శరీరములందు అంతర్యామిగా నున్న నన్ను ద్వేషించెదరు. అంతేగాక నా యొక్క, ఇతరుల యొక్క గుణములలో దోషములనే గాంచుచుందురు. (16/18)

**ఇటువంటి అసురీ స్వభావము గల మానవులకు తమరు ఎలాంటి గతిని కల్పించెదరు ప్రభూ?**

అట్లు ద్వేషించునట్టి, క్రూర స్వభావము గలిగిన, గొప్ప నీచులు, అపవిత్రులు నగు మనుజులను ఈ సంసారము నందే పులి, సింహము, తోడేలు, కాకి, గ్రద్ద, గుడ్లగూబ, పాము, తేలు వంటి తిర్యక్ సంబంధమగు ఆసురీ యోనులయందు పడవేయుదును. (16/19)

**ఇంకనూ ఏమగును మహాప్రభూ?**

కుంతీనందనా! ఆ మూఢజనులు నన్ను పొందనివారై, జన్మజన్మము లందు అసురీ యోనులను పొందెదరు. ఇంకనూ అంతకంటే మిక్కిలి నీచగతులలో పడిపోవుదురు అనగా భయంకరమగు ఘోరనరకములందు ప్రవేశింతురు. (16/20)

**ఆసురీ సంపదతో గూడిన మనుజుడు నీచగతిని పొందుటకు గల ముఖ్య కారణమేమిటి ప్రభూ?**

కామము, క్రోధము, లోభము - అను నీ మూడు విధములగు నరక ద్వారములే మానవుని పతనమునకు ముఖ్యకారణములు. అందువలన ఈ మూడింటిని త్యజింపవలెను. (16/21)

**ఈ మూడింటిని త్యజించి ఏమి చేయాలి?**

ఈ మూడు నరక ద్వారముల నుండి ముక్తుడైన మానవుడు తన శ్రేయస్సును గూర్చియే ఆచరించును. అనగా శాస్త్ర నిషిద్ధములగు కార్యములను అతడు చేయనే చేయడు. ఇక విహితమగు కర్మలను నిష్కామభావముతో కేవలము తన శ్రేయస్సు కొరకే ఆచరించును. తద్వారా అతడు పరమగతిని పొందును. (16/22)

**శాస్త్ర విధానమును విడిచి మంచినే ఆచరించినచో ఏమగును?**

శాస్త్రవిధానమును త్రోసిరాజని, ఇష్టము వచ్చిన రీతి ఆచరణ గలవానికి అనగా తనకు మంచిదనిపించిన పనిని చేయుచు, మంచిది కాదని భావించిన పనిని చేయకుండువానికి సిద్ధి (అంతఃకరణశుద్ధి) గాని, సుఖముగాని, పరమగతిగాని ప్రాప్తించదు. (16/23)

**మంచి-చెడులను గుర్తించుట యెట్లు?**

కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించుటకు శాస్త్రములే ప్రమాణములు. అందువలన శాస్త్రములను ముందుంచుకొని నీవు ప్రతి పనిని చేయుచుండ వలయును. (16/24)

'దైవాసుర సంపద్విభాగయోగము' అనెడు
పదునాఱవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునేడవ అధ్యాయము - శ్రద్ధాత్రయ విభాగయోగము

అర్జున ఉవాచ

యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః ।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః ।1।

శ్రీభగవాన్ ఉవాచ

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ।2।

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః ।3।

యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః ।
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః ।4।

అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః ।
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః ।5।

కర్శయంతః శరీరస్థం భూతగ్రామమచేతసః ।
మాం చైవాంతఃశరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్ ।6।

ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు ।7।

ఆయుఃసత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః ।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః ।8।

కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః ।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః ।9।

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ।10।

అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।
యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః ।11।

అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ।12।

విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్ ।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ।13।

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్ ।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ।14।

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయమ్ తప ఉచ్యతే ।15।

మనఃప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధిరిత్యేతత్ తపో మానసముచ్యతే ।16।

శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్ త్రివిధం నరైః ।
అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ।17।

సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ ।18।

మూఢగ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ।19।

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ।20।

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ । 21 ।

అదేశకాలే యద్దానమ్ అపాత్రేభ్యశ్చ దీయతే ।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ । 22 ।

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా । 23 ।

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।
ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ । 24 ।

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః । 25 ।

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే ।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే । 26 ।

యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే ।
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే । 27 ।

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ । 28 ।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయవిభాగయోగోనామ సప్తదశోఽధ్యాయః ॥ 17 ॥



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునేడవ అధ్యాయము - శ్రద్ధాత్రయ విభాగయోగము

**అర్జునుడు పలికెను - ఓ కృష్ణా! శాస్త్రవిధిని ఎరుగకయే శ్రద్ధా పూర్వకముగా పూజనుగానీ, యజ్ఞమునుగానీ చేసిన మానవుని శ్రద్ధను సాత్త్వికమందురా? రాజసమందురా? లేక తామసమందురా? (17/1)**

భగవానుడిట్లనెను - అర్జునా! మానవుని స్వభావముచే జనించిన శ్రద్ధ మూడు విధములుగా నుండును. 1. సాత్త్వికము 2. రాజసము 3. తామసము.

**స్వామీ! స్వభావము వలన యేర్పడిన శ్రద్ధ ఎందుకు మూడు విధములుగా నుండును?**

అర్జునా! మనుష్యులందరిలో గల శ్రద్ధ, వారి అంతఃకరణమునకు అనురూపముగా వుండును. మనుష్యుడు శ్రద్ధామయుడు. అందుచే ఎటువంటి శ్రద్ధను కలిగియున్న వ్యక్తి అటువంటి స్వరూపమునే కలిగియుండును. అనగా అతని స్థితి (నిష్ఠ) అతడు కలిగియున్న శ్రద్ధను అనుసరించియే యుండును. (17/3)

**అట్టి శ్రద్ధ (నిష్ఠ)ను గుర్తించుటెట్లు?**

సాత్త్వికమగు మానవులు దేవతలను పూజించెదరు. రాజసముగల మనుజులు యక్షులను, రాక్షసులను పూజింతురు. ఇక తామస వ్యక్తులు భూత, ప్రేతములను పూజించెదరు. (17/4)

**అచ్యుతా! అశ్రద్ధగల మానవులను గుర్తించుటెట్లు?**

పార్థా! అశ్రద్ధగల మానవులు దంభమును, అహంకారమును, కోరికను, ఆసక్తిని, హఠమును గలిగియుండెదరు. వారు శాస్త్రవిధిని విడిచిపెట్టి ఘోరమగు తపస్సు చేసెదరు. ఇట్లు తమ పాంచభౌతిక శరీరమును కష్టపెట్టెదరు. అంతియేగాక (నాకు వ్యతిరేకముగా వ్యవహరించుచు) అంతఃకరణము నందు అంతర్యామిగా నిలిచి యున్న నన్ను కూడా బాధించెదరు. ఇటువంటి అజ్ఞానులగు మానవులను నీవు అసురస్వభావము గలవారని గుర్తించుము. (17/5-6)

**కేశవా! ఇప్పటివరకు నీవు పూజ, తపస్సులయందు శ్రద్ధాళువులు, అశ్రద్ధాళువులగు మానవులను గుర్తించుటను గూర్చి వివరించితివి. కాని పూజ, తపస్సు మొదలగు వానిని చేయకుండు వారలను గుర్తించుట యెట్లు?**

ఆహారపు అలవాటును బట్టి వారిని గుర్తింపవచ్చును. అందరూ భోజనమును చేయువారే. కనుక అందరికి ఆహారము కూడా మూడు విధములుగా ఇష్టమై యుండును. అట్లే యజ్ఞము, దానము, తపస్సు కూడా మూడు విధములుగా నచ్చినవారు ఉండెదరు. వారి భేదములను వినుము. (17/7)

**సాత్త్వికుడగు మానవునకు రుచించు ఆహారమెట్టిది?**

ఆయువును, సత్త్వగుణమును, బలమును, ఆరోగ్యమును, పెంపొందించునట్టి, సుఖమును, సంతోషమును కలిగించునట్టి, స్థిరముగా అనగా శరీరమునందు సారరూపమున ఎక్కువకాలము నిలిచియుండునట్టి, హృద్యముగా నుండునట్టివి, రసముతో కూడినవి, స్నిగ్ధములుగా నుండునట్టి ఆహారపదార్థములు సాత్త్వికులగు వారికి ఇష్టమై యుండును. (17/8)

**రాజస వ్యక్తికి ఇష్టమగు ఆహారము ఎట్లుండును?**

ఎక్కువ చేదు, పులుపు, ఉప్పుతో కూడినవి, వేడి వేడిగా ఉండునట్టివి, కారముతో నుండునట్టివి, మాడిపోయినవి, దాహము కలిగించునట్టి ఆహార పదార్థములు రాజసవ్యక్తికి రుచికరములుగా నుండును అవి దుఃఖమును, బాధను, రోగమును కలిగించును. (17/9)

**తామస జనులకు రుచించు ఆహార పదార్థములెట్లుండును?**

సగము ఉడికినవి, రసములేనివి, దుర్గంధముతో కూడినవి (ఉల్లి, వెల్లుల్లి మొ.) పాచిపోయినవి, ఉచ్ఛిష్టము (ఎంగిలి చేసినవి) మిక్కిలి అపవిత్రములగు నట్టి (మాంసము, మద్యము, చేపలు, గ్రుడ్లు మొ.) ఆహార పదార్థములు తామసులగు జనులకు రుచికరముగా నుండును. (17/10)

**కృష్ణా! యజ్ఞము, దానము, తపస్సు కూడా మూడేసి విధములుగా నుండునని నీవు ఇప్పుడే చెప్పి యుంటివి గదా! అందులో మూడు రకములగు యజ్ఞములను గూర్చి వివరించుము?**

యజ్ఞము చేయుటయే కర్తవ్యమని మనసులో నిశ్చయించుకొని,

ఫలమును కోరకుండా, శాస్త్రవిధిని అనుసరించి చేయబడుచున్న యజ్ఞము సాత్త్వికమగును. (17/11)

**దేవా! రాజస యజ్ఞము ఎట్లుండును?**

భరతశ్రేష్ఠుడవగు అర్జునా! తమ స్వార్థమునకై ఫలమును కోరుతూ, కేవలము డంబమునకు మాత్రమే చేయబడు యజ్ఞమును రాజసమైనదని ఎరుగుము. (17/12)

**ఇక, తామస యజ్ఞమెట్లుండును?**

శాస్త్రమునకు విరుద్ధముగా, అన్నదానము చేయకుండా, (వేద) మంత్రములు చదువకుండా, దక్షిణలు ఈయకుండా, ఆవంతైన శ్రద్ధలేకుండా చేయబడు యజ్ఞమును తామసికమైన దని చెప్పబడును. (17/13)

**ప్రభూ! తపస్సు ఎన్ని విధములుగా నుండును?**

అర్జునా! శారీరకము, వాచికము, మానసికము అని తపస్సు మూడు విధములుగా నుండును. దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, వృద్ధులను, పెద్దలను, జీవన్ముక్త మహాత్ములను పూజించుట, శరీరమును పవిత్రముగా నుంచుకొనుట, శారీరక క్రియను చక్కగా, సరళముగా, ఋజువుగా ఆచరించుట, బ్రహ్మచర్యమును పాటించుట, శరీరముతో ఎవరినీ, ఏ విధముగనూ కష్టము (హింస)ను కలిగించకుండుట - ఇదంతయు శారీరిక తపస్సు అనబడును. (17/14)

**వాచిక తపస్సు ఎట్లుండును?**

ఇతరులకు ఉద్వేగము కలిగించకుండునట్టి, సత్యమైనట్టి, ప్రియమైనట్టి హితమును కలిగించునట్టి మాటలు మాట్లాడుట, స్వాధ్యాయము అనగా వేద, శాస్త్ర గ్రంథములను చదువుట, భగవన్నామమును జపించుట, స్మరించుట ఇవన్నియును వాచిక తపస్సు అనబడును. (17/15)

**ప్రభూ! మానసిక తపస్సు ఎట్లుండును?**

మనస్సు ప్రసన్నముగా నుండుట, శాంతమును కలిగియుండుట, భగవచ్చింతనము చేయుట, మనోనిగ్రహమును కలిగియుండుట, అంతః కరణము పవిత్రముగా, నిర్మలముగా నుండుటను మానసిక తపస్సు అందురు. (17/16)

ఇంతవరకు చెప్పబడిన మూడు విధములగు తపస్సును అత్యంత శ్రద్ధాయుక్తుడై, ఫలితమును కోరకుండా చేసిన యెడల, అది సాత్త్విక తపస్సుగా పేర్కొనబడును. (17/17)

**తపస్సు రాజసికము ఎట్లగును?**

సమాజములో తనకు గౌరవము, కీర్తి, ప్రతిష్ఠ పెరగాలని, జనులందరు తమనే పూజించాలని, డాంబికముగా, ఆడంబరముతో, లోకమునకు ప్రదర్శించు భావముతో చేయబడునది, అనిశ్చితమగు, క్షణికమైన ఫలమును ఇచ్చునదియగు తపస్సు రాజసికమగును. (17/18)

**తామసిక తపస్సు ఎట్లుండును?**

అజ్ఞానముతో కూడిన మొండితనముతో తాను కష్టపడుతూ, ఇతరులను కష్టపెట్టుటకొరకే చేయబడు తపస్సు తామసిక మనబడును. (17/19)

**కృష్ణా! దానము మూడు విధములుగా ఎట్లుండును?**

దానము చేయుటనే కర్తవ్యముగా నెంచి, ప్రత్యుపకారమును కోరకుండా, తగిన దేశ, కాలములందు పాత్రులగు వారికి చేయబడు దానము సాత్త్విక మగును. (17/20)

**రాజసదానము అనగా నేమి?**

ప్రత్యుపకారమును పొందుటకై, ఫలితమును కోరుతూ 'ఇవ్వవలసి వచ్చుచున్నది కదా' అను దుఃఖముతో, బాధతో ఇవ్వబడు దానము రాజస మగును. (17/21)

**తామస దానము ఎట్లుండును?**

దేశ, కాల, పాత్రములను లెక్క చేయకుండా తిరస్కార పూర్వకముగా ఇచ్చు దానమును తామసికమని యందురు. (17/22)

**మధుసూదనా! శ్రద్ధాళువులగు మానవులు శాస్త్ర విహితమగు యజ్ఞమును, తపస్సును, దానమును ప్రారంభించుటెట్లు?**

అర్జునా! ఓం, తత్, సత్ - అని పరమాత్మకు మూడు పేర్లు గలవు. సృష్ట్యారంభము నందు ఈ పరమాత్ముడే వేదములను, బ్రాహ్మణులను, యజ్ఞములను సృజించెను. కావున పరమాత్ముని నామమును స్మరించియే యజ్ఞాది క్రియలను ప్రారంభించవలయును. (17/23)

**ప్రభూ! ఓంకారము ఎప్పుడు ఉచ్చరింపబడును?**

వేదపండితులు శాస్త్రవిహితములగు యజ్ఞము, దానము, తపస్సు వంటి క్రియలను 'ఓం' కారమును ఉచ్చరించియే ప్రారంభించెదరు.

(17/24)

**కేశవా! 'తత్'ను ఎచట ప్రయోగించెదరు?**

ముక్తిని గోరెడు వారలు 'తత్' అను పేరుతో వ్యవహరించెదరు. 'పరమాత్మని కొరకే ఇదంతా' అను భావముతో ఫలాకాంక్షను త్యజించి యజ్ఞ, దాన, తపః క్రియలను ఆచరించెదరు. (17/25)

**కృష్ణా! 'సత్'ను ఎచ్చట ప్రయోగింతురు?**

పార్థా! 'సత్' అను పరమాత్మ నామము సత్యభావమునందును, శ్రేష్ఠభావము నందును ప్రయోగింపబడును. అట్లే ప్రశంసాత్మకమగు కర్మతో కూడా 'సత్' శబ్దము జోడింపబడును. యజ్ఞము, తపస్సు, దానమునందు మానవునకు గల స్థితి అనగా శ్రద్ధ, నిష్ఠ కూడా 'సత్' అనియే చెప్పబడును. 'సత్'ను గూర్చి ఎంతవరకు చెప్పజాలుదుము? ఆ పరమాత్మను గూర్చి చేయబడు కర్మయంతయూ 'సత్' శబ్దముతోనే చెప్పబడును. ఏలయన, ఇట్లు చేయబడిన కర్మ శాశ్వతమైన ఫలమును ప్రసాదించునదిగా మార్పు నొందును.

(17/26-27)

**కృష్ణా! 'అసత్' కర్మలని వేటిని యందురు?**

కుంతీపుత్రా! అశ్రద్ధతో (ఎంతమాత్రము శ్రద్ధలేకుండా) చేయబడు హవనము, తపస్సు, అట్లే ఇవ్వబడు దానము మున్నగు క్రియలను 'అసత్' అను పదముతో పేర్కొనబడును. వానివలన జీవించియుండగా గానీ, మరణించిన పిదపగానీ ఎటువంటి ఫలితమూ కలుగదు. అనగా వాని వలన 'సత్' ఫలము ఎక్కడ కూడా లభింపదు. (17/28)

'శ్రద్ధాత్రయ విభాగయోగము' అనెడు
పదునేడవ అధ్యాయము ముగిసెను.



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునెనిమిదవ అధ్యాయము - మోక్షసన్న్యాసయోగము

అర్జున ఉవాచ

సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।
త్యాగస్య చ హృషీకేశ పృథక్ కేశినిషూదన ।1।

శ్రీభగవాన్ ఉవాచ

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ।2।

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః ।
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే ।3।

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః ।4।

యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ।5।

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్ ।6।

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే ।
మోహాత్తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః ।7।

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్ త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ।8।

కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున ।
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః ।9।

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ।10।

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ।11।

అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ।12।

పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే ।
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ।13।

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।
వివిధాశ్చ పృథక్ చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ।14।

శరీరవాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః ।
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః ।15।

తత్రైవం సతి కర్తారమ్ ఆత్మానం కేవలం తు యః ।
పశ్యత్యకృతబుద్ధిత్వాత్ న స పశ్యతి దుర్మతిః ।16।

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।
హత్వాపి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే ।17।

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ।18।

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ।19।

సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తద్ జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ।20।

పృథక్త్వేన తు యద్ జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్ ।21।

యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్ ।
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ । 22 ।
నియతం సంగరహితమ్ అరాగద్వేషతః కృతమ్ ।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్ సాత్త్వికముచ్యతే । 23 ।
యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్ । 24 ।
అనుబంధం క్షయం హింసామ్ అనవేక్ష్య చ పౌరుషమ్ ।
మోహాదారభ్యతే కర్మ యత్తత్ తామసముచ్యతే । 25 ।
ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే । 26 ।
రాగీ కర్మఫలప్రేప్సుః లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః । 27 ।
అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే । 28 ।
బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ । 29 ।
ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ । 30 ।
యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।
అయథావత్ ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ । 31 ।
అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ । 32 ।
ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియక్రియాః ।
యోగేనావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ । 33 ।

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున ।
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ రాజసీ । 34 ।

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।
న విముంచతి దుర్మేధా ధృతిః సా పార్థ తామసీ । 35 ।

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి । 36 ।

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమ్ ఆత్మబుద్ధిప్రసాదజమ్ । 37 ।

విషయేంద్రియసంయోగాత్ యత్తదగ్రేఽమృతోపమమ్ ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ । 38 ।

యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః ।
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ । 39 ।

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్ త్రిభిర్గుణైః । 40 ।

బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప ।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః । 41 ।

శమో దమస్తపః శౌచం క్షాంతిరార్జవమేవ చ ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మస్వభావజమ్ । 42 ।

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ । 43 ।

కృషిగౌరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మస్వభావజమ్ ।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ । 44 ।

స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు । 45 ।

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః । 46 ।

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ । 47 ।

సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్ ।
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః । 48 ।

అసక్తబుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి । 49 ।

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే ।
సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా । 50 ।

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ ।
శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ । 51 ।

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః । 52 ।

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే । 53 ।

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ । 54 ।

భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః ।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ । 55 ।

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ । 56 ।

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ । 57 ।

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్ తరిష్యసి ।
అథ చేత్ త్వమహంకారాత్ న శ్రోష్యసి వినంక్ష్యసి । 58 ।

యదహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి । 59 ।

స్వభావజేన కౌంతేయ నిబద్ధః స్వేన కర్మణా ।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోఽపి తత్ । 60 ।

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా । 61 ।

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్ పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ । 62 ।

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు । 63 ।

సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ । 64 ।

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే । 65 ।

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః । 66 ।

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన ।
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి । 67 ।

య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః । 68 ।

న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మాత్ అన్యః ప్రియతరో భువి । 69 ।

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః ।
జ్ఞానయజ్ఞేన తేనాహమ్ ఇష్టః స్యామితి మే మతిః ।70।

శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।
సోఽపి ముక్తః శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్ పుణ్యకర్మణామ్ ।71।

కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ ।72।

అర్జున ఉవాచ

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత ।
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ।73।

సంజయ ఉవాచ

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।
సంవాదమిమమశ్రౌషమ్ అద్భుతం రోమహర్షణమ్ ।74।

వ్యాసప్రసాదాచ్ఛ్రుతవాన్ ఏతద్గుహ్యమహం పరమ్ ।
యోగం యోగేశ్వరాత్ కృష్ణాత్ సాక్షాత్ కథయతః స్వయమ్ ।75।

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమ్ ఇమమద్భుతమ్ ।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ।76।

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః ।
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునఃపునః ।77।

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతిర్మమ ।78।

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షసన్న్యాసయోగోనామ అష్టాదశోఽధ్యాయః ॥ 18 ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు



॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

# పదునెనిమిదవ అధ్యాయము-మోక్షసన్న్యాసయోగము

అర్జునుడు పలికెను - ఓ మహాబాహూ! ఓ అంతర్యామీ! ఓ కేశి నిషూదన! సన్న్యాసము (సాంఖ్యయోగము) యొక్క తత్త్వమును; త్యాగము (కర్మయోగము) యొక్క తత్త్వమును నేను విడివిడిగ తెలియగోరుచున్నాను. **(18/1)**

భగవానుడిట్లనెను - సన్న్యాసమును, త్యాగమును గూర్చి ఇతర దార్శనికులగు వారి అభిప్రాయములు నాల్గింటిని వివరించెదను.

**కృష్ణా! ఆ నాలుగు అభిప్రాయము లెవ్వి?**

అర్జునా!

1. కామ్యకర్మల త్యాగమునే సన్న్యాసమని కొందరందురు.
2. సకల కర్మల ఫలమును త్యజించుటనే త్యాగమని ఎందరో వచించెదరు.
3. కర్మలన్నియూ దోషయుక్తములే కావున అన్ని కర్మలను వదిలి పెట్టవలయునని మరికొందరు విద్వాంసులు వక్కాణింతురు.
4. యజ్ఞము, దానము, తపస్సు వంటి కర్మలను త్యజింప గూడదని చాలామంది చెప్పుదురు. (18/2-3)

**కేశవా! ఈ నాలుగు అభిప్రాయములు దార్శనికులకు చెందినవికదా! మరి ఈ విషయంలో నీ అభిప్రాయమేమిటి?**

భరత వంశీయులలో శ్రేష్ఠుడవగు అర్జునా! సంన్యాసము, త్యాగము - అను నీ రెండింటిలోనూ ముందుగా త్యాగమును గూర్చిన నా అభిప్రాయమును నీవు వినుము. ఓ పురుషశ్రేష్ఠా! త్యాగము మూడు విధములుగా చెప్పబడినది. యజ్ఞము, దానము, తపస్సు వంటి కర్మలను త్యజింపకూడదు. ఒకవేళ వాటిని మానివేసినచో తప్పక ఆచరించవలెను. కారణమేమన, వాటిలోని ఒక్కొక్క కర్మ మానవులను పవిత్రవంతులనుగా చేయును. (18/4-5)

**కృష్ణా! చేయవలసిన కర్మలు ఇంతేనా మరి?**

ఓ పార్థా! ఇప్పుడిప్పుడే చెప్పబడిన యజ్ఞ, దాన, తపశ్చర్యలను, ఇవియే గాక, శాస్త్ర విహితములైన ఇతర కర్మలన్నింటిని కూడ ఆసక్తిని మరియు

ఫలాకాంక్షను పూర్తిగా త్యజించివైచి ఆచరించవలయును. అత్యుత్తమమగు నా నిశ్చితాభిప్రాయము ఇదియే. (18/6)

**జనార్దనా! నీవు చెప్పిన మూడు విధములగు త్యాగము యొక్క స్వరూప మెట్లుండును?**

కుంతీపుత్రా! నియతకర్మలను❖ వదిలిపెట్టుట ఎవరికీ మంచిదికాదు. మోహము వలన నియతకర్మలను వదలివేయుట తామసిక త్యాగమగును. (18/7)

**రాజసిక త్యాగము ఎట్లుండును?**

కర్తవ్యకర్మను ఆచరించుటలో కేవలము దుఃఖమే కలదు అని భావించి శారీరిక శ్రమకు భయపడి అట్టి కర్మలను త్యజించివేయుట రాజసికత్యాగ మనబడును. ఇట్లు కర్తవ్యకర్మను వదలి వేసిన వానికి త్యాగ ఫలమగు శాంతి లభించదు. (18/8)

**సాత్త్విక త్యాగము యొక్క స్వరూప మెట్టిది?**

అర్జునా! నియత కర్మను ఆచరించుటయే మానవుని ముఖ్య కర్తవ్యము అని తలంచి అట్టి కర్మల యందు ఆసక్తిని, వాని ఫలమునందు ఇచ్ఛను

---

❖ నియతకర్మ, విహితకర్మలో తేడా ఏమిటి? అంటే ఆచరణ నిమిత్తముగా శాస్త్రములు ఆజ్ఞాపించిన కర్మలన్నియును 'విహితకర్మలు' అనబడును. అట్టి విహితకర్మల నన్నింటిని ఒకే వ్యక్తి ఆచరింపజాలడు. ఏలనన, అన్ని వారములలోను, అన్ని తిథులయందును ఆచరించుటకు గాను వ్రతవిధానములను గూర్చి శాస్త్రములు పేర్కొనుచున్నవి. ఒకవేళ ఒకే వ్యక్తి అన్ని వారములలోను, అన్ని తిథులలోను వ్రతమును ఆచరించిన యెడల, అతడు భోజనము చేయుటెప్పుడు? అందువలన విహిత కర్మలన్నియూ మానవునకు తప్పనిసరికావని తేటపడుచున్నది. కాని ఇట్టి విహితకర్మము కూడా వర్ణ, ఆశ్రమ, పరిస్థితులననుసరించి ఎవరికి, ఏ కర్తవ్యము అవసరమో, అతనికి ఆ కర్తవ్యమే 'నియతకర్మ' యగుతుంది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనబడు నాలుగు వర్ణములకు చెందిన వారికి జీవనోపాధికై శరీర నిర్వహణార్థముగా గల నియమములన్నీ కూడా, ఆయా వర్ణముల వారికి అవన్నియూ 'నియత కర్మ' లగును.

వదలిపెట్టి నియతకర్మలను చక్కగా ఆచరించుటయే సాత్త్వికత్యాగము అనబడును. (18/9)

**ప్రభూ! త్యాగము చేయువాడు ఎట్లుండును?**

అతడు కామ్యకర్మలను, నిషిద్ధ కర్మలను త్యజించి వేయును. కాని వానిని అతడు ద్వేషబుద్ధితో త్యజింపడు. ఇట్లే శాస్త్రనియతములగు కర్తవ్యకర్మలను ఆచరించును. కాని వాని యందు ఆసక్తుడు గాకుండును. ఇటువంటి బుద్ధిమంతుడగు త్యాగియైన మనుజుడు సత్త్వగుణ సంపన్నుడై, సంశయ రహితుడై స్వస్వరూపము నందు నిలచి యుండును. (18/10)

**కర్మను ఆచరించుటకు ఆసక్తుడు కావద్దు, కర్మను త్యజించుటను ద్వేషింపవద్దు - అని అంటూ ఇబ్బందికి గురి చేయుటేల? కర్మలను పూర్తిగా వదిలివేసినచో నేమగును?**

దేహధారియగు మానవుడు కర్మలను పూర్తిగా వదిలివేయుట శక్యముగాని పని. అందువలన కర్మఫలమును త్యజించునట్టి వాడే త్యాగి యని చెప్పబడుచున్నాడు. (18/11)

**కృష్ణా! కర్మఫలితము లెన్ని విధములు?**

అర్జునా! కర్మఫలితములు మూడు విధములు. 1. ఇష్టములు (కోరిన - అనుకూల పరిస్థితులు లభించుట) 2. అనిష్టములు (కోరనట్టి - ప్రతికూల పరిస్థితులేర్పడుట) 3. మిశ్రితములు (కొంత ఇష్టమైనవి, కొంత అనిష్టమైనవి - కలిసినట్టివి) అని కర్మ ఫలితములు మూడు విధములుగా నుండును. ఫలితము నందు కోరికను గలిగి కర్మనాచరించెడు వారలకు ఈ మూడు విధములగు కర్మఫలితములు మరణించిన పిదప కూడా లభించును. కాని ఫలము నందు కోరికను త్యజించి కర్మను ఆచరించెడు వారలకు కర్మఫలితము ఎన్నటికినీ లభింపకుండును. (18/12)

**భగవన్! మూడు విధములగు ఫలితము లభించెడు కర్మ జరుగుటకు కారణమేది?**

ఓ మహాబాహూ! కర్మలను అంతము చేయు ఉపాయములను తెలుపునది సాంఖ్య సిద్ధాంతము. అందులో సంపూర్ణ మగు కర్మసిద్ధిని గూర్చి అయిదు కారణములు పేర్కొనబడినవి. వాటిని నీవు నా ద్వారా వినుము. (18/13)

**ఓ పురుషోత్తమా! ఆ ఐదు కారణము లెవ్వి?**

అర్జునా! శరీరము, కర్త, వివిధ కరణములు, వాని విభిన్న రీతుల వేరు వేరు చేష్టలు, మరియు సంస్కారములు - అనునవి ఈ ఐదు కారణములు. మనుష్యుడు తన శరీరము, వాక్కు, మనస్సుద్వారా చేయునట్టి శాస్త్ర విహితములగు లేదా శాస్త్ర నిషిద్ధములగు కర్మలన్నియునూ ఈ ఐదు కారణముల వల్లనే జరుగుచుండును. (18/14-15)

**జరిగే కర్మలకు ఈ హేతువులు ఐదింటిని పేర్కొనుటలో గల రహస్యమేమి?**

శరీరము, వాక్కు, మనస్సు ద్వారానే కర్మ (క్రియ) జరుగుచుండును. కనుక ఆత్మయందు కర్తృత్వము లేదు. అనగా ఆత్మను క్రియకు కర్తగా భావించరాదు. కాని దుర్బుద్ధి గలిగినవాడు ఇట్టి విషయమును చక్కగా తెలియక ఆత్మనే కర్తగా భావించును. ఏలయన, అతని బుద్ధి సంస్కారహీనమై నిర్మలముగా నుండదు. (18/16)

**కృష్ణా! ఆత్మను అకర్తగా భావించుటచే లాభమేమి?**

అర్జునా! 'నేను కర్తను' అను అహంకార భావము లేకుండా ఉండే వాని బుద్ధి కర్మఫలములతో ముడివడి యుండదు. అట్టి నిరహంకారియగు వాడు ఈ ప్రాణులన్నింటిని చంపినప్పటికినీ, అతడు ఎవరినీ చంపినవాడు కాడు. అతడు ఆ కర్మతో బంధింపబడడు. (18/17)

**సరే, ఆత్మకు కర్మతో ఎలాంటి సంబంధము లేదు. అయితే దేని ప్రేరణవల్ల కర్మలు జరుగుచున్నవి?**

జ్ఞానము, జ్ఞేయము, పరిజ్ఞాత - అను నీ మూడు కర్మల ప్రేరకములు. కాగా, కరణము, కర్మ, కర్త - అను ఈ మూడింటి ద్వారా కర్మసంగ్రహము జరుగును. (18/18)

**భగవన్! కర్మ ప్రేరణ, కర్మసంగ్రహము, నందు ముఖ్యమైనదేమి? దాని ప్రధానమైన భేదములెవ్వి?**

సత్త్వరజస్తమోగుణముల విషయములో ప్రతిపదార్థము యొక్క వేరు వేరు భేదములను లెక్కించునది సాంఖ్యశాస్త్రము. అట్టి సాంఖ్యశాస్త్రమునందు గుణముల ననుసరించి జ్ఞానము, కర్మ, కర్త నీ మూడింటిలో ఒక్కొక్కటి మూడు విధములుగ చెప్పబడినది. వాటిని గూర్చి నీవు చక్కగా వినుము.

**జ్ఞానము యొక్క మూడు భేదములలో సాత్త్వికజ్ఞానము ఎట్లుండును?**

వేరువేరుగా విభజింపబడిన సకల ప్రాణికోటి యందు విభజింపబడనిదియు, అవినాశియునగు ఒకే పరమాత్మ భావమును చూడగలిగెడు జ్ఞానమును సాత్త్విక జ్ఞానమని తెలియుము. (18/20)

**ప్రభూ! రాజస జ్ఞానము ఎట్లుండును?**

అర్జునా! వేరువేరుగా నున్న సమస్త ప్రాణికోటి యందు, ఆత్మను వేరువేరుగా చూడబడెడు జ్ఞానమును రాజసమైనదని తెలిసికొనుము. (18/21)

**ఇక, తామస జ్ఞానమెట్లుండును?**

కార్యరూపముగ ఉత్పన్నమైనటువంటి శరీరమునే సర్వస్వమనియు, దాని యందే పూర్తి ఆసక్తిని కల్పించెడు జ్ఞానము తామసికమైనదని చెప్పబడినది. అది యుక్తి సంగతము కానిది, తత్త్వరహితమైనది. ఇంకనూ తుచ్ఛమైనదని తెలియుము. (18/22)

**కృష్ణా! కర్మ మూడువిధములుగా నుండునంటివి గదా! అందులో సాత్త్విక కర్మ యెట్టిది?**

ఫలమునందు ఆసక్తిలేకుండా, రాగద్వేషములతో ప్రేరితము గాకుండా, కర్తృత్వము నందలి అభిమానము కూడా వదిలివేసి చేయబడునట్టి నియతకర్మ సాత్త్విక కర్మయని చెప్పబడుచున్నది. (18/23)

**రాజస కర్మ యెట్టిది?**

ఫలాపేక్షతో కూడినదై, అహంకారపూర్వకముగా, అతికష్టముతో చేయబడు కర్మ, రాజసకర్మయని పేర్కొనబడుచున్నది. (18/24)

**తామసిక కర్మ ఎట్లుండును?**

పరిణామమును, హానిని, హింసను, తన సామర్థ్యమును లెక్క చేయకుండా అజ్ఞానముచే ప్రారంభింపబడిన కర్మ తామసిక కర్మయని చెప్పబడుచున్నది. (18/25)

**కృష్ణా! మూడు విధములైన కర్తలలో సాత్త్వికమగు కర్త లక్షణము లెవ్వి?**

పార్థా! ఫలమునందు కోరిక లేనివాడు, (కర్తృత్వమునందు) అహంకారము లేనివాడు, ధైర్యమును, ఉత్సాహమును కలిగినవాడు, చేయబడిన కర్మలు

సిద్ధించినను, సిద్ధించకున్నను నిర్వికారముగ నుండువాడు అనగా హర్షశోకములు లేనివాడు అగు కర్తను సాత్త్వికుడని అందురు. (18/26)

**రాజసిక కర్త యెట్లుండును?**

రాజసికకర్త కర్మయందు ఆసక్తిని కలిగియుండును. కర్మఫలితమును ఆశించును. దురాశాపరుడై, ఇతరులను హింసించు స్వభావము కలిగియుండును. అపవిత్రుడై యుండి, హర్షశోకములలో మునిగియుండును. (18/27)

**తామసిక కర్త లక్షణము లెట్టివి?**

శ్రద్ధలేనివాడు. సంస్కారహీనుడు, గర్విష్ఠి, వంచకుడు (కపటస్వభావము గలవాడు) ధూర్తుడు, (ఇతరుల జీవనోపాధిని, వృత్తిని నష్టము చేయువాడు) కృతఘ్నుడు, సోమరితనము గలవాడు, ఏడుపు స్వభావము గలవాడు, దీర్ఘసూత్రీ అనగా త్వరగా పూర్తియగు పనిని ఆలస్యంగా చాలా సమయం వరకు చేసేవాడు, తామసిక కర్త అని చెప్పబడును. (18/28)

**కృష్ణా! ఇంతవరకు జ్ఞానము, కర్మ, కర్తల మూడేసి భేదములు చెప్పినావు. బాగుంది. ఇంకనూ మూడేసి భేదములతో తెలిసికొనవలసినవి ఏముండును?**

ధనంజయా! కర్మను సంగ్రహించు కరణములలో బుద్ధి మరియు ధృతి (ధైర్యము - ధారణశక్తి) చాలా ముఖ్యమైనవి. వాని భేదములను తప్పక తెలియవలెను. అందుచే ఇప్పుడు నీకు త్రిగుణములననుసరించి మూడేసి విధములుగా నుండెడు బుద్ధి, ధృతి యొక్క స్వరూపమును గూర్చి విశదముగ వివరించెదను. నీవు శ్రద్ధగా వినుము.

ఓ కుంతీపుత్రా! ప్రవృత్తి మార్గమును, నివృత్తి మార్గమును, చేయవలసిన కర్తవ్యమును, చేయకూడని - అకర్తవ్యమును, భయమును, అభయమును, బంధమును, మోక్షమును - వీటన్నింటిని గూర్చి చక్కగా, యథార్థముగా తెలియగలిగిన బుద్ధినే సాత్త్వికమగు బుద్ధి అందురు. (18/29-30)

**రాజసబుద్ధి అనగా నేమిటి?**

పార్థా! ధర్మమును, అధర్మమును గూర్చి కర్తవ్యమును, అకర్తవ్యమును గూర్చి యథార్థముగా తెలిసికొనని బుద్ధిని, రాజసబుద్ధియని గుర్తించుము. (18/31)

**ఇక తామసిక బుద్ధి ఎట్లుండును?**

పృథానందనా! తమోగుణముతో ఆవరించబడిన బుద్ధి ధర్మమును, అధర్మమైనదిగా, అధర్మమును ధర్మమైనదిగా లెక్కించును. ఇదేవిధముగా అన్ని విషయములను విపరీతముగా భావించునది తామసిక బుద్ధి యని యెరుగుము. (18/32)

**మధుసూదనా! సాత్త్విక ధృతి ఎట్లుండును?**

పార్థా! సమత్త్వముతో గూడిన అవ్యభిచారిణి అనగా సాంసారిక విషయమును నిరాకరించి భగవద్విషయమును ధరించునది యగు అవ్యభిచారిణీ ధారణాశక్తి ద్వారా మానవుడు మనస్సు ప్రాణము, ఇంద్రియముల చేష్టలను ధారణ చేయు ధృతి, సాత్త్విక ధృతి అనబడును. (18/33)

**రాజసిక ధృతి అనగా నేమిటి?**

అర్జునా! ఫలమునందు బలమైన కోరిక గల మానవుడు అత్యంత ఆసక్తి పూర్వకంగా ధర్మార్థకామములను ధారణ చేయగల ధృతినే రాజసికధృతి యందురు. (18/34)

**తామసిక ధృతి యెట్లుండును?**

పార్థా! దుర్బుద్ధిగల మానవుడు నిద్రను, భయమును, దుఃఖమును, మదమును కూడా విడిచిపెట్టకుండా ధారణ చేయగల ధృతిని తామసిక ధృతి యందురు. (18/35)

**తామసిక వ్యక్తి నిద్రాదులను ఎందుకు విడువడు?**

సుఖము, హాయి లభించుటవలన వాటిని విడువడు.

**కృష్ణా! సుఖమునందలి భేదములను తెల్పుము?**

అర్జునా! ఇప్పుడు నీవు మూడు రకములుగా నుండెడు సుఖమును గూర్చి వినుము. సాంసారికమైన ఆసక్తి కారణంగా మొదట విషమువలె కష్టమును, దుఃఖ ప్రదముగనయి అభ్యాసము వలన దుఃఖము యొక్క పారమును చేరి అమృతమయమగు ఆనందమున పరిణమించునదియు, పారమార్థిక విషయముతో గూడిన నిర్మలమగు బుద్ధియొక్క ప్రసన్నత్వము నుండి జనించునదియు నగు సుఖము సాత్త్వికమనబడును. (18/36-37)

**రాజస సుఖము అనగా నేమి?**

ఇంద్రియములకు ఆయా విషయ సంబంధమగు సంయోగము కలిగినప్పుడు ముందుగా అమృతోపమానమగు సుఖానుభూతి గలుగును. కాని వెంటనే అది విషతుల్యముగ పరిణమించును. ఇట్టి సుఖమును రాజసమైనదందురు. (18/38)

**ఇక తామస సుఖమెట్లుండును?**

నిద్ర, సోమరితనము, పరాకు వలన పుట్టి ఆదియందు, అంతమునందు ఆత్మను మోహింపజేయునట్టిది తామస సుఖము అనబడును. (18/39)

**ప్రభూ! ఈ మూడు గుణములు ఇంకనూ ఎక్కడెక్కడ నున్నవి? వీటిద్వారా ఇంకా ఏయే వస్తువులు మూడు విధములుగా అగుచున్నవి?**

బావా! భూలోకమందుగాని, స్వర్గము నందుగానీ, దేవతలలో గాని ముల్లోకముల యందును ప్రకృతి జన్యమగు ఈ మూడు గుణములచేత విడువబడిన వస్తువుగానీ, పదార్థముగానీ వేరేదియునూ లేదు. అనగా త్రిభువనములన్నియు త్రిగుణములలోనే యున్నవి. (18/40)

**కృష్ణా! ఈ గుణములనుండి తప్పించుకొనుటకు ఉపాయమే లేదా?**

ఎందుకు లేదు? పరంతపా! ఈ జగత్తునందు మానవుల స్వభావము నుండి జనించిన గుణముల ననుసరించి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్ణములు విభజింపబడినవి. కావున తమ తమ వర్ణముననుసరించి నియత కర్మను ఆచరించుట వల్లనే మానవుడు ఈ గుణములనుండి తప్పించుకొనవచ్చును. (18/41)

**దేవా! బ్రాహ్మణుని కర్మలెట్లుండును?**

1. మనస్సును నిగ్రహించుట (శమము) 2. ఇంద్రియములను వశపరచుకొనుట (దమము) 3. ధర్మపాలనకై కష్టమును సహించుట (తపస్సు) 4. బాహ్యాభ్యంతరములందు పవిత్రతను కలిగియుండుట. 5. ఇతరుల అపరాధమును క్షమించుట 6. శరీరము, మనస్సు మున్నగువాటి యందు ఋజుత్వమును కలిగియుండుట. 7. వేదశాస్త్రాదుల జ్ఞానాన్ని సంపాదించుట. 8. యజ్ఞవిధిని (పరమాత్మ తత్త్వమును) అనుభవమునకు తెచ్చుకొనుట (విజ్ఞానం) 9. పరమాత్మయందు, వేదములయందు శ్రద్ధ, విశ్వాసముల నుంచుట - ఇవన్నియును బ్రాహ్మణుని స్వాభావిక కర్మలు. (18/42)

**క్షత్రియుని కర్మలు ఏవి?**

1. శూరత్వము 2. తేజము 3. ధైర్యము 4. ప్రజాపరిపాలనాదులలో దక్షత 5. ఎట్టి సంకటమునందును, యుద్ధమునందును వెనుచూపకుండుట 6. దానము ఇచ్చుట 7. స్వామిభావము (శాసించుభావము) - ఇవన్నియు క్షత్రియుని స్వభావ జనిత కర్మలు. (18/43)

**వైశ్యుని కర్మలు ఎట్టివి?**

1. వ్యవసాయము చేయుట, 2. గోవులను రక్షించుట, 3. సత్యమైన వ్యాపారము చేయుట - అనునవి వైశ్యుని స్వాభావిక కర్మలు.

**శూద్రుని కర్మలెట్లుండును?**

సేవజేయుట - శూద్రుని స్వాభావిక కర్మ. (18/44)

**కేశవా! తమతమ స్వాభావిక కర్మలను చేయుటవలన లాభమేమి?**

అర్జునా! నిష్కామ భావముతో తత్పరతాపూర్వకముగా తమ తమ స్వాభావిక కర్మలనాచరించుట యందు నిమగ్నుడైన మానవుడు పరమాత్మను పొందును. (18/45)

**స్వాభావిక కర్మలను ఆచరించే తీరు ఎట్లుండాలి?**

ఏ పరమాత్మ నుండి సకల ప్రాణుల ఉత్పత్తి జరుగుచున్నదో, ఏ పరమాత్మచే ఈ సంపూర్ణజగత్తు వ్యాపించి యున్నదో, అట్టి పరమాత్మను తన స్వాభావిక కర్మలచే ఆరాధించి మానవుడు సిద్ధిని - పరమాత్మను పొందుచున్నాడు. (18/46)

**ప్రభూ! తన కర్మలనే ఎందుకు ఆచరించాలి?**

బావా! ఎన్నో ఉత్తమ గుణములను గలిగి తన పట్ల నిషేధింపబడిన ఇతరుల ధర్మము కంటే, తన ధర్మము దోష యుక్తము అయినప్పటికినీ దానిని ఆచరించుటయే మేలు. ఏలనన, స్వభావముచే నియతమైన (గుణహీనమైనను) స్వధర్మ రూపకర్తవ్యమును ఆచరించు మనుష్యునకు పాపము అంటదు. (18/47)

**తన ధర్మము (కర్తవ్యము) దోషయుక్త మెట్లగును?**

కౌంతేయా! దోషయుక్తమైనప్పటికినీ తన సహజకర్మను త్యజింపవలదు. ఏలనన, అగ్నిని మండించుటకు ముందు పొగ వెలువడినట్లుగా ప్రతికర్మ యొక్క ఆచరణమునందు ఏదియో ఒక దోషము ఉండనే ఉంటుంది.

(18/48)

**కృష్ణా! కర్మలవలన ఆవంత దోషము కూడా అంటకుండునట్టి ఇంకేదేని ఉపాయమున్నదా?**

అర్జునా! ఉన్నది. అదియే సాంఖ్యయోగము. అన్నిచోట్ల పూర్తిగా ఆసక్తి రహితమగు బుద్ధిగలవాడు, ఇంద్రియములు వశపరచుకొనిన వాడు, ఏ వస్తువునుగానీ, ఇతరములను దేనినీ కించిన్మాత్రముకూడా లక్ష్యపెట్టకుండా వుండెడు స్పృహారహితుడగు మానవుడు సాంఖ్యయోగము ద్వారా నైష్కర్మ్య సిద్ధిని పొందును. అనగా అతని కర్మలన్నియు అకర్మలైపోవును. అతనికి కర్మలయొక్క ఆవంత దోషము కూడా అంటదు. (18/49)

**ప్రభూ! నైష్కర్మ్య సిద్ధిని పొందుటెట్లు?**

కుంతీపుత్రా! పరిశుద్ధమగు అంతఃకరణసిద్ధిని పొందిన మానవుడు జ్ఞానయోగము యొక్క పరాకాష్ఠను అనగా నైష్కర్మ్యసిద్ధిని పొంది, బ్రహ్మమును పొందును. ఇట్లు జ్ఞానయోగ పరానిష్ఠను పొందెడు విధానమును ఇప్పుడు నీకు సంక్షిప్తముగా వివరించెదను. (18/50)

**అచ్యుత! అట్టి విధానము యొక్క క్రమము ఎట్లుండును?**

అర్జునా! వినుము; సాత్త్వికమైన బుద్ధియుక్తుడగు సాధకుడు సాత్త్విక ధృతి (ధైర్యము) ద్వారా ఇంద్రియములను, శరీరమును నియంత్రించవలెను. శబ్దాది విషయ భోగానుభవమును వదలిపెట్టవలెను. వ్యవహారమునందు రాగద్వేషములను త్యజించవలెను. ఏకాంతముగా నుండుట అభ్యసింపవలెను. సాత్త్వికమగు ఆహారమును మితముగా తీసికొనవలెను. మనస్సును, వాక్కును వశపరచుకొనవలెను. ఎల్లప్పుడు భగవద్ధ్యానమందు ఉండవలెను. సంసారము నందు దృఢవైరాగ్యమును కలిగియుండవలెను. అహంకారము, బలము, గర్వము (దర్పము), కామము (కోరిక) క్రోధము, పరిగ్రహము మరియు మమకారమును త్యజించవలెను. ప్రాపంచిక సంబంధమును వదలిపెట్టి శాంతియుతుడు కావలెను. ఇట్లు క్రమముగా ఎదిగిన సాధకుడు బ్రహ్మప్రాప్తికి పాత్రుడగుచున్నాడు. (18/51-53)

**భగవన్! ఇట్లు పాత్రుడయిన పిదప ఏమగును?**

పరబ్రహ్మప్రాప్తిని పొంది ప్రసన్న చిత్తమును గలిగిన సాధకుడు దేనికిని శోకింపడు. ఏదియూ కోరడు. అందువలన సకల ప్రాణుల యందు సమభావమును కలిగి యుండును. అప్పుడు అతనికి నా పరాభక్తి లభించును. (18/54)

**పరాభక్తి లభించుటచే ఏమగును?**

ఆ పరాభక్తి వలన అతడు నన్ను గూర్చి - 'నేనెవడను, ఎంతటి వాడను' అని ఇట్లు తత్త్వముతో యథార్థముగా తెలిసికొనినవాడై తత్క్షణమే నాలో ప్రవేశించును. (ఐక్యమైపోవును.) (18/55)

**ప్రభూ! నిన్ను పొందుటకు ఇంకేదైన శ్రేష్ఠమగు ఉపాయమున్నదా?**

లేకేమి అర్జునా! ఉన్నది. మిక్కిలి శ్రేష్ఠమగు ఉపాయము ఉన్నది.

**అదేమిటో తెలుపవా, తండ్రీ?**

అనన్యభావముతో నన్నే ఆశ్రయించిన భక్తుడు సర్వకర్మలను సదా నిర్వహించుచు కూడా నా కృపచే సనాతనమైన, అవినాశియగు పరమపదమును చేరుకొనును. (18/56)

**స్వామీ! నేనేమి చేయవలెను?**

మిత్రమా! నీవు కేవలము నా పరాయణుడవై నీ సర్వకర్మలను మనః పూర్వకంగా నాకే అర్పించి వేయుము. అనగా సకల కర్మలు, పదార్థములు మున్నగువాని యందు మమకారమును తొలగించివైచి, సమత్వమును గలిగినవాడవై నిరంతరము నా యందే మనస్సును నిలిపియుంచుము. (18/57)

**నీ యందే మనస్సును నిలుపుటచే ఏమగును?**

అర్జునా! నా యందే మనస్సు గలవాడవగుటచే నీవు నా కృపతో సమస్త ఆటంకములను, బాధలను అనాయాసముగ దాటిపోయెదవు. అటులగాక, ఒకవేళ నీవు అహంకారవశుడవై నా మాటను విననేని, పతనమై పోయెదవు. (18/58)

**పతనము యేల సంభవము, కృష్ణా?**

బావా! అహంకారమును ఆశ్రయించిన వాడవై 'నేను యుద్ధము చేయను' అని నీవు తలంచెడు నీ నిశ్చయము అసత్యము. ఏలయన, నీ క్షత్రియ స్వభావమే నిన్ను యుద్ధమునందు నిలుచునట్లు జేయును.

ఓ కుంతీపుత్రా! నీవు, నీ స్వభావ జన్యమగు కర్మచే బంధింప బడియున్నావు. అయినను మోహవశుడవై నీవు యుద్ధము చేయుటకు ముందుకు రావడము లేదు. కాని నీ క్షత్రియ స్వభావమునకు వివశుడవై నీవే ఈ యుద్ధమును చేయగలవు. (18/59-60)

**ప్రభూ! ఆ క్షాత్ర స్వభావము నాచే యుద్ధరూపమగు కర్మను ఎట్లు చేయించగలదు?**

ఓ అర్జునా! సర్వప్రాణుల హృదయములయందు అంతర్యామియగు ఈశ్వరుడు ఉన్నాడు. అతడు తన మాయచే శరీరరూపియగు యంత్రమును యెక్కి సమస్త ప్రాణులను వారి వారి స్వభావము ననుసరించి త్రిప్పుచుండును. (18/61)

**వాసుదేవా! ఈ పరతంత్రము నుండి బయటపడుటకు ఉపాయమేమున్నది?**

భరతవంశీయుడవగు ఓ అర్జునా! నీవు అన్నివిధముల ఆ అంతర్యామియగు ఈశ్వరునే శరణు బొందుము. అతని కృప చేతనే సంసారమునందు నీకు సంపూర్ణవైరాగ్యము లభించును. అవినాశియగు పరమపదము లభింపగలదు. ఇట్లు రహస్యములలో కెల్ల రహస్యమైన శరణాగతి రూపమగు జ్ఞానమును నేను వచించితిని. ఇక మీదట దీనిని గూర్చి నీవు చాల చక్కగా విచారించి నీకు ఇష్టమైన విధముగా ఆచరించుము. (18/62-63)

**నేను నా ఇష్టప్రకారముగా ఏమీ కోరడములేదు ప్రభూ! 'నేనేమి చేయవలెనో' నీవే తెలియజెప్పుము?**

అర్జునా! అన్ని రహస్యముల కంటె అత్యంత రహస్యమగు నా ఈ మాటలను నీవు తిరిగి ఇంకొకమారు వినుము. నీవు నాకు అత్యంత ప్రియమైన వాడవు. అందువలన ఇప్పుడు నేను, నీకు హితమును గూర్చుమాటను వినిపింతును. (18/64)

**భగవన్! నాకు హితమును గూర్చు ఆ మాటేది?**

నీవు నా భక్తుడవు కమ్ము. నా యందే నీ మనస్సును నిలుపుము. నన్నే పూజించుము. నాకే నమస్కరింపుము. ఇట్లు చేయుటవలన నీవు నన్నే పొందెదవు - ఇది సత్యమని నీ ముందే ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను. ఏలయందువా? నీవు నాకు అత్యంత ప్రియమైనవాడవు. (18/65)

**ఓ కృష్ణపరమాత్మా! ఒకవేళ నేను అట్లు చేయలేక పోయినచో...?**

ఓయి అర్జునా! సమస్త ధర్మముల ఆశ్రయమును వదలిపెట్టి నీవు కేవలము నన్ను మాత్రమే శరణుబొందుము. నేను నిన్ను సకల పాపముల నుండి విముక్తుని చేసి వేయుదును. కనుక నీవు శోకించవలదు. (18/66)

**ఆహా! ఇప్పుడు నీవు ఎంతో సులువైన, చాల గొప్పదైన మాటను తెలిపితి ప్రభూ! మరి ఇదే మాటను నేను అందరికి చెప్పవచ్చునా, తండ్రీ?**

లేదు, మిత్రమా! లేదు. అత్యంత గోపనీయమగు ఈ మాటను సహనములేని వానికి చెప్పకూడదు. నా భక్తుడు కాని వానికి ఎప్పుడు కూడా చెప్పకూడదు. వినుటకు ఇష్టపడని వానికి కూడా చెప్పవలదు. నా పట్ల దోష దృష్టి కలిగిన వానికి ఎన్నడూ దీనిని చెప్పవద్దు సుమా! (18/67)

**ఇదిగాకుండా నీవు చెప్పిన ఇతర విషయములను ఎవరికి చెప్పవచ్చును?**

నా భక్తులతో చెప్పవలయును. నా యందు పరాభక్తిని గలిగి, అట్టి ఉద్దేశ్యముతోడనే అత్యంత గోపనీయమగు ఈ గీతాశాస్త్రమును నా భక్తులకు తెలియజేయు మనుష్యుడు, నిస్సందేహముగ నన్నే చేరుకొనగలడు. ఇంతియేకాదు. అతని కంటే నాకు మిక్కిలి ప్రీతికరమగు కార్యమొనర్చువాడు మనుష్యులలో మరెవడును ఉండడు. అటులే వానికంటే నాకు ప్రేమాస్పదుడగు వాడు ఈ భూమండలము నందు వేరొకడు లేడు. ఉండబోడు.(18/68-69)

**ఒకవేళ ఇటువంటి కార్యమును ఎవరేని చేయలేకపోయినచో...?**

ధర్మమయమగు మన ఇరువురి సంవాదమును అధ్యయనమును చేయువాడు కూడా, తద్వారా అతడు నన్ను జ్ఞాన యజ్ఞముతో పూజించిన వాడగును - అని నా అభిప్రాయము. (18/70)

**ప్రభూ! అధ్యయనము కూడా చేయలేకపోయినచో?**

దోషదృష్టిలేని వాడగు మానవుడు శ్రద్ధా భక్తులతో నా ఈ (గీతా) ఉపదేశమును వినినా సరే, అతడు కూడ సకల పాపములనుండి విముక్తుడై పుణ్యకర్మలను ఆచరించు వారలు చేరుకొను ఉత్తమలోకముల కేగును. (18/71)

ఓ పార్థా! ఇప్పుడు నేను నిన్నొక మాట అడిగెదను. ఈ ఉపదేశము నంతయును నీవు ఏకాగ్రచిత్తముతో వింటివా? అయితే! ఓ ధనంజయా! అజ్ఞానమువలన ఉత్పన్నమైన నీ మోహము నశించినదా? (18/72)

అందులకు అర్జునుడిట్లు పలికెను - అచ్యుతా! నా మోహము నశించి పోయినది. (నిజస్థితి యొక్క) స్మృతి లభించినది. అయితే ఇదంతయును నీ కృపవల్లనే సంభవించినది. కాని ఉపదేశము వినుట వలన కాదు! ఇప్పుడు నేను సందేహరహితుడనై యున్నాడను. ఇక నీ ఆజ్ఞను నేను శిరసావహించెదను.

**సంజయుడిట్లనెను -**

ఓ రాజా! ఈ విధముగా నేను భగవానుడగు వాసుదేవుని మరియు మహాత్ముడగు అర్జునుని మధ్య జరిగిన రోమాంచకారియగు అద్భుతమగు సంవాదమును వింటిని. (18/74)

**సంజయా! ఈ సంవాదమును నీవు ఎట్లు వినగలిగితివి?**

అత్యంత గోపనీయమగు ఈ సంవాదమును వ్యాసమహర్షిగారి అనుగ్రహము వలన స్వయముగా యోగీశ్వరుడగు శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు ఉపదేశించుచుండగా నేను ప్రత్యక్షముగా వినియుంటిని. పరంపరాగతముగ వినినది కాదు. (18/75)

**ఓ సంజయా! ఈ సంవాదమును వినిన నీకు కలిగిన అనుభవమెట్టిది?**

ఓ ధృతరాష్ట్ర మహారాజా! శ్రీకృష్ణార్జునుల ఇట్టి పరమపావనమగు అద్భుతమైన సంవాదమును మరల మరల తలంచుకొనుచు మాటిమాటికి సంతసించుచున్నాను. (18/76)

**సంతసించుటకు ఇంకేదేని కారణము గలదా?**

మహారాజా! అత్యంత అద్భుతమగు శ్రీకృష్ణభగవానుని విశ్వరూపమును స్మరించినపుడెల్ల నాకు మీదు మిక్కిలి ఆశ్చర్యము కలుగుచున్నది. దానివలన నేను మరల మరల ఆనందమున మునకలు వేయుచున్నాను. (18/77)

**సంజయా! ఇప్పుడు నీవు ఏమని నిర్ణయించుకొంటివి?**

ఓ ధృతరాష్ట్ర మహారాజా! యోగేశ్వరుడగు శ్రీకృష్ణభగవానుడును, గాండీవ ధనుర్ధరుడగు అర్జునుడును ఉన్నచోటనే, సిరియు, విజయమును, విభూతియు (ఐశ్వర్యము), దృఢమైన నీతియు నెలకొని యుండును - ఇదియే నా నిశ్చయము.

(18/78)

'మోక్షసన్న్యాసయోగము' అనెడు
పదునెనిమిదవ అధ్యాయము ముగిసెను.



**హరిః ఓం తత్సత్ - ఓం శాంతిః శాంతిః శాంతిః**

**॥ సర్వం శ్రీకృష్ణార్పణమస్తు ॥**